# శిలాటవి



చైనాలోని యునాన్ ప్రావిన్స్‌లో సహజసిద్ధంగా ఏర్పడిన రాతి అడవిలో
భాగమైన పొడవాటి శిలలివి. రెండు చదరపు కిలోమీటర్ల పొడవున ఉన్న
ఈ శిలాటవిలోని సున్నపురాయి శిలలన్నీ పొడవుగా ఉండి ఎవరో తీరి కూర్చుని
అందమైన వివిధ ఆకృతులతో చెక్కినట్లుగా ఉంటాయి. ఐదారడుగుల నుంచి
వంద అడుగుల ఎత్తు వరకు ఉండే ఈ శిలలు అనేక మంది
చైనా కవులకు స్ఫూర్తిదాయకమయ్యాయి.

రసమయ నవలా తరంగం

సంపుటి : 29 | సంచిక : 3

ఏప్రిల్ : 2006 | 339వ సంచిక

# చతుర



## ఈ నెల నవల

వెంట ఉన్నది వెక్కిరించే జీవితమే అయినా
ఆటుపోట్లకు ఎదురీదిన ఓ మగువ గాథ



బొమ్మలు: పినిశెట్టి

రచయితలకు ప్రత్యేకం

కథలు- కబుర్లు (17)

# రచనకు మూలం 'చేతన'



టాల్‌స్టాయ్

లోపల ఏదో కదలిక వస్తే తప్ప రాయలేమని అందరికీ తెలుసు. అయితే, యింతకూ ఆ కదలిక ఎలా వస్తుంది? దాని కోసం నిరీక్షించాలా లేక రాయాలనుకున్నప్పుడు తెచ్చుకోవటం సాధ్యమా?

స్పందన (ఫీలింగు) లేని మనుషులుండరు. పెద్ద విషయాల దాకా ఎందుకు. చిన్న చిన్న సందర్భాలలో కూడా బాధపడతాం, ఆనందిస్తాం. కాని పక్క వాళ్లక్కూడా ఇలాంటి ఫీలింగ్సే ఉంటాయన్న స్పృహ మనకంతగా ఉండదు. కాస్త ప్రయత్నిస్తే సాటిమనిషి కష్టసుఖాల్ని అర్థం చేసుకోవచ్చు వ్యక్తి ఎదుగుదలకు, పరిపూర్ణతకు మొదటి మెట్టు పక్క మనుషుల్ని సంవేదనతో చూడగలగటం.

సంవేదనకూ, సహానుభూతికీ తేడా చూస్తారు రచయితలు, కళాకారులు.

టాల్‌స్టాయ్‌లాంటి వాళ్లు అందరి అంతరంగాల్లోకి ప్రవేశించి ఆయా వ్యక్తులు మన ముందు నిల్చుని మాట్లాడుతున్నట్టుగా రాస్తారు. ఆడా, మగా, వృద్ధులు, చంటి పిల్లలు- జార్జిచక్రవర్తి నుండి జట్కావాడి దాకా, చివరికి జంతువుల భాష కూడా! ('అన్నా కరెనినా' నవలలో గుర్రంతో సంభాషణ హైలైట్).

మనకు అనువాదం చేసి చెప్పినట్టుగా ఉంటుంది. ఒక్క వ్యక్తి ఇందరు వ్యక్తుల్లోకి పరకాయప్రవేశం చెయ్యగలిగాడు.

అందరూ టాల్‌స్టాయ్‌లు కారు.

కాని, ప్రయత్నించటంలో తప్పు లేదు. మొదట మన గురించి మనం ఆబ్జెక్టివ్‌గా తెలుసుకుని, ఎదుటి మనుషుల్ని గురించి

ఆలోచించటానికి ప్రయత్నించాలి.

ఈ ప్రక్రియలో- మన లోపాలను, బలహీనతలను గ్రహించిన స్పృహ మనలో కొత్త చైతన్యాన్ని జాగృతం చేస్తుంది.

కథలన్నీ, స్పందనల గురించే అనుకున్నప్పుడు, 'చేతన' రచనకు సహాయం చెయ్యదా మరి. మెరుపులాగ క్షణం కనిపించి కనుమరుగయ్యే 'సిగ్నల్స్' కోసం ఆంటెన్నాలు సిద్ధం చేసుకుని కూర్చుంటారు రచయితలు. ఇదో సాధన.

'అంతశ్చేతన' అంటే కఠినమైన పదంగా కనిపిస్తుందేమో గాని, ఇప్పటి దాకా మనం దాని గురించే మాట్లాడుకున్నాం. ఆలోచనల్లో పట్టుకోలేనిదేదో అనుభవంలోకి వచ్చినట్టనిపిస్తుంది. "ఒంటి మీద పాకినట్టు", "కడుపులో దేవినట్టు", "తల మీద బండరాయితో మోదినట్టు" వగైరా. వీటిని మరింత స్పష్టంగా అర్థం చేసుకోవటానికి టైం పట్టవచ్చు కృషి కూడా అవసరమే. కాని, ఈ అస్పష్ట అనుభవాల వెనక కథలు దాగున్నాయి- బహుశా, వాటి మూలాలు ఇక్కడే ఉన్నాయి. ఏ సంఘటన, ఏ వ్యక్తి, ఏ చర్య, ఏ దృశ్యం వీటిని ప్రేరేపించిందో గ్రహించి, దానికీ, ఈ స్పందనకూ సంబంధం ఏర్పరచి రాయగలిగితే కథ వచ్చినట్టే. కథ ప్రాణం పోసుకునే క్రమం ఇది. ఆ తర్వాత సహజంగానే అది ఎదుగుతుంది.



చెహోవ్

* * *

రచయితల పని పరిష్కారాలు చూపటం కాదు. కాకపోతే, సమస్యల్ని అర్థం చేసుకోవటం మాత్రం అవసరం. సామాజిక, ఆర్థిక, రాజకీయ సమస్యల గురించి స్పెషలిస్టులు చర్చిస్తారు. ఉదాహరణకు రోగికి చికిత్స చేసేది వైద్యుడే. కానీ, ఆ వ్యక్తి బాధనూ, బెంగనూ, అస్తిత్వ సమస్యలనూ అర్థం చేసుకునేది మాత్రం రచయిత.

"పరిష్కారాలు చూపటం సాధ్యమేనని ఎప్పుడూ కథలు రాయని వాళ్లు మాత్రమే వాదిస్తుంటారు" అంటాడు చెహోవ్.

రచయిత ఒక విషయాన్ని ఎంపిక చేసుకుంటాడు. తన కర్థమైనంతలో దాన్ని పాత్రల ప్రతిస్పందనల ద్వారా చిత్రిస్తాడు. ఇదే అతడి "దృష్టి", "విచక్షణ".

"ఏం రాశానో, ఎలా రాశానో తెలియదు. మొత్తం మీద రాశాను" అని ఎవరైనా ప్రగల్భాలు పలికితే, అలాంటి మనిషిని సైకాలజిస్టులు పిచ్చివాడి కింద జమకడతారు".

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు) ✦

ఇంగ్లీష్ నవల

# డేవిడ్ కాపర్‌ఫీల్డ్

(1849)



చార్ల్స్ డికెన్స్

కాలాతీతం

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

చార్ల్స్ డికెన్స్ ప్రసిద్ధ నవల డేవిడ్ కాపర్ ఫీల్డ్ చాలా పెద్ద నవల. అయితేనేం, సంభాషణల్లో హాస్యం, సెంటిమెంట్, డ్రామా కల గలిపి విసుగెత్తించకుండా చదివిస్తాయి.

1864లో తన పత్రిక "ఆల్ ది యియర్ రౌండ్"లో సంపాద కీయం రాస్తూ, "సాహిత్యమంతా "కాలక్షేపం" కథలకే ఎందుకు పరి మితం కావాలి? జీవితంలో ఎంత బాధ! ఎన్ని సందేహాలు. మంచి, చెడులకు మధ్య సంఘర్షణ నిరంతరం కొన సాగుతూనే ఉంటుంది. కాని ఒక పక్షం తీసుకోవా లనుకున్నపుడు ఎన్ని పొరబాట్లు చేస్తాం! మానవ స్వభావం అనేది ఒక అంతులేని లోయ. షేక్స్పి యర్‌తో సహా అందరూ అందులోకి తొంగి చూసే ప్రయత్నం చేస్తూనే ఉన్నారు" అంటాడు.

డికెన్స్ తొలి నవలల్లో కేవలం హాస్యముం టుంది. నవ్వులు పండించటమే వాటి లక్ష్యం. మానవ స్వభావంలోని చీకటి కోణాల్ని వెదికి పట్టు కునే దిశగా చేసిన రచనా ప్రస్థానానికి నాంది 'డేవిడ్ కాపర్ ఫీల్డ్'. డేవిడ్ తన స్వీయ కథ రాసు కున్నట్టుగా సాగుతుందీ నవల.

**ఇతివృత్తం:**

నేను పుట్టిననాటికి, మా నాన్న మరణించి ఆర్నెల్లు దాటింది. అందరూ ఆడపిల్ల పుడుతుంద నుకున్నారట. నన్ను చూసి పెదవి విరిచారు. ఇంట్లో నేనూ,అమ్మా, నా ఆయా పెగాటీ మాత్రమే ఉండేవాళ్ళం.

ఒకనాడు నాకో కొత్త నాన్న వచ్చాడు. ఆయన పేరు మర్డ్‌స్టోన్. మనిషి మంచివాడు కాదనిపిం చింది. ఆయనకూ నేనంటే ఇష్టం లేదు. ఏదో మిషతో నన్ను బెత్తం దెబ్బలు కొట్టేవాడు. భోజనం పెట్టకుండా కొన్నాళ్ళు గదిలో బంధించాడు. ఆ తర్వాత లండన్‌కు సమీపంలో ఉన్న సేలం హౌజ్ (స్కూలు)కు పంపించాడు. అక్కడ హెడ్మాస్టర్, మిగతా విద్యార్థులు నన్ను హింసించారు గాని స్టీర్ ఫోర్త్ అనే సీనియర్ మాత్రం నాకు రక్షణగా నిలి చాడు.

సెలవుల్లో ఇంటికొచ్చాను. తమ్ముడు పుట్టాడని

తెలిసింది. మరికొన్నాళ్లకే అమ్మ, పురిట్లోనే వాడూ మరణించారు.

మర్డ్‌స్టోన్‌కు నన్ను పోషించటం ఇష్టం లేదు. ఒక వైన్ బాట్లింగ్ ఫ్యాక్టరీలో పని చెయ్యమన్నాడు. అక్కడ నా జీతం వారానికి ఏడు షిల్లింగులు. అది నా భోజనానికి సరిపో తుంది. మిస్టర్ మికాబర్ వాళ్లింట్లో నా బస.

మికాబర్ మంచివాడే కాని పీకలదాకా అప్పుల్లో వున్నాడు. కష్టాలు తీరి మంచిరో జులు రాకపోవని ఆశ. కలలూ, పగటి కల లూ కంటూ రోజులు గడుపుతాడు. అప్పులి చ్చిన వాళ్లు ఎన్నాళ్లూరుకుంటారు! కోర్టుకీడ్చా రు. మికాబర్ డెటర్స్ జైలుకెళ్లక తప్పలేదు.

ధర్మాత్ముడొకాయన దయదలిచి మికాబర్ విడుదలకు సహాయం చేశాడు. "కొత్త జీవితం" ప్రారంభించటానికి మికాబర్ పోర్ట్స్‌మౌత్‌కు వెళ్లిపో యాడు.




నాకు తలదా చుకునే చోటు కూడా పోయింది. ఎక్కడుండాలి? మా ఆంటీ ఒకామె ఊళ్లో నే ఉందని జ్ఞాపకం వచ్చింది. వెదికి, డోవ ర్‌లో ఆ ఆంటీ- బెట్సీ- ఇంటికెళ్లాను.

అనాథలు ఎవరికైనా భారమే. ఆంటీ నా గురిం చి మర్డ్‌స్టోన్‌కు రాసింది. అతడు వచ్చి తీసుకుపోతాడే మోనని భయమేసింది. అయితే ఆవిడ నన్ను రక్షించింది. నా ముందరే మర్డ్‌స్టోన్‌ను చీవా ట్లేసి పంపింది.

ఆ తర్వాత నన్ను మరో స్కూల్లో చేర్పిం చారు. అక్కడ హాస్టల్ సదుపాయం లేకపో వటంతో ఆంటీ లాయర్ విక్‌ఫీల్డ్ గారింట్లో ఉండక తప్పలేదు. అంతా మన మంచికే. ఆయనకో కూతురుంది. పేరు ఆగ్నెస్. మంచిపిల్ల. త్వరలోనే మా యిద్దరికీ మంచి స్నేహం కుదిరింది.

అక్కడ మరో వ్యక్తితో కూడా పరిచయమే ర్పడింది. యూరియా హీప్ అనేవ్యక్తి లాయ రుగారి దగ్గిర అసిస్టెంట్. 'లా'లోని కిటుకుల్నీ నేర్చుకుని తన సీనియర్‌కు పార్టనర్ కావాలని అతడి కోరిక. అంతేకాదు. ఆగ్నెస్‌ను పెళ్లి చేసుకోవాలనే ఉబలాటం కూడా ఉంది. ఆ పిల్లకు వీడంటే రోత. ఒకసారి నన్నో కేసులో ఇరికించాలని చూశాడు. కోపం వచ్చింది. టపటపా నాలుగు దెబ్బలేశాను. నేను కొట్టగ లనని అనుకోలేదేమో! నివ్వెరపోయాడు. ఆ సంఘటన తరువాత వాడి నుండి ప్రమాదం పొంచి ఉందని పసిగట్టగలిగాను.

* * *

ఒకనాడు బాల్యమిత్రుడు స్టీర్‌ఫోర్త్ తారసపడ్డాడు. ఇంటికి తీసికెళ్లి తన తల్లినీ, రోజా డార్ట్ అనే మరో అమ్మాయినీ పరిచయం చేశాడు. రోజా అందమైన పిల్ల.

మా మాటల్లో ఆయా పెగాటీ ప్రస్తావన వచ్చింది. ఆమె బంధువుల పిల్లలు హాం, 'లిటిల్ ఎమిలీ' మాకు స్కూల్లోనే పరిచయం. వాళ్లంతా పేదవాళ్లు. స్టీర్‌ఫో ర్త్‌ది సంపన్న కుటుంబం. ఇప్పుడు లిటిల్ ఎమిలీ డ్రెస్‌మేకర్‌గా పనిచేస్తు న్నది. హాం బోట్లు తయారుచేస్తాడు. ఇద్దరికీ పెళ్లి నిశ్చ యమైంది.

అయినప్పటికీ స్టీర్‌ఫోర్త్ ఆ పిల్లమీద మనసు పడ్డాడని గ్రహించాను. అతడు హాం దగ్గర ఒక బోటు కొనుక్కుని దానికి "లిటిల్ ఎమిలీ" అని పేరు పెట్టాడు.

* * *

వెయ్యి గినీలు ఖర్చు పెట్టి ఆంటీ నన్ను మిస్టర్ స్పెన్లో దగ్గిర అసిస్టెంటుగా కుది ర్చింది. ఆయన కూతురు డోరా. తొలిసారి చూసిన క్షణాన్నే ఆ అమ్మాయి నా మనసు

## చార్ల్స్ డికెన్స్ (1812–1870)

డికెన్స్ బాల్యం దుర్భర దారిద్ర్యంలో గడిచింది. అందువల్ల స్కూలు చదువు సాగలేదు. పెద్దగా సాహిత్య పరిజ్ఞానము లేదు. అయినప్పటికీ ఇంగ్లీష్ సాహిత్య చరిత్రలోనే అతడు అత్యంత పాఠకాదరణ పొందిన రచయితగా గుర్తింపు తెచ్చుకున్నాడు. ఒక దశలో ఇంగ్లాండులోని అత్యధిక పాఠకులు డికెన్స్ అభిమానులేనట.

లండన్ నగరంలో తనకు తారసపడిన వ్యక్తుల్ని గురించి వ్యంగ్యంగా రాసిన "స్కెచెస్ బై బాజ్" (1836), పోస్థ్యూమస్ పేపర్స్ ఆఫ్ పిక్విక్ క్లబ్ (1836-37)లతో ప్రారంభమైంది డికెన్స్ రచనా జీవితం.

డికెన్స్ తత్కాలీన సమస్యల్ని ప్రధాన ఇతి వృత్తాలుగా తీసుకుని నవలలు రచించాడు. డికెన్స్ నవలన్నింటిలోకీ "గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్" (1860-61) అత్యుత్తమైనదంటాడు బెర్నార్డ్ షా. "వ్యక్తి జీవితంలోని వెలుగు నీడల్ని, ఆత్మగ్లానిని మనకు దర్శింపచేస్తుంది అనే షా అభిప్రాయంలో ఇది గొప్ప నవల. కాని ఇతర సాహిత్య కారులూ, విమర్శకులందరూ ముక్తకంఠంతో "గ్రేటెస్ట్"గా భావించింది మాత్రం ఆత్మ కథాత్మకమైన డేవిడ్ కాపర్ ఫీల్డ్ (1849-50).

డికెన్స్ తండ్రి గవర్నమెంటు క్లర్కు జల్సారాయుడు. అప్పుల అప్పారావు. అప్పులు ఎగ్గొట్టిన వాళ్లకోసం 'డెటర్స్ ప్రిజన్స్' ఉండేవి. సహజంగానే ఆయన

దోచింది. అటువంటి అందాల రాశిని అంత వరకూ చూడలేదు. ముగ్ధ మనోహర సౌందర్యం. ఆమె తండ్రికి నేను నచ్చలేదు. మళ్లీ ఆ ఇంటి ఛాయలకు రావద్దని తిట్టి పంపించాడు.

నా పాత టీచర్ డాక్టర్ స్ట్రాంగ్ వద్ద చేరి రచనాభ్యాసం ప్రారంభించాను. ఎలాగైనా డోరాను పెళ్లాడటమే నా జీవిత లక్ష్యం. షార్టు హాండ్ నేర్చుకున్నాను. పార్లమెంట్ డిబేట్లు పొల్లు పోకుండా రాయగలిగాను.

స్టీర్ ఫోర్త్ అప్పుడప్పుడూ కలుస్తూనే ఉన్నాడు. ఒకనాడు పెగాటీ ఇంట్లో కూర్చున్నప్పుడు పిడుగులాంటి వార్త తెలిసింది. హాం రొప్పుతూ వచ్చి చెప్పాడు.

"ఎమిలీ కనిపించటం లేదు. స్టీర్‌ఫోర్త్‌తో లేచిపోయింది. వాణ్ని వెదికి పట్టుకుని చంపెయ్యకపోతే నా పేరు..."

* * *

బళ్ళు ఓడలవుతున్నాయన్న మాట మరో మారు రుజువైంది. ఒకప్పటి తన అసిస్టెంటు యూరియా హీప్ వద్ద మికాబర్ ఇప్పుడు అసిస్టెంట్. హీప్ లాంటి నయవంచకులకీ లోకంలో కొదవలేదు గదా! వాడు తన యజమానిని మోసం చేసి, సంతకాలు ఫోర్జరీ చేసి ఆస్తి కబళించాడు. భగవంతుడన్నీ గమనిస్తాడు. మరికొన్నాళ్ళకు హీప్ ఒక బ్యాంకు దొమ్మీ కేసులో జైలు పాలయ్యాడు.

* * *

చివరికి డోరాతో నా వివాహానికి అన్ని అడ్డంకులూ తొలగిపోయాయి. ఆ అమ్మాయి మికాబర్ కూతురు ఆగ్నెస్ మంచి ఫ్రెండ్స్. డోరా ఆగమనంతో నా జీవితంలో కొత్త వెలుగు నింపింది. అంతా బాగానే ఉంది గాని నా భార్య ఇంకా చిన్న పిల్ల. గృహిణిగా బాధ్యతలు నిర్వర్తించడం ఆమెకు వయసుకు మించిన పని. పనిమనుషుల మీద అజమాయిషీ చెయ్యలేదు. ఇంటికి వచ్చిన అతిథులకే మర్యాదలు చెయ్యలేదు. రచయితగా నాకు గుర్తింపు వస్తోంది.

మరికొన్నాళ్లకు డోరా ఆరోగ్యం క్షీణించింది. డాక్టర్లు పెదవి విరిచారు.

డోరా వియోగంతో కుంగిపోయిన నన్ను ఆగ్నెస్ ఓదార్చింది.

...ఎమిలీ ఉత్తరం రాసింది. స్టీర్‌ఫోర్త్ ఆమెను యూరోపులో ఒంటరిగా వదిలేశాడట. ఎలాగో చివరికి లండన్ చేరుకుంది.

గారు కొంతకాలం అక్కడ ఆతిథ్యం స్వీకరించక తప్పలేదు. ఛార్ల్స్ స్కూలు కెళ్లలేదు. ఎంతో కొంత సంపాదించుకొ స్తాడని కొడుకును ఒక బ్లాకింగ్ (బూట్ల కేసే రంగు) ఫ్యాక్టరీలో పనికి కుద ర్చింది తల్లి. రచయితలకూ, పేదరికా నికీ విడదీయలేని సంబంధం ఉంటుంది. చార్ల్స్ ప్రత్యేకంగా కష్టాలు పడ్డాడనటానికి నిదర్శనాల్లేవు. కాని ఆ కొద్దిరోజుల ఫ్యాక్టరీ ఉద్యోగం అతడి మీద చెరగని ముద్ర వేసింది. ముఖ్యంగా తల్లి తన చేత ఇలాంటి పని చేయించటం బాగా గాయపర్చింది.

స్కూలు సంగతెలా ఉన్నా, ఆ తర్వాత వీలైనంత త్వరగా షార్టుహాండ్ నేర్చుకుని ఓ లాయరుగారి దగ్గర పనికి కుదిరాడు. మరికొన్నాళ్లకు పార్లమెంటు కార్యకలాపాలను రికార్డు చెయ్యగలిగాడు.

ఆ నాలుగు నెలల బ్లాక్టింగ్ ఫ్యాక్టరీ అనుభవం లేనట్టయితే డికెన్స్ రచయిత కాలేకపోయేవాడం టారు విమర్శకులు. కనీసం "డేవిడ్ కాపర్ ఫీల్డ్" మాత్రం సాధ్యపడేది కాదు. నవలలో డెటర్స్ జైలుకెళ్లిన మిస్టర్ మికాబర్ పాత్రకు ఆధారం అతడి తండ్రి జీవితమే. కథానాయకుడి (డేవిడ్ కాపర్ ఫీల్డ్) బాల్యానుభవములా రచయిత తన గురించి రాసుకున్నట్టుగానే ఉంటుంది.

రచనల సంగతి సరే పత్రికా సంపాదకుడిగా, వక్తగా, నటుడిగా వివిధ రంగాలలో అసామాన్య ప్రతిభావంతుడిగా రాణించిన డికెన్స్ జీనియస్‌కు మూలాలు అస్తవ్యస్తమైన బాల్యంలోనే ఉన్నాయి.

ప్రేమకు హృదయమే కాదు. ఆలోచన కూడా ఉండాలి. హాం ఇంకా తన కోసం నిరీక్షిస్తున్నా డని ఎమిలీకి చెప్పాను.

* * *

యార్ మౌత్ పోర్ట్ చేరుకున్నాను. తుఫాను వచ్చింది. వైన్ కాస్కెట్స్ నింపిన పడవ హార్బర్‌లో ఉంది. గూడ్స్ తీసుకురావ టానికి లైఫ్ బోట్‌లో హాం పడవ దగ్గరికె ళ్లాడు. నిలువెత్తు అలలతో నౌకలే కాగితపు పడవల్లా ఊగుతున్నాయి. సముద్రం అల్లకల్లో లంగా ఉంది. హాం హృదయంలో అంత కన్నా పెద్ద తుఫాను సుళ్ళు తిరుగుతోంది కాబోలు. లైఫ్ బోట్ పల్టీలు కొట్టింది. హాం శవం ఒడ్డుకు కొట్టుకు వచ్చింది. చలిలో, నీటి జల్లులతో తడిసి ముద్దైనాయి మా శరీ రాలు. పాపానికి, ద్రోహానికి నిష్కృతిగా కాబోలు స్టీర్‌ఫోర్త్ మృతదేహం కూడా హాం పక్కను వచ్చి చేరింది. చిన్నప్పుడు నేనూ ఎమిలీ ఈ ఇసుకలోనే ఆల్చిప్పలేరుకున్నాం. ఇద్దరం ఇప్పుడిలా...

* * *

పెగాటే, లిటిల్ ఎమిలీ, మికాబర్ మరి కొందరు ఆస్ట్రేలియా వెళ్ళి స్థిరపడ్డారు. రచయి తగా నాకు బాగానే పేరొచ్చింది. హాం, స్టీర్ ఫోర్త్‌ల మరణం ఎమిలీలో ఒక మార్పు తీసుకువచ్చింది. ఇప్పుడామెకు ప్రేమంటే ఒక భ్రమ.

డికెన్స్ ఇందులో సెంటిమెంటల్ కథనైతే రాశాడు గాని అతడి కుటుంబ జీవితం సుఖంగా సాగలేదు. పదిమంది పిల్లల తర్వాత భార్యాభర్తలు విడిపోయారు. మర దలి (భార్య సోదరి) మీద ప్రేమ. ఇలాంటి అనేక నిజజీవిత సంఘటనలు నవలలో నాట కీయంగా దర్శనమిస్తాయి.

మికాబర్, పెగాటే. హీప్ వగైరా పాత్రలు, ముఖ్యంగా కథానాయకుడు డేవిడ్, స్టీర్ ఫోర్త్, హాంలు పాఠకుల మనసుల మీద చెరగని ముద్ర వేస్తారు. డోరా గురించి రాసినప్పుడు మాత్రం రచయిత తనను తాను మరచిపోతాడు. ఎన్ని పేజీలు, ఎన్ని వర్ణనలో కాస్త అసహజంగా కనిపిం చినా, డికెన్స్ స్త్రీ వర్ణనలకు పరాకాష్ఠ డోరా.

డికెన్స్ 'చదువుకున్న' రచయిత కాదు. కాని తరువాతి తరాల రచయితలెవరైనా అతణ్ణి చదవక తప్పదు.

ఎం. వసంత ✦

ఆమె జీవితం ఆటుపోట్ల కడలి.
సర్వశక్తులు కూడదీసుకుని
అలుపన్నది మరచిపోతూ
ఆ కడలిలో ఈదుకుంటూ పోవడమే
తప్ప చేయగలిగింది లేదు. అందుకే
పడేవన్నీ కష్టాలనే విషయం విస్మరించి
భగ్గుమనే బతుకు కుంపటి సెగల్ని
తట్టుకుంటూ కూడా ఖచ్చితంగా బతకాలనే
ఏనాడో నిర్ణయించుకుంది. ఢీ కొట్టే ప్రతి
అలనూ తట్టుకునే ఒడ్డులా నిలబడింది.
దేనికోసమో పాకులాడడం కన్నా ఇదే... ఇదే...
నా జీవితం... ఇలాగే జీవించాలనుకుంటూ
ముందుకు అడుగేయడమే నిరంతర
కర్తవ్యంగా మలచుకుంది.

జీవితం వెక్కిరిస్తే కింద పడి, లేచి మళ్లీ
అందలాన్ని అందుకోవడానికి ప్రయత్నించినా
వెన్నంటి నడిచొచ్చే కష్టాలు, వెన్నువిరిచే
ఫైనాన్సు సంస్థలు, వడ్డీల బంధనాల్లో
చిక్కుకుపోయిన బడుగు బ్రతుకు
వేదనా స్రవంతిని సహజంగా చిత్రించిన
మంచికంటి నవల చీకటి వలయాలు
ఈ నెల చతుర సమర్పణ.



# చీకటి వలయాలు

— మంచికంటి

బైపాస్‌రోడ్డు దాటిన తరువాత కర్నూల్ రోడ్డు పొడవునా ఇరువైపులా పెరిగిపోయిన దుకాణాలూ, బిల్డింగులూ, కాలేజీలూ ఇండస్ట్రియల్ ఎస్టేట్‌ని కలుపుకుని పేర్నిమిట్ట సరిహద్దంటూ లేకుండా టౌన్‌లో కలిసిపోయింది.

పల్లెటూరు అయినప్పటికి రోడ్డుకి ఇరువైపులా కట్టిన కట్టడాల వల్ల ఒంగోలు పట్టణ వాతావరణాన్ని పొడిగించినట్టుగానే ఉంటుంది పేర్నిమిట్ట.

రోడ్డుకి ఇరువైపులా గోడౌన్‌లు, రైసుమిల్లులూ, కాలేజీలూ, మందుల ఫ్యాక్టరీలూ, గ్రానైట్ పాలిషింగ్ యూనిట్లూ, కూలీలూ, కాలేజీ పిల్లల్తో ఎప్పుడూ రద్దీగా ఉంటుంది.

చీమకుర్తి నుండి వచ్చేపోయే గ్రానైట్ వాహనాలు ఎప్పుడూ రొదచేస్తూ తిరుగుతూనే ఉంటాయి.

కర్నూలు, కనిగిరి, మార్కాపురం, గిద్దలూరు వెళ్ళే వాహనాలు కూడా అటే వెళుతుండడంతో ఆ రోడ్డు ఎప్పుడూ వాహనాలతోనే నిండిపోయి ఉంటుంది.

పాకలేంద్రం దాటిన తరువాత శ్రీ వెంకటేశ్వర రైస్‌మిల్ రోడ్డుకి ఆనుకుని కుడివైపున ఉంటే, దానికి ఎదురుగా రంగమ్మ టీ, టిఫిన్ సెంటర్ ఉంది.

చిన్న నిట్రాడి గుడిసె, గుడిసె పక్కగా చిన్న రేకుబంకు, బంకు ముందు టీ, టిఫిన్ పెట్టుకోవడానికి ఒక ఎత్తు బల్ల, దానికి ఇంకా ముందుగా వచ్చిన వాళ్లు కూర్చోవడానికి ఒక పొడవు బల్ల. బల్లమీద ఆ రోజు దినపత్రికలు ఉన్నాయి.

బంకులో చిల్లరమల్లర సరుకులతోపాటుగా కాలేజీ పిల్లలకు పనికివచ్చే రకరకాలైన వస్తువులు ఉంటాయి.

ఉదయాన్నే ఇడ్లీ, దోసె, పూరీ దొరుకుతాయి. టీ, కాఫీ, కూల్‌డ్రింక్స్ ఎప్పుడూ అమ్మకానికి సిద్ధంగా ఉంటాయి. ఎండాకాలంలోనైతే మజ్జిగ, కొబ్బరి బోండాలు కూడా దొరుకుతాయి.

సాయంత్రమైందంటే బోండా, బజ్జీ, గారెలు ఉంటాయి. గుడిసె వెనక కట్టుగొయ్యలకి కట్టేసి ఉన్న రెండు బర్రెలు ఎప్పుడూ మేత మేస్తూ ఉంటాయి. వాటికి పైనున్న వేపచెట్టే రాత్రి పగలూ నీడనిస్తుంది. ఆ బర్రెలిచ్చే పాలల్లో కాఫీ, టీ కోసం కొన్ని ఉంచుకొని ఉదయాన్నే రంగమ్మ చిన్న కూతురు ఇంటింటికీ తిరిగి పోసి వస్తుంది.

ఉదయం ఎనిమిది గంటలయిందని సూచిస్తూ మున్సిపాలిటీ సైరన్ కయ్యిమంటూ కేక పెడుతోంది. రోడ్డుమీద నిదానంగా మొదలైన వాహనాల రద్దీ క్రమేణా పుంజుకోసాగింది. ఇళ్ళనుండి నెమ్మదిగా జనాలు ముస్తాబై ఆఫీసులకి, స్కూళ్ళకీ, కాలేజీలకీ బయలుదేరుతున్నారు. రంగమ్మ పెద్ద కూతురు సుధారాణి కూడా 'అమ్మా ఆఫీసుకి వెళ్లొస్తా" అని చెప్పి బయలుదేరింది.

రంగమ్మ పొయ్యిలో బెట్టిన ఇటుకరాయి బాగా కాలిందో లేదోనని బయటికి తీసి చూసి, మసిగుడ్డతో పట్టుకుని పంటికేసి చిన్నగా కొట్టుకుంటోంది.

టీ పోయించుకోవడానికి రోజూ ఉదయాన్నే వచ్చే మునెమ్మ చిన్న టిఫిన్ పట్టుకుని వచ్చింది.

వస్తూనే ఎదురుగా కనిపించిన దృశ్యాన్ని చూసి తన కళ్ళను తానే నమ్మలేకపోయింది.

ఆశ్చర్యంగా నోరు తెరిచి "ఏంది రంగమ్మా! రాయి తీసుకుని పళ్ళకేసి అట్టా కొట్టుకుంటన్నావు?" అంటూ రాగం తీస్తూ అడిగింది.

"ఏం జెయ్యమంటావు మునెమ్మా, పళ్ళన్నీ ఒక్కొక్కటే వరసగా పుచ్చిపోతా ఉండయ్యి. ఆస్పత్రికి పోతే ఫీజు యాభై, పీకినందుకు డెబ్బై, మందులూ మాకులూ అన్నీ కలిసి రొండొందలు కావాల. ఆ రొండొందలూ ఉంటే ఏదో ఒక అక్కరకు అడ్డమొచ్చుద్దిగదా!" అంటూ రాయిని మళ్ళీ పొయ్యిలో పెట్టింది.

పంటిని చేత్తో వెనుకకూ ముందుకూ ఊపసాగింది. "ఏంది అట్టంటేనే పన్ను ఊడొచ్చుద్దా? ,మునెమ్మ నోరెళ్ళ బెట్టింది.

"నుంచోనే ఉండావేంది! కూర్చో మునెమ్మా. ఒక్కసారిగా లాగితే ఎట్టొచ్చుద్ది. వారంనించి

ప్రయత్నం చేస్తన్నా". ఇడ్లీ పాత్ర పొయ్యి మీద నుండి దించి, రంగమ్మ టీ గిన్నె పెట్టింది. పొయ్యి భగభగా మండుతోంది.

పొయ్యిలో పెట్టిన ఇంకో ఇటుకరాయి ముక్క వెచ్చబడిందో లేదోనని చేత్తో తాకింది. చుర్రుమని కాలడంతో, నోటితో చేతిని ఊదుకుంటూ, మసిగుడ్డతో రాయిని బైటికి తీసి, ఒక చేత్తో అద్దాన్ని పట్టుకుని నోరు తెరిచి అద్దంలోకి చూసింది. పళ్ళన్నీ అద్దంలో కనిపించాయి. ఎడమవైపు పుచ్చిపోయి నొప్పి పెడుతున్న పంటి వద్ద చెయ్యిపెట్టి, పెదాన్ని వెనక్కు నెట్టింది.

మసిగుడ్డతో ఇటుకరాయిని పట్టుకొని పంటిమీద పెట్టింది. వెచ్చగా తగిలేసరికి ప్రాణం చివ్వున లాగింది. అబ్బా అనుకుంటూ రాయి తీసి మళ్ళీ పంటిమీద ఉంచి గట్టిగా అదిమింది. పన్ను విపరీతంగా నెప్పెట్టింది. అబ్బా అనుకుంటూనే ఇంకా గట్టిగా అదిమింది. ఒక పలుకు పన్ను నుండి ఊడి కింద పడింది. తెల్లగా ఉన్న ఆ పలుకును చేత్తో తీసుకుని చూసి మళ్లీ ఇటుకరాయితో తట్టింది. నొప్పిని ఓర్చుకుంటూ ఈసారి ఇంకా గట్టిగా కొట్టుకుంది. కొద్దిగా మూలం కదిలినట్లు అనిపించింది.

అలా లోపలా బయటా చిన్నచిన్నగా తట్టుకుంటోంది. అటూ ఇటూ కదులుతున్న ఆ పంటిని చెయ్యిపట్టి ఊపింది. పన్ను కదలడంతో మళ్లీ మళ్లీ రాయితో కొట్టడం; చేత్తో కదపడం అలా... అలా... పన్ను వదులు కావడంతో ప్రాణం బిగబట్టి ఎడమచేత్తో గట్టిగా ఒక్కలాగు లాగింది.

దవడ ఎముకలో పాతుకుపోయిన పన్ను ఊడి చేతికి వచ్చింది.

ఆమె నోటినుండి అమ్మా అన్న వెర్రికేక కూడా వినిపించింది. దీంతోపాటు నోటిలో నుండి బొటబొటా రక్తం కూడా కారింది.

హడావుడిగా పైకిలేచి, లోపలికి వెళ్లి దూది తీసుకువచ్చి అద్దంలో చూసుకుంటూ పన్ను పీకిన దగ్గర తుడిచి, ఆ ఖాళీలో కొంత దూదిని అదిమిపెట్టింది.

## రచయిత పరిచయం


పూర్తి పేరు మంచికంటి వెంకటేశ్వరరెడ్డి. రచనలు మాత్రం మంచికంటి పేరుతో రాస్తారు. 'వసంతాల వూసెత్తకు', 'నీటి పొద్దు' కవితా సంకలనాలు, 'మేం పావురాల్ని ప్రేమిస్తాం' దీర్ఘ కవితను వెలువరించారు. వివిధ వార, మాస పత్రికలలో వచ్చిన కథలను కూర్చి 'యాతన' అనే కథా సంపుటి ప్రచురించారు. 2003లో తానా నిర్వహించిన కథల పోటీలో ప్రథమ బహుమతి పొందారు. కొంత కాలం ఉపాధ్యాయుడిగా పనిచేశారు. ప్రస్తుతం ప్రవృత్తినే వృత్తిగా స్వీకరించడంతో పట్టణాన్ని వీడి పల్లెటూరిలోనే ఉంటున్నారు. ప్రకృతితో మమేకమైన సహజ సిద్ధమైన జీవితమంటే మక్కువ కలిగిన మంచికంటి పల్లె ప్రజల జీవితాన్ని సాహితీకరించటంపై దృష్టి నిలిపారు. మరుగున పడిపోతున్న జానపదాల్ని వెలుగులోకి తీసుకురావాలని కృషి చేస్తున్నారు. ఒంగోలు - కొత్తపట్నంలో సాహితీ మిత్రుల్ని కలవడం, కలపడం, సమస్యల్ని చర్చించడం,సామాజిక ఉద్యమాలలో మమేకమై పని చేయడం ఆయన నిర్దేశించుకున్న కార్యక్రమాలు.

చిరునామా: మంచికంటి
బీచ్ రోడ్, కొత్తపట్నం.
ఒంగోలు - 523286.

ఆ దృశ్యాన్ని అలాగే చూస్తున్న మునెమ్మ ఒళ్లు గగుర్పొడిచింది. ఆమె కడుపులో దేవినట్లు అనిపించడంతో గట్టిగా కళ్లు మూసుకుంది.

"ఇదుగో రంగమ్మా చూసేవాళ్లకి ఎక్కడో కడుపులో చెయ్యిపెట్టి దేవినట్టుందే! అంత ప్రాణం పోయేపని చేస్తున్నావేంది!"

"ఇందులో అంత ప్రాణం పోయేదేముందే! ఆ ప్రసాదు దగ్గరకెళ్తే నాలుగు బిళ్లలిస్తాడు. అయ్యేసుకుంటే వారం రోజుల్లో నెప్పీ గిప్పీ దెబ్బకి పోయిద్ది" అంటూ పీకిన పన్నును తీసి దూరంగా విసిరేసింది.

"నీ అసుమంటోళ్లు ఉండాలే! ఇంక ఈ ఆసుపత్రులు ఎందుకూ? ఈ డాక్టర్లు ఎందుకు? అబ్బో బలే మొండిదానివే నువ్వు"

"ఇది నాకు కొత్తా! ఇప్పటికి రెండు పళ్లు ఇట్నే పీకేశాను. ఇది మూడోది" అంటూ పొయ్యిమీద టీ పాత్ర దించి, వడపోసింది.

మునెమ్మ అటువైపే చూస్తూ "మొత్తానికి బలే గట్టిదానివేనే! లేకుంటే ఒంటిచేత్తో ఇన్నిరకాల పనులు జెయ్యడం ఎవుడబ్బుతరం కూడా కాదు" అంటూ టిఫిన్ మూత తీసింది.

"ఎన్ని పొయ్యమంటావు?" అడిగింది రంగమ్మ.

"నాలుగు పోయ్" అంటూ టిఫిన్ చేతికి అందించింది.

టీ గ్లాసుతో మూడు గ్లాసులు పోసింది రంగమ్మ. నాలుగో గ్లాసు పొయ్యబోయేసరికి కొట్టు దగ్గరికి ఏదో బండి వచ్చినట్టు అనిపించడంతో గుండె దడదడ లాడింది. దాంతో చెయ్యి వణికింది. వేడివేడి టీ చేతిమీద పడింది. చెయ్యి చుర్రున కాలింది.

ఉదయం నిద్ర లేచినప్పటి నుండి గుండెల్లో గుబులు గుబులుగా భయం భయంగా అనిపిస్తోంది.

ఆ నెల్లో కట్టాల్సిన పెద్ద చీటీ డబ్బులు ఇంకా కట్టలేదు. అప్పటికి నాలుగుసార్లు వచ్చిపోయాడు నాగేశ్వరరావు. నెల మొదట్లో కట్టాల్సిన డబ్బులు చివర్లో కూడా కట్టవా ఏందని దబాయించి పోయాడు. ఈ రోజు ఎట్టి పరిస్థితుల్లోనూ ఇయ్యకపోతే మర్యాద దక్కదన్నాడు.

అయ్యీ ఇయ్యీ అన్నీ పోగేసినా కట్టాల్సిన దాంట్లో సగమన్నా కాలేదు. అందుకే రోడ్డుమీద ఏ బండి చప్పుడు విన్నా నాగేశ్వరరావు వచ్చాడేమోనని చేసే పనిని ఆపి మరీ చూడడమైంది అనుకుంటూ టిఫిన్ మునెమ్మ చేతికిచ్చి డబ్బులు తీసుకొని బాక్సులో వేసుకుంది.

టిఫిన్ తినేవాళ్లూ, టీ తాగేవాళ్లూ ఒక్కొక్కరే నెమ్మదిగా రావడం మొదలయింది. పొయ్యిమీద పెనం బాగా కాలి వేడెక్కింది. ఇడ్లీ, దోసె, టీ, కాఫీ ఎవరికి కావాల్సినవి వాళ్లకు అందిస్తూ గుండెల్లో గుబులును తాత్కాలికంగా ఒక పక్కకు నెట్టేసి వేగంగా అటూ ఇటూ తిరుగుతూ అన్ని పనులూ చేసుకుపోతోంది.

చెప్పినట్టుగానే నాగేశ్వరరావు బుర్రుమంటూ శబ్దంచేస్తూ, వచ్చి రోడ్డు పక్కన బండిని ఆపి, దానిమీద అలాగే కూర్చుని సిగరెట్ ముట్టిచ్చాడు.

మెళ్లో పలుపుతాడు లాంటి లావు



ప్రాటి బంగారు చైనూ, ఎడమచేతి వేళ్లల్లో మూడు వేళ్లకి ఉంగరాలు, కుడి చేతికి బ్రాస్‌లెట్. మనిషి మాత్రం చూడ డానికి యమకింకరుడులాగా ఉన్నాడు.

వచ్చీరావడంతోనే 'రంగమ్మా' అంటూ కేకేశాడు. నాగేశ్వరరావుని చూడడం తోటే పరిగెత్తుకుంటూ ఇంట్లోకి వెళ్లి, పప్పుల డబ్బాలో దాచిపెట్టిన డబ్బులు తీసుకొని అదే పరుగుతో బైటికి వచ్చి నాగేశ్వరరావు దగ్గరగా వచ్చి భయంభయంగా చూస్తూ అతని చేతిలో పెట్టింది.

"అయ్యా" అంటూ ఏదో చెప్పబోయి మధ్య



లోనే ఆగిపోయింది. ఏందన్నట్టు తలకిందకి వంచి కళ్ళద్దాల పైకుండా చూస్తూ తలపైకీ కిందకీ ఆడించాడు.

"అయ్యా, ఇంకా రెండు వేలు కొరవ పడత న్నయ్యి" అంది చేతులు నలుపుకుంటూ.

మేక మీదకు దాడి చెయ్యబోయే పులిలాగా చూశాడు నాగేశ్వరరావు. ఆ చూపులకి ఆమె గజగజా వణికిపోయింది. గుండెల్లో గుబగుబ లాడింది. పెనుగాలికి కదులుతున్న తీగలా కంపించిపోయింది.

చేతిలోకి తీసుకుని లెక్కపెట్టుకోబోతున్న నోట్లు విసిరి రంగమ్మ మొహానికేసి కొట్టాడు. కిందపడ్డ ఆ నోట్లను ఏరసాగింది రంగమ్మ.

"ఏం ముష్టి అడుక్కోవడానికి వచ్చాననుకు న్నావా! నాలుగు నెలల్నుంచి చూస్తున్నాను. ప్రతినెలా ఇదే తంతయితే ఏంది మేం బిజి నెస్ చేసేది! మర్యాదగా ప్రతినెలా ఐదో తేదీ కల్లా డబ్బుంతా కట్టు. ఎవుడబ్బ సొమ్మందని లక్ష రూపాయల చీటీ పాడుకొచ్చావమ్మా. అప్పుడు డబ్బులియ్యడం రెండు రోజులు ఆల స్యమయ్యేసరికి లగలగాలు జేస్తివే! ఇప్పుడు కూడా చూపిచ్చమ్మా ఆ తొందర. ఇంకా రెండు రోజులు టైమిస్తున్నా. మర్యాదగా డబ్బులు మొత్తం కడతావా కట్టు. లేదా నువ్వా ఉండవు. నీ కొట్టూ ఉండదు" అంటూ బెదిరించి, నిర్లక్ష్యంగా మోటర్ సైకిల్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు.

నాగేశ్వరరావు వెళ్ళిపోవడంతో ఆ దడతోనే వెనుదిరిగిన రంగమ్మ కస్టమర్లందరూ ఆమెనే గుచ్చిగుచ్చి చూస్తుండడంతో, వాళ్ళ మొఖాల వంక చూడలేక తలదించుకుంది. ఎక్కడో గుండెల్లో నుంచి ఎగదన్నుకొస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ టిఫిన్ అందించింది. 'వీడొచ్చిన ప్పుడల్లా కస్టమర్ల ముందు గోలజేసి పరువు తీస్తన్నాడు. వాళ్ళందరి ముందూ తల కొట్టేసి నట్టు అయిపోతోంది. ఏం జేద్దాం ఎంత పరి గెత్తినా ఏమీ చెయ్యలేకపోతుంటినే' అను కుంటూ దోసెలు వెయ్యసాగింది.

"అమ్మా నేనింక పాలు దీసుకొని ఆ రామా నాయుడు గారింటికి పోనమ్మా" అంటూ పాల క్యాన్ తీసుకొచ్చి అక్కడ పెడుతూ ఏడు స్తున్నట్టుగా చెప్పింది కూతురు సుజాత.

"ఏందే నీ గోల! బొత్తిగా ఇరంపరం లేని మనుషులయ్యారు" అంటూ నాగేశ్వరరావు మీద కోపం కూతురు మీద చూపింది.

"ఏందమ్మా చెబుతుంటే అర్థం చేసుకో కుండా నన్ను విసుక్కుంటావు. ఎన్నిరోజులు పాలుబోసి నా బాకీ తీరుస్తది మీ అమ్మ. ఎట్టాగా నా బాకీ తీరేది లేదూ! అంటూ రోజూ ఒకటే పనిగా గోలచేస్తున్నాడా! ఇయ్యాల ఏకంగా చెయ్యే పట్టుకున్నాడు" దుఃఖం పొంగుకొస్తున్న స్వరంతో చెప్పింది.

"చెయ్యి పట్టుకున్నాడా!" ఆశ్చర్యంగా అడి గింది రంగమ్మ.

"ఆ! మా ఇంట్లో ఉండిపోవే. ఎట్టాగూ మీయమ్మ నిన్ను వాడి కాడికీ వీడికాడికీ షాపుల్లో కూలిపనులు చెయ్యడానికి పంపు తోంది గదా! అదే మా ఇంట్లో ఉండి నాకూ మా వాళ్ళకీ పనులుజేసి పెట్టావంటే సొంత మణిసిలాగా చూసుకుంటాను అంటా పట్టు కొని లాగేడమ్మా" అంటూ ఏడ్చేసింది.

"ఊరుకోమ్మా ఊరుకో. దరిద్రం నెత్తికెక్కితే ఎవరు మాత్రం ఏం జేస్తారు. రేపు నేనొస్తాలే నువ్వుపో ఎండబడిపోయింది. తొందరగా షాపుకెల్లు. మళ్లీ అక్కడ చివాట్లు పెడతాడా యన" అంటూ తొందరచేసింది.

"అమ్మాయ్, ఇట్రామ్మా. ఆ ఉమ్మి గిన్నె కనపళ్ళేదు చూడమ్మా" అంటూ వంగుని మంచం కిందకు చూస్తూ పిల్చింది సుబ్బు లమ్మ మనవరాల్ని.

"ఏహే నీదాక గోలేంది!" జడలు విప్పదీసు కుంటూ ఇంట్లోకి వచ్చింది సుజాత.

"అదుగోమ్మా అటుపోయినట్టుంది. ఇటి య్యమ్మా" అంటూ గిన్నె వంక చెయ్యి చూపించింది.

"ఏంది, నీదాక సోపయిపోయింది ఇంట్లో. అందరికీ పని చెబుతావు. నీకు చెయ్యలేక చస్తన్నాం" అంటూ గిన్నెతీసి చేతికి అందిం చింది.

చేతిలో గిన్నె నోటికి దగ్గరగా పెట్టుకుని

తుపుక్కున ఊసి గిన్నె మంచం కింద బెట్టి మూతి తుడుచుకొని పడుకుని సుజాత వంకే చూస్తూండిపోయింది సుబ్బులమ్మ.

సుజాత త్వరత్వరగా స్నానం చేసి రడీ అయిపోయి హడావుడిగా షాపుకెళ్లిపోయింది.

టిఫిన్ సెక్షన్ ముగిసేసరికి పదకొండు గంటలు దాటింది. అంట్లన్నీ తోమేసి, సర్దేసి అప్పుడు మొహం కడుక్కుని మిగిలిపోయిన నాలుగు ఇడ్లీలు ఉంటే తిని, నరసింహారావు ఇంటికి బయలుదేరింది రంగమ్మ.

'బర్రెని తోలుకొని పోయి ఎన్ని రోజులైంది. బర్రె ఈనను గూడా ఈనింది. సూడి బర్రెని తోలుకోని పోయినవాళ్లు ఇప్పుడు పాలు పిండుకొని గూడా తాగుతున్నారు. అయినా ఆయనకి ఇంతవరకూ డబ్బులు ఇయ్యడానికి పేణ మొప్ప లేదు.

> అక్కడ నేనేమన్నా కువ్వలు కువ్వలు పోసుకునుంటే, పోనియ్యిలే ఇయ్యాల గాకపోతే రేపిస్తారు అనుకోవచ్చు అవతల అప్పులోళ్లు చెప్పు తీసుకోని కొడతండారు

అక్కడ నేను ఇయ్యాల్సినోళ్లేమో నన్ను పీక్కుతింటున్నారు. నాకు ఇయ్యాల్సినోళ్లేమో మొహం తప్పిస్తా ఉంటిరి. ఏం జెయ్యాల! ఎక్కడుంది న్యాయం' అనుకుంటూ నరసింహారావు ఇంటికొచ్చింది. గేటు శబ్దం కావడంతో బయట మంచమ్మీద పడుకుని ఉన్న సుబ్బాయమ్మ కళ్లు తెరిచి చూసింది.

రావడమే కొంచెం కోపంగా వచ్చిన రంగమ్మకు హాయిగా పడుకుని ఉన్న సుబ్బాయమ్మను చూడడంతోటే కడుపు మండిపోయింది.

"ఉండాడా మీ ఆయన? " అంది కోపంగా.

ఆ మాటకు ఉలిక్కిపడి చూసి, కోపంగా రంగమ్మవైపు చూసింది సుబ్బాయమ్మ.

"అదిగాదూ ఆ రోజూ... ఆ రోజేమన్నారూ! మొత్తం డబ్బులు కట్టి బర్రెని తోలకపొమ్మంటే, కాదులే రంగమ్మ రెండేలు కొరవపడినియ్యి తరవాత ఇస్తాంలే, నీ రొండేలు కోసం ఊరిడిసి పెట్టిపోతామా అన్నారు. మరీ కూలికి విషం తాగుతామా అని సరేలే అని తోలిపెడితిని. అప్పటినుంచి ఇప్పటికి మీకు ఇయ్యటానికి తీరకపోతే ఎట్ట? అక్కడ నేనే మన్నా కువ్వలు కువ్వలు పోసుకునుంటే, పోనియ్యిలే ఇయ్యాల గాకపోతే రేపిస్తారు అనుకోవచ్చు అవతల అప్పులోళ్లు చెప్పు తీసుకోని కొడతండారు. మీకిచ్చి కుడితిలో పడ్డ ఎలకలాగయింది నాయవ్వారం".

ఆపకుండా తగాదాలాగా పెద్ద పెద్దగా అరుస్తున్న రంగమ్మ కేకలకు దొడ్లో నుండి నరసింహారావు హడావిడిగా వచ్చాడు.

ఆయన్ను చూసిన రంగమ్మ మాట్లాడటం ఆపేసింది.

"ఏంది రంగమ్మా ఏంది? ఇంటి మీదకు తగాదాకు వచ్చావా ఏంది? " అన్నాడు నరసింహారావు కోపంగా.

"తగాదా ఏంది? అవతల నన్ను పీక్కుతినేవోళ్లు పీక్కు తింటున్నారు. ఇంటిమీద కొచ్చి తన్నబోతున్నారు. అయినా బర్రెని తోలుకొని వచ్చి ఎన్నిరోజులైంది. మా రాజుల్లాగా పిండుకొని తాగుతుండారుగా. అవతల నేను కట్టాల్సినోళ్లు వూరుకుంటారా? " అంది కోపంగా.

"ఏందసలు నువ్వు మాట్లాడేది. ఇంత తగాదాగా మాట్లాడితే భయపడతామనుకున్నావా ఏంది? నీకు అప్పులుంటే అయ్యన్నీ మమ్మల్నొచ్చి కట్టమంటావా ఏంది? " అంటూ కోపంగా ముందుకొచ్చాడు నరసింహారావు.

దాంతో రంగమ్మ ఎటొచ్చి ఎటుపోతుందోనని మౌనంగా ఉండిపోయింది. "అందుకనే ఇయ్యంది. మా దగ్గర ఉంచుకోని నీకు ఇయ్యకపోతే బాధపడాలగానీ! పెద్ద పెద్దగా రంకెలేసుకుంటే వస్తయ్యా డబ్బులు" అంటూ పోయి మంచమ్మీద కూర్చున్నాడు.

"నాయి రంకెలా. నేను తగాదా బెట్టుకోవడానికి వచ్చానా! నాకు రావాల్సిన డబ్బులు

ఇవతల పార్కుకితే నేనేందుకు వస్తాను" కడుపుమంట ఆపుకోలేకపోయింది రంగమ్మ.

"ఇదిగో రంగమ్మా నువ్వు ఆవేశంగా ఉండావుగానీ తరువాత రాపో మాట్లాడదాం" అన్నాడు నరసింహారావు. చుట్టుపక్కల వాళ్లు తొంగిచూడడంతో.

"ఏంది తరవాత వచ్చేది. ఎప్పుడొచ్చినా ఇట్టనే చెబుతుంటిరే! యెనక అడిగేవాడెవుడూ లేడనేగా మీ ఉద్దేశం" ఇంకా కోపం హద్దులు దాటుతున్నా, తమాయించుకునే అడిగింది.

నరసింహారావుకి కోపమొచ్చింది. "ఏంది? మనిషివి, అంతలావున చెబుతుంటే నీగ్గాదూ! ఉంటే నీచేత ఇన్ని మాటలు అడిగిచ్చుకుంటామా! ఇప్పుడు లేకనే గదా! తరవాత రమ్మంటుంది" బెదిరించాడు.

"ఇంకా ఎన్నిసార్లు తిప్పుతారు. ఆడ పని వదులుకోని చుట్టుకి చుట్టు రోజూ మీ ఇంటి చుట్టూ తిరగాల్సివస్తంది. ఇదేమన్నా న్యాయంగా ఉందా మీకు" ఏడుపు దిగమింగుకుంటూ అంది రంగమ్మ.

"న్యాయమో! అన్యాయమో! నీకు ఇయ్యాల్సిన మాట నిజమే! మా దగ్గర లేవు. కాస్త నిదానంగానే ఇస్తాము. నువ్వు ఎన్ని మాట్లా



డినా ఇప్పటికిప్పుడు చెట్లకేమీ కాయవు లేదనుకుంటావా! ఇదుగో నీ బర్రె కళ్ల ముందే ఉంది. మా డబ్బు మా మొకాన పార్నాకి తోలుకొ పో లేదా మేం ఇచ్చిందాకా ఆగు. రోజుకొక వరస మా ఇంటిమీదకొచ్చి గొడవ చేస్తే మాత్రం పద్ధతిగా ఉండదు" చివరిసారిగా బాణం వదిలాడు.

'డబ్బులు తిరిగి ఇయ్యలేననేగా ఆ విధంగా అనడం' అనుకుంటూ ఇంక చేసేదేమీలేక ఏడుపు ముఖంతో కళ్లల్లో తిరుగుతున్న కన్నీళ్ళని ఆపుకుంటూ వెనక్కు తిరిగింది రంగమ్మ.

'నాకియ్యాల్సినోళ్ళు ఇట్టా చస్తున్నారు. నేనియాల్సినోళ్ళేమో ఇంటిమీద పడి పీక్కుని తింటన్నారు. ఏం జేసేటట్టు? అయినా ఎంత దుర్మార్గపు కాలమొచ్చింది. డబ్బులియ్యకపోగా పైగా బెదిరింపులొకటి. ఏం జేస్తాం. రోట్లో తలబెట్టినాక రోకటిపోటుకి భయపడితే ఎట్ట' అని తనకు తానే సమాధానపరచుకుంది.

నోటూ లేదూ. పత్రం లేదూ. నేను నీకు ఇయ్యాల్సిన పనిలేదుపో అంటే ఎవుడేం జేస్తాడు. అంతమాత్తరపోడే వాడు. కంప మీద గుడ్డేశాం. ఎట్టోకట్ట లాక్కోవడమేగానీ తొందరపడి లాభం లేదు.

అయినా కాలం ఇట్టా మారిపోయిందేంది! పాపం కొండలా పెరిగిపోతంది. తీసుకున్నోళ్ళు ఇస్తారన్న గేరంట్రీ లేకుండాపోయిందీ!

మాటమీద నిలబడేవాళ్ళే కరువైపోయారు. నాన్న ఇంటికోసరం ఎన్నో అప్పులు చేశాడు. ఎవర్కైనా ఒక్క పైసా ఎగ్గొట్టేడా అణా పైసల్తో సహా లెక్కజూసి కట్టేవాడు. ఒక్క రూపాయి కూడా తోసేసుకోమనేవాడు కాదు. ఎదుటివాళ్ళు దాన్దేముందిలే అని కాస్తా కూస్తా తోసేస్తే, అబ్బే వల్లకాదని చిల్లర పైసల్తో సహా ఇచ్చేసేవాడు.

ఇంట్లో అటకమీద దాసిపెట్టిన డబ్బాలో అణా బిళ్ళలు చింపేసిన నోట్లు ఎన్ని ఉండేయని. ఒక కట్టుండేవి. ఎంతమందికి రాసిచ్చి తెచ్చేవాడో!

నోట్లు కూడా లేకుండా నోటిమాట మీద, గుర్తు లెక్కమీద ఎంతెంత డబ్బులు చేతులు మారాయనీ. ఒక నెలకీ రెణ్ణెల్లకీ అయితే నోటు ఉండదు. పత్రం ఉండదు. వడ్డీ ఉండదు. వాడుకునే వాళ్లంతే. సత్తెకాలం-సత్తెపు రోజులు.

ఎంత అప్పిచ్చినా, ఎంత తెచ్చుకున్నా ఎవరూ ఒకమాట అనుకున్నట్టుగానీ, తగాదా పడ్డట్టుకానీ ఎప్పుడూ చూళ్ళేదు. సొంత ఇంట్లో డబ్బులు ఎత్తుకునిపోయినట్టే ఉండేది. ఇవి నాయీ నీయీ అన్నట్లు కాకుండా అవసరానికి వాడుకో అన్నట్టు ఇచ్చేవాళ్ళు.

ఒకరి కష్టమ్మీద బతకాలని ఎవరూ కోరుకునే వోళ్ళు కాదు. అసలు వడ్డీల మీదబతకాలని ఎవరో నూటికో కోటికో సావుకారులాంటోళ్లు మాత్రం ఉండేవాళ్ళు. అందరూ రెక్కల కష్టాన్ని నమ్ముకొని బతికేవాళ్ళే.

ఇప్పుడేమో ఐదూ పది రోజులకి కూడా నెల రోజుల వడ్డీలు కట్టాల్సిందే! ఆ నాటికీ ఈనాటికీ కాలం మారేకొద్దీ మనుషుల్లో ఎంత మార్పొచ్చిందీ!

ఎవరూ ఎవరికీ ఎగ్గొట్టినట్టు గానీ, ఆ డబ్బుల దగ్గర ఎవరూ ఎవరినన్నా ఒక్క మాట అన్నట్టుగానీ ఎప్పుడూ చూళ్ళేదు. ఎంత సత్తెకాలం. సత్తెపు మనుషులు' అనుకుంటూ గతంలోకి జారిపోయింది రంగమ్మ.

## 2

ఆ రోజు ఏరువాక. ఏరువాకంటే పిల్లలకు, పెద్దలకు, జీతగాళ్ళకి, సేద్యం చేసేవాళ్ళకి ఎంతో ఆనందకరమైన రోజు.

తొలకరి చినుకుల మైమరపులతో రైతులంతా నాగళ్ళు చెక్కిస్తూ, కర్రులు సరిపిస్తూ కొత్త సేద్యాలకు సిద్ధమవుతున్నారు. కొంతమంది వేపచెట్ల చల్లటి నీడలో బళ్ళమీదకు కంది కంపతో జల్లలు అల్లుతున్నారు. ఇంకొంతమంది దిబ్బలమీద ఎరువును పొలాల్లోకి తోలడం మొదలుబెట్టారు.

నెలరోజులముందే భోగి మంటలకు కంప పోగేసుకునే సంక్రాంతి పండగకంటే, వారం రోజులపాటు దివిటీలు తిప్పి ఏడోరోజున

నరకాసురుడిని కాల్చేసి తరువాత రోజు ఆనందంగా టపాకాయలు కాల్చేసే దీపావళి కంటే, వేకువజామునే నిద్రలేపి నాలుగు మైళ్ళు నడిచి పత్రి తెచ్చుకొని ఒక పొద్దుండే వినాయకచవితికంటే, పిల్లలంతా ఇష్టంగా ఎదురుచూసేది ఏరువాక పౌర్ణమికి వచ్చే సింగరాయకొండ తిరణాలకోసమే.

అటు కావలినుండి ఇటు ఒంగోలు దాకా జరిగే తిరణాలల్లో పదకొండు రోజులపాటు జరిగే పెద్ద తిరణాలు ఇదే కావడంతో చుట్టు పక్కల చుట్టాలంతా ఇళ్లకు వచ్చి ఊరంతా సందడి సందడిగా ఉంది.

నెల రోజుల ముందే కొత్తగుడ్డల కోసం మారాం జేసిన పిల్లల్తోపాటు రంగమ్మ కూడా మస్తాను మిషను కాడ బట్టలు ఇచ్చినప్పట్నుండి రోజూ ఒకసారి పోయి కుట్టావా అని అడుగుతూనే ఉంది రంగమ్మ. పిల్లలందరిదీ అదే తంతు.

ఆ రోజు ఉదయానికిగానీ కుట్టియ్యని మస్తానును తిట్టుకుంటూ కొత్త బట్టలు తెచ్చి మూలనున్న ట్రంకు పెట్టెలో పెట్టుకుంది రంగమ్మ.

"అమ్మా నేను ఈయేడు కూడా గోవిందక్కగారి బండి మీదనే పోతానే!" రంగమ్మ తల్లితో అంది. "సరే పోవే" అంది వీరమ్మ.

"మరే నువ్వు రావా!" అంటూ వెనక్కు తిరిగి ప్రశ్నించింది తల్లిని. "నేను రావడానికి ఇంకేం పనుల్లేవంట నువ్వు బోవే" అంటూ విసుక్కుంది వీరమ్మ.

ఇంక గోవిందక్కని కాకాబట్టి ఎద్దుల బండ్లో చోటు సంపాయించాల అనుకుంది. తిరణాలకి వచ్చే వెంకటసుబ్బమ్మ స్నేహితురాళ్ళు మల్లేశ్వరమ్మ, గోవిందక్క, లక్ష్మక్కతోపాటు వాళ్ల పిల్లల్తో కలిసి ప్రతి సంవత్సరం ఇంకొంతమంది పిల్లల్ని కూడా ఖాళీని బట్టి తీసుకుని వెళ్తారు.

ఆ సంవత్సరం ఎద్దుకి గాలికుంటు జబ్బొచ్చింది. బండి కడతానో లేదోనని సుబ్బయ్య అంటుంటే విన్న పిల్లలకి గుండెల్లో రైళ్లు పరిగెడుతున్నాయి.

ఎద్దులకి జబ్బు తగ్గడంతో బండి కడతాన్లేరా అని ఉత్తరపింటి సుబ్బయ్య మామ అనడంతో ఎగిరి గంతేసిన రంగమ్మ పిల్లలందరికీ చాటింపేసి వచ్చింది.

ఆ రోజుకి తిరణాల మొదలయ్యి తొమ్మిది రోజులయ్యింది. మరుసటిరోజు చెట్టు కాల్చే రోజు. పెద్దోళ్లంతా వేకువజాముదాకా ఉండి చెట్టు కాల్చటం చూసి తెల్లారేసరికి తిరిగివస్తారు.

పొద్దున్నే గోవిందక్కగారింటికెళ్లి "బండి కడతన్నారా లేదా!" అంటూ అడిగింది రంగమ్మ మిగతా పిల్లలతో కలిసి "వార్నీ తప్పుణ్ణాయాల్లారా! పొద్దున్నే నిదర మంచం లేసొచ్చారూ, ఎప్పుడో మాయిటి పూట పోయే తిరణాలకి" అంటూ సుబ్బయ్య తన్నబోయాడు. పిల్లలందరూ దూరంగా పరిగెత్తుకుంటూ పోవడంతో "ఒరేయ్ కడుతున్నా లేరా!" అనడంతో వాళ్లందరితో పాటు రంగమ్మ గుండె కూడా నిబ్బరపడింది.

ఇంటికి వెళ్లి ట్రంకు పెట్టెలో గుడ్డలు తీసి ఒకసారి విప్పదీసి చూసుకుంది రంగమ్మ.

"సేయ్, ఎప్పుడో మాయిటిపూట పోయే తిరణాలకి ఇప్పటినుండే ఎందుకు నలుపుతావు" అంటూ వీరమ్మ కోప్పడడంతో బట్టలు పెట్టెలో పెట్టి ఆడుకోవడానికి పరుగెత్తుకెళ్లింది రంగమ్మ.

ఆ ఆటలు కూడా గోవిందమ్మ వాళ్ల ఇంటి చుట్టుపక్కల్నే ఆడుకోసాగారు.

మధ్యాహ్నానికి సుబ్బయ్య ఎద్దుల్ని కొట్టంలో నుండి బైటికి నీళ్లకి తోలుకొచ్చి నీళ్లు పెడుతున్నాడు. పిల్లలందరూ అది చూశారు. అందరికీ హుషారెక్కింది. వచ్చి ఎద్దుల చుట్టూ చేరారు.

తాత ఇంట్లోకెళ్లి ఎద్దులకి పెట్టే సొమ్ములన్నీ తెచ్చాడు. ఎద్దుల్ని తడిగుడ్డతో శుభ్రంగా తుడిచాడు. అప్పటికే తెచ్చిపెట్టున్న రంగుల్ని ఎద్దులకి పూశాడు.

కొమ్ములకి రంగులేశాడు. ఎలపటెద్దుకి సిగమార యేశాడు. బొడ్డుతాడు కట్టాడు. రంగు రంగుల పట్టెడున్న కంచు గంటలు కట్టాడు.

ఒక కొమ్ముకి ఎరుపు రంగు, రెండో కొమ్ముకి ఆకుపచ్చ రంగు పూశాడు. కొత్తగా అల్లిన బండి జల్లని బండి మీదకు ఎక్కించాడు. దానికి నెమలి కన్నుల పరజాపట్ట కట్టాడు.

"రేయ్ ఇంకపోయి నీళ్లు పోసుకోని, కొత్తగుడ్డలు యేసుకోని రాండి" అనడంతో రంగమ్మ పరుగుపరుగున ఇంటికి పోయి ఎఱ్ఱసబ్బుతో బాగా రుద్దుకొని, నీళ్ళు పోసుకుని, ముఖానికి పౌడర్ పూసుకుని కొత్త గౌను వేసుకుని, బజారు బజారంతా చాటింపు వేసుకుంటూ బండి దగ్గరకు వచ్చింది.

సూర్యుడు నడినెత్తి మీదనుండి చల్లగా పడమటి వైపుకు ఒరుగుతున్నాడు. అందరూ ముసిలీ ముతకా, పిల్లాజెల్లా తొమ్మిది గజాల వాయల్ చీరలూ, వెంకటగిరి చీరలూ కట్టుకుని తయారై వచ్చారు.

పిల్లలంతా బండి చుట్టూ పొలి తిరుగుతున్నారు. ఎప్పుడెప్పుడు బండెక్కుదామా అని తెగ ఉబలాటపడుతున్నారు.

అయితే ముసలోళ్ళు, పెద్దోళ్ళు అందరూ ఎక్కిందాకా పిల్లల్ని ఎక్కనియ్యలేదు. చివరన పిల్లలంతా మెల్లగా ఎక్కి సర్దుకుని కూర్చుని ఆకాశంలోకి చూడసాగారు.

యెద్దులు జోరీగల్ని తరమడానికి తలకాయలు ఊపినప్పుడల్లా మెడలో గంటలు గణగణమని మోగుతున్నాయి. పడమటి వీధి మొదలుకొని కంసాలోళ్ల కొలిమి మీదుగా బండి కుమ్మరపాలెం మీదుగా చవటగుంట చెరువులో నుండి నక్కపాలెం చేరింది.

అక్కణ్ణుండి తూరుపు వైపుగా తిరిగితే తాఱ్రోడ్డు ఎక్కుతారు. అప్పుడు సుబ్బయ్య పగ్గాలు గట్టిగా లాగిపట్టాడు. "రేయ్ జాగర్తగా కూర్చోండి. ఇంక మన లోకం కాదిది. తాఱ్రోడ్డు మీదకొచ్చాం. ఎకసెక్కాలు నూకబాకండి. చేతులు ఎవ్వరూ బయట పెట్టమాకండి" అంటూ హెచ్చరించాడు.

> **రేయ్ జాగర్తగా కూర్చోండి. ఇంక మన లోకం కాదిది. తాఱ్రోడ్డు మీదకొచ్చాం. ఎకసెక్కాలు నూకబాకండి. చేతులు ఎవ్వరూ బయట పెట్టమాకండి**

అప్పటికే రంగురంగుల గూడుబళ్ళు, రకరకాల కాగితాలు అంటించుకున్న బళ్ళు-కనమళ్ళ, బిట్రగుంట, టంగుటూరు, నరడపాలెం, పాకల, కరేడు, బంగినపల్లి చుట్టుపక్కల ఊళ్ల నుండి వస్తున్నాయి.

రోడ్డుమీద వచ్చేపోయే లారీలు, బొగ్గు బస్సులు, రంగురంగుల మోటారుకార్లు ఒక పక్క, ఇంకోపక్క బోలెడన్ని పెట్టెలు తగిలించుకొని రైలుబళ్ళు పోతా ఉంటే పిల్లలంతా పోటీలుపడి ఇది నా బస్సు, ఇది నా కారు, ఇది నా రైలు అంటూ వాటాలేసుకుంటున్నారు.

బండి ముందుకు సాగుతోంది. సుబ్బయ్య చెర్నాకోల ఆడిస్తున్నాడు, కానీ ఎద్దులకు తగలడం లేదు. ఎద్దులు నెమరేసుకుంటూ ఏమీ యెరగనట్టు దారిన నడుస్తున్నాయి.

రామకృష్ణ హాలు దగ్గరికి పోయేసరికి అందరి గొంతులు పిడచగట్టిపోయాయి.

"ఏమయ్యో! ఈడాపు. అందరూ గోలీసోడా తాగుతారు" వెంకట సుబ్బమ్మ కేక వెయ్యడంతో బండాగిపోయింది. సోడా బండిని కేకవేయడంతో అతనొచ్చి కయ్యికయ్యిమని సోడాలు కొట్టి తలా ఒకటి అందించాడు.

అందరూ సోడాలు తాగిన తరువాత మళ్ళీ బండి కదిలింది.

దారి పొడవునా జనం చీమల బారుల్లా నడుస్తున్నారు. చిన్నపిల్లలు తాతలు, నాన్నల భుజాల్నెక్కి తలకాయలు చుట్టూ తిప్పుతూ, కనిపించే దృశ్యాలని ఆశ్చర్యంగా చూస్తున్నారు. కాస్త పెద్ద పిల్లలు పెద్దోళ్ళ వెంట పరిగెత్తుతూ ఉన్నారు.

బండి కటింగు కాడకొచ్చి రైలు బ్రిడ్జి దాటింది. ఒక్కసారిగా ముసలోళ్ళంతా గుడికి ఎదురుగా మళ్ళీ దణ్ణాలు పెడుతూ "నరసిం

హయ్యా! కాపాడయ్యా!" అంటూ అరుపులు మొదలుపెట్టారు.

కొండమీద ఎత్తుగా గాలిగోపురం లైట్ల వెలుతురులో వెలిగిపోతోంది. ఎటు చూసినా జనం నేల ఈనినట్టు వస్తున్నారు. బళ్ళు భవనాసి దగ్గరకు వచ్చాక అన్నీ ఒకదాని వెనక ఒకటి ఆగిపోయాయి.

సుబ్బయ్య బండిని భవనాసికి ఒక పక్కగా ఆపాడు. అందరూ దిగారు. అక్కణ్ణుండి గుడిని చూడాలంటే తల నిటారుగా పైకెత్తి చూస్తేనేగానీ కనిపించడం లేదు. శిఖరాన ఇత్తడి కలశాలు మెరిసిపోతున్నాయి. గుడి ప్రాకారానికి తెల్లని ఎర్రని నిలువు పట్టీలు వేశారు.

సుబ్బయ్య ఎద్దుల్ని పక్కన చెట్టుకి కట్టేశాడు. అందరూ బండి దిగారు.

వెంకటసుబ్బమ్మ ఇంటి దగ్గర చేసిన స్వామి బువ్వ, పులిహోర, దద్దోజనం, మనుగుబూలు, లడ్లు, అరిశలు అన్నీ తీసుకొచ్చింది. అన్నీ విప్పదీసి ఎవరికి కావాల్సినవి వాళ్లకి పెట్టింది. కడుపునిండా తిని భవనాసిలో నీళ్ళు తాగారు.

"ఇంక పోదాం" అంటూ పిల్లలు బయలుదేరారు. "ఆగండ్రా! ఆ జనం చూడండి గుంపులు గుంపులుగా ఎట్ట ఉండారో! ఇప్పుడు కానీ పోతే నల్లుల్ని నలిపినట్టు నలుపుతారు. కాసేపాగి పోదాం" అనడంతో, వచ్చే పోయే జనాలను చూస్తూ కూర్చున్నారు.

అందరూ దేవుణ్ణి దర్శనం చేసుకుని రథం వచ్చే దిక్కుగా పోతుండడంతో కొంతసేపటి తరువాత జనం పల్చబడ్డారు.

అప్పుడు సుబ్బయ్య "పదండి పదండి" అంటూ తొందర చేశాడు. పిల్లలు ఒకరికొకరు పోటీలుబడి మెట్లు ఎక్కుతున్నారు.

ప్రధాన ద్వారం దగ్గరకు వచ్చేసరికి అందరూ 'హమ్మా హయ్య' అంటూ ఆపసోపాలు పడసాగారు.

పంపుల దగ్గర కాళ్ళు కడుక్కుని క్యూలోకి పోయారు. లక్ష్మీనరసింహస్వామి గర్భగుడిలోనికి పోయి అందరూ దర్శనం చేసుకుని బైటకు వచ్చారు.

అప్పటికి జనం అందరూ దైవదర్శనం చేసుకుని తూరుపు పడమరగా పొడవుగా ఉండే రథం బజారుకి వచ్చారు.

సుబ్బయ్య తాతయ్య గుడికి తీసుకువెళ్ళి దర్శనం చేయించి, సీతమ్మవారి కుంకుమ భరిణెలకు కూడా దణ్ణం పెట్టించి అందర్నీ ఒక చోట చేర్చి కూర్చోబెట్టి కొబ్బరి చిప్పలు కొట్టి అందరికీ ప్రసాదం పెట్టాడు.

పల్లకీలో దేముణ్ణి మోసుకొని వస్తున్నారు. మేళం సన్నగా వినపడుతోంది. జనం తోసుకుంటూ, తొక్కుకుంటూ నడుస్తున్నారు. పారువేట నుండి రావడంతోటే దేవుణ్ణి రథం ఎక్కించారు. అందరూ మొకులు పట్టుకుని, గొలుసులు పట్టుకొని రథాన్ని లాగడానికి పోటీలు పడుతున్నారు. ఎవరు ఎవరో ఎవరికీ తెలియనంతగా తొక్కుకుంటూ తోసుకుంటున్నారు. రథం ముందుకు కదులుతోంది.

అంతలో "ఆపండి. ఆపండం"టూ ఎవరో పెద్దగా కేక వేశారు. రథాన్ని ఊపుచేసి లాగుతున్న వాళ్లంతా ఒక్కసారిగా తాళ్ళు వదిలిపెట్టారు. కానీ ముందుకు కదులుతున్న రథం మాత్రం మరికొంత దూరం ముందుకి కదిలింది.

విషయమేంది? ఎందుకు అరిచారో చూస్తే రథం కింద ఎవరో ఒక మనిషి పడ్డాడు. చక్రం కింద పడడంతో తల పగిలి అక్కడికక్కడే చనిపోయాడని తెలిసింది. అందరూ అయ్యో పాపం... 'అయ్యో పాపం' అంటూ బాధపడిపోసాగారు.

రంగమ్మ ఈ విషయం తెలిసి "తాతా ఇంక తిర్నాల ఉండదా" అంటూ దిగాలుగా అడిగింది.

"ఇంక ఉండదమ్మ" అనడంతో డీలాపడిపోయింది.

'తినేయి కొనుక్కోలేదు. బూరలు కొనుక్కోలేదు. రంగులరాట్నం ఎక్కలేదు. ఎట్ట ఇంక తిర్నాల ఆగిపోతే అనుకుంటూ' దిగాలు పడిపోయింది.

"ఏందంటనే? " అని పక్కన ఇంకో

అమ్మాయి అడగడంతో "ఎవురో సచ్చిపోయారంట గదా! ఇంక తిర్నాల ఉండదంట ఏం కొనుక్కోకుండానే మనం యెనక్కి పోవాలంట" అని నీరసంగా చెప్పింది రంగమ్మ.

పిల్లలంతా ఆ విషయం విని డీలాపడిపోయారు. అప్పటికీ దగ్గర్లో ఉన్న బొమ్మలు కొనిపించాడు సుబ్బయ్య.

దిగులుగా వెనక్కి తిరిగి చూస్తుంటే, గుడి కనబడినంత దూరం పిల్లలందరూ వెనక్కి తిరిగి చూస్తూనే ఉన్నారు.

"పాపం ఏ ఊరి బిడ్డో పండగపూట చచ్చిపోయాడు" అంటూ ముసలి వాళ్ళంతా ఇంటికి వచ్చిందాకా బాధపడుతూనే ఉన్నారు.

వాళ్ళతో పాటు పిల్లలంతా బిక్కచచ్చిపోయారు. ఇంటికి వచ్చిందాకా ఎవ్వరూ ఎవ్వరితో మాట్లాడుకోలేదు.

ఊళ్ళోకి రావడంతో అందరూ వీళ్ళ బండి వైపే చూస్తున్నారు. బండిలో కూర్చున్న వాళ్ళందరూ తిరణాల ఆగిపోయింది కనుక తిరిగొస్తున్నామని చూస్తున్నారు లాగుంది అనుకున్నారు.

కానీ తీరా ఇంటికి వెళ్లేసరికి అంతకుముందు కురిసిన వర్షానికి బాగా నానిపోయిన మట్టిగోడ పడిపోవటం వల్ల రంగమ్మ అక్క సుశీల తల పగిలిందని చెప్పారు.

రంగమ్మ బండి దిగటంతోనే ఏడుస్తూ తిరణాల్లో కొనుక్కున్న బూరలు కూడా అక్కడే వదిలేసి పరిగెత్తుకుంటూ ఇంటికి పోయింది.

ఇంటి చుట్టుపక్కలవాళ్ళు ఏడుస్తున్న రంగమ్మని పిలిచారు. రంగమ్మ నేరుగా ఇంట్లోకి పోయి చూసింది. పడమటి వైపు గోడ పడిపోయింది. దూలం ఒకవైపు గోడమీదా ఒకవైపు నేలమీదా ఆనుకుని ఉంది. దూలం కింద మట్టి ఎర్రగా రక్తంతో తడిసి పొక్కులు కట్టి ఉంది. అది చూసి రంగమ్మ ఇంకా పెద్దగా ఏడ్చింది.

పక్కింటి కమలమ్మ వచ్చి "రామ్మా ఏడవబాకు. మీ అక్కాయికి ఏం కాలేదులే, అస్పత్రికి తీసుకోని పోయారుగా, తగ్గిపోతదిలే ఊరుకో" అని వాళ్ళింటికి తీసుకువెళ్ళింది.

## చబ్బీ లెగ్స్‌తో హెల్దీ హార్ట్

"చబ్బీ చీక్స్... డింపుల్ చిన్ రోజీ లిప్స్... టీత్ విదిన్"... అనే నర్సరీ రైమ్ గుర్తుందా మీకు?

అయితే దీన్ని కాస్త మార్పుచేసి... "చబ్బీ లెగ్స్ హెల్దీ హార్ట్" అని పాడుకోమంటున్నారు. కాళ్ళలో చేరిపోయే కొవ్వు, కదల నీయకుండా, బరువుగా, ఏనుగు కాళ్ళని తలపించేవిగా మార్చినా భయం లేదంటున్నారు. ఎందుకంటే, కాళ్ళలోని కొవ్వు గుండె జబ్బుల్ని నియంత్రిస్తుందని ఇటీవలి పరిశోధనల్లో తేలిందంటున్నారు వాళ్ళు. కొవ్వు చేరే ప్రదేశాన్ని బట్టి ప్రమాదాన్ని నిర్ధారించవచ్చనీ అంటున్నారు అమెరికన్ శాస్త్రవేత్త రేచ్చెల్ వేన్ పెల్ట్. వేన్ పెల్ట్ 95 మంది గుండె జబ్బు గల స్త్రీలలో కొలెస్ట్రాల్ ప్రమాణాల్ని, రిస్క్ ఫ్యాక్టర్లని పరిశీలించారు.



కాళ్ళలో కొవ్వున్న స్త్రీలు, ఉదరం చుట్టూ కొవ్వున్న స్త్రీలు, రక్తంలో ట్రైగ్లిజరైడ్స్ ఎక్కువగా ఉన్న స్త్రీలపై ఆయన పరిశోధన జరిపారు. ఈ పరిశోధనల వలన కాళ్ళలో కొవ్వున్న స్త్రీలకి గుండె జబ్బుల రిస్క్ తక్కువగా ఉంటుందని తేల్చిచెప్పారు. కాళ్ళలో చేరిపోయే కొవ్వు, రక్తంలో ఉండే ట్రైగ్లిజరైడ్స్‌ని పీల్చుకుని నిల్వ ఉంచుతుందట. అందుకే కాళ్ళు లావుగా ఉంటే నో ప్రాబ్లం... కడుపు లావుగా ఉంటేనే ప్రాబ్లం అంటున్నారు.

రంగమ్మ వెక్కి వెక్కి ఏడుస్తూనే పడుకుంది.

నాలుగు రోజుల తరువాత సుశీల చనిపోవడంతో ఊరంతా శోక సముద్రంలో మునిగిపోయింది.

రథోత్సవం రోజు రథం కింద మనిషి పడటమూ, అదేరోజు ఊళ్ళో మనిషికి దెబ్బ తగిలి చనిపోవడంతో ఊరి వాళ్ళందరూ 'ఏదో అరిష్టం పట్టుకుంది. పోయిన సంవత్సరం చెన్నకేశవ స్వామిని ఊరగించలేదు, ఈ సంవత్సరమన్నా ఊరేగించాల'ని తీర్మానించుకున్నారు.

పాడు బడ్డట్టు ఉన్న ఈ ఇల్లు కూల్చేసి కొత్త ఇల్లు కట్టమని అయ్య ఎంత శతపోరినా ఆయన బతికుండగా ఆ కోరిక తీర్చలేకపోయాను. ఇప్పుడు కూతుర్నే పొట్టనబెట్టుకున్నానుకుంటూ రంగమ్మ తండ్రి వాపోయాడు.

అయ్య ఎప్పుడూ అంటుండేవాడు. 'ఒరే నరసయ్యా నా హయాంలో ఒక మడిసెక్క కొనగలిగానురా. ఇంత కొంప ఏర్పాటు చెయ్యలేకపోయేను. అందుకే ఆ ఊరి కొంప కూలి మీ అమ్మ నన్నొదిలి పెట్టి వెళ్ళిపోయిందిరా'అని.

ఆ కసితోటే కదా ఊళ్లోని తన జతగాళ్లందరూ రైలు కట్ట పనికి పోతుంటే వాళ్ళతో పాటు పడి యెల్లేను.

బాగా వయసులో ఉండోళ్ళనే ఆ పనికి తీసుకునేవాళ్ళు. ఎంతెంత బరువైన పట్టాలు కూడా ఒక్క దెబ్బతో పైకి లేసేవి. అప్పుడు తిండి కూడా అట్నే తినేవాళ్ళం. పనికూడా అట్టనే చేసేవాళ్ళం. తవ్వెడు బియ్యపుకూడు ఒక మణిసికి ఎక్కువయ్యేదే కాదు. అట్టాంటప్పుడు ఎంత పనైనా లెక్కుండేది కాదు. దుత్త నిండా మాంచి చిక్కటి మజ్జిగ బోసి, దోస గింజల్తో నూరిన చింతకాయ పచ్చడి నంజుకోడానికి పెడితే ఆ ఆకలి మీద నిమిషాల్లో మాయమయ్యేది.

ఆ వంతున ఆ రైలుకట్ట పనికి పోనిచ్చినట్టయితే ఎప్పుడో ఇల్లుకట్టి పారెయ్యకపోయానా. ఆయనకేమో ఎంతసేపుటికీ ఉన్నది చారెడు మడిసెక్కయినా ధ్యాసంతా దానిమీదే ఉండేది. 'ఆ, మన పొలం చూసుకుంటూ అరకలకిపోతే వాళ్ళిచ్చే డబ్బులు రావంట్రా. రైతు పుటక పుట్టినోడు పొలం దున్నకుండాపోయి ఎవురికో సలాములు కొట్టేది ఏందిరా' అంటుండేవాడు. పట్టాలు ఉలవపాడుదాకా ఎయ్యడంతోటే అందరిమీ మానుకుంటిమే. అప్పటికి సేద్యాలు ముమ్మరంగా సాగుతుండడంతో ఆ పని మానుకుందాకా ఊపిరాడనిచ్చారా! ఈయనేందిలే అందరూ అట్నే మానుకుంటిరే. పొలం పనికి మించిన పనులేం ఉండయ్యిరా అని అందర్నీ మానిపించి పారేశారు.

ఆ రైలు కట్టాయనొకడు తెలివి కలిగినోడు కాబట్టి ఎవరెన్ని చెప్పినా ఆ పనికి మానుకోకుండా పోయేడు. ఆపీసర్ల చుట్టూ తిరిగి తిరిగి చొక్కా నలక్కుండా పరిమినెంటు జేయించుకున్నాడు. ఇయ్యాల దర్జాగా ఇల్లు కట్టాడు. అదే పనిలో ఉంటే ఇల్లు కట్టడం పెద్ద బెమ్మాండమా ఏంది?

అయినా ఇప్పుడు ఎట్టయినా సరే ఇల్లు కట్టాల్సిందే అని ఒక దృఢమైన నిర్ణయానికి వచ్చాడు. అయ్య మాటిని ఎప్పుడో ఇల్లు కట్టినట్టయితే ఇప్పుడు కన్నకూతుర్ని కాట్లో దొర్లిచ్చి ఉండేవాణ్ణి కాదుగదా! సరే, ఇప్పుడైనా చేతిలో పైసా లేదు. అయినా ఇల్లు కట్టించెయ్యాలని తీర్మానించుకున్నాడు.

గుణాద్రం తీయించాడు. ఏల్చూరు రాయి తెప్పించి పునాదులు పైకి లేపాడు. ఏటి ఇసక తోలిచ్చాడు. వారేటపాడు ఇటుక రాయిలు తోలిచ్చాడు. తెల్లసున్నం గానగాడిచ్చాడు. గోడలు పైకి లేశాయి. అప్పటికే రాసిచ్చిన నోట్లు ఒక కట్ట తేలాయి.

గోడలు గట్టిపడ్డాయి. ఇంక తెస్తే తీర్చడం నా వల్లకాదు అని అధైర్యపడ్డాడు. 'తెచ్చిన ప్రతి పైసాకి లెక్క గడితే అమ్మో వడ్డీతోటి వడికాళ్ళ గుర్రం కూడా దౌడు తియ్యదు' అని భయపడిపోయాడు. దాంతో పైన పూరికప్పు వేయించాడు.

ఇంటివైపు చూసుకుంటూ మురిసిపోయాడు. అయితే ఆనాటి నుండి చివరిపైసా

అప్పు తీరేవరకూ రెండు కాళ్లూ ఒకచోట పెట్టిన పాపాన పోలేదు. చించేసిన నోట్లన్నీ చూసుకుని ఒకరోజు నట్టింట్లో కూర్చోని ఎంత డబ్బు కట్టాను అనుకుంటూ ఏడుస్తుంటే రంగమ్మకి కూడా ఏడుపొచ్చింది. 'అయినా ఏం లాభం? ఇంట్లో ఆడమణిసి బాగుంటే ఎన్ని తిప్పలు పడ్డా మగమణిసి ఎంత హాయిగా కష్టపడతాడు' అంటూ రంగమ్మని దగ్గరకు తీసుకుని ఎప్పుడూ బాధపడుతూనే ఉండేవాడు.




"ఇప్పటికి సంవత్సరం దాటింది నువ్వు డబ్బులు తీసుకుని ఫైనాన్సనుకుంటున్నావా! లేదా బేంకులో అప్పు తీసుకున్నాననుకుంటున్నావా! మర్యాద ఇచ్చిపుచ్చుకునే దాన్నిబట్టి ఉంటుంది. మనుషులన్న తరువాత ఒక మాటకి బద్ధపడేటట్టు ఉండాల. ఎన్నిసార్లు తిరగాలి. మీ ఇంటిచుట్టూ. తిరిగి తిరిగి మా బండిటైర్లు అరిగిపోతున్నయ్యి. మీకు డబ్బులు ఇయ్యడం, మీ ఇళ్ళచుట్టూ తిరగడం ఇదేనా మా బిజినెస్సు" నారాయణరెడ్డి పెద్ద పెద్దగా కేకలు వేస్తున్నాడు.

"ఇదుగో, పొద్దున్నే ఏంది రభస? మీరిచ్చారు నేను తీసుకున్నాను. నేనేమన్నా కట్టకుండా యెగేసేనా! నువ్వు కట్టిచ్చుకున్న వడ్డీలే ఈపాటికి అసల్ని మించిపోయుంటయ్యి. మియ్యేమన్నా మానవమాత్రులు భరించే వడ్డీలేనా!" అని అందుకుంది రంగమ్మ.

నారాయణరెడ్డికి కోపం వచ్చింది. "ఏం రంగమ్మా! ఏరుదాటినాక తెప్ప తగలేసే రకం లాగుండావే!" అంటూ అంతెత్తున ఎగిరిపడ్డాడు.

రోడ్డుమీద వచ్చేపోయేవాళ్ళు ఆగి మరీ వీళ్ళ మాటలు వినిపోతున్నారు. టిఫిన్ తింటానికి వచ్చినవాళ్ళు కూడా "ఏంది రంగమ్మా రోజూ నీకీ గోల" అంటున్నారు.

ఇంట్లో ముసలామె ఏదో గొణుగుతోంది. సుధారాణి ఇంట్లో నుండి బైటికి వచ్చి చూసి మళ్ళీ లోపలకు వెళ్ళింది.

నారాయణ రెడ్డి మాటలు రంగమ్మకి తల కొట్టేసినట్టుగా ఉన్నాయి. "ఇదుగో మీకేమి ఎగేసిపోయేదాన్నికాదు. ఎవ్వరైనా తిరిగి ఇద్దామనే అవసరం కొద్దీ తెచ్చుకుంటారు. నేనూ ఉన్నకాడికి ఇచ్చుకుంటానే వచ్చాను. నా పరిస్థితి కూడా అర్థం చేసుకోవాల గదా! ఎందుకు నన్ను రంపపుకోత పెడతండారు? అప్పుడు కాసిని అప్పుడు కాసిని ఇచ్చి ఎట్నోకట్ట నీ బాకీ చెల్లేస్తాను కదా! అంతా మాత్రం ఒక్కసారి ఇచ్చుకోలేను. నీకు దణ్ణం బెడతాను. అవతల బేరానికి మణుసులు వస్తండారు." అంటూ కళ్ళనుండి బొటబొటా కారుతున్న కన్నీళ్ళని పవిటచెంగుతో తుడుచుకుని మౌనంగా తలవంచుకుని నారాయణరెడ్డి ఎదురుగా నిలబడింది.

'ఇయ్యాల ఎట్టయినా ఈమె దగ్గర బాకీ వసూలు చేసుకునిపోవాలని వచ్చాను. ఇదేంది ఇట్ట అడ్డం తిరిగింది' అనుకున్నాడు నారాయణరెడ్డి. అతడిలో ఒకమూల మానవత్వం పెల్లుబికింది. 'పోనియ్యిలే పాపం దరిద్రంలో ఉంది. ఇంకొక్కసారి వార్నింగిచ్చి కాస్త టైమిద్దాం' అనుకుని "ఇదుగో రంగమ్మా ఒక్కనెల టైమిస్తున్నా, ఈనెల రోజులలోపు ఇచ్చావా సరే! లేదా ఆ తరవాత మనిద్దరికీ మధ్య మాటలుండవు" అంటూ కోపంగా చూసి "పొద్దున నిదర మంచానలేసి పాచిమొహం కూడా కడుక్కోకుండా ఇళ్ళెంటబడి తిరుగుతుంటే నీళ్ళ చెల్గాటంగా ఉంది. ముక్కుపిండి వసూలు జేస్తాం ఏమనుకున్నారో!" అనుకుంటూ పక్కన ఆపిన బండిస్టాండ్ తీసి, స్టార్ట్ చేసి కోపంగా వెళ్ళిపోయాడు.

రంగమ్మకు అతడు వెళ్లిపోయేవరకు

గుండెల్లో రైళ్ళు పరిగెత్తుతూనే ఉన్నాయి. అతను వెళ్లిన వైపే చూస్తూ 'హమ్మా! వానకు రిసి ఎలిసినట్టుగా ఉంది. రౌడీలా ఊరిమీద బడి బెదిరిచ్చి వసూలు చేసుకునేదే పనైపో యింది. వడ్డీలకు వడ్డీలు, వడ్డీలకు వడ్డీలు కట్టుకొని ఇల్లూ ఒళ్ళు గుల్లయిందాకా వదిలి పెట్టరు' అనుకుంటూ ఇడ్లీ పాత్ర దించి నీళ్ళల్లో చెయ్యి తడుపుకుంటూ ఇడ్లీలు తీసి గిన్నెలో వేసింది.

రోడ్డుమీద ఎవరో అరుచుకోవడం వినపడి గిన్నె తీసుకొని బయటికి వచ్చింది. గిన్నె బల్ల మీద పెట్టి, మళ్ళీ ఇడ్లీ ప్లేట్లల్లో పిండి పోసి పాత్ర మీద మూతపెట్టి ఇడ్లీపాత్ర పొయ్యి మీద పెట్టి మళ్లీ బంకు ముందుకు వచ్చింది.

బాగా తాగిన ఇద్దరు వ్యక్తులు కలబడి కొట్టుకుంటున్నారు. ఒకరి చొక్కాలు ఇంకొ కరు పట్టుకొని పీక్కుంటున్నారు. అరుస్తు న్నారు. పెద్దగా బూతులు తిట్టుకుంటు న్నారు. చుట్టూ జనాలు మూగి చోద్యం చూస్తున్నారేగానీ ఎవ్వరూ తప్పించడానికి ప్రయత్నం చెయ్యలేదు.

కల్లు కొట్టుముందు దోసెలు పోసుకుంటూ కూర్చుంది కొండమ్మ. అక్కడ అంత గలభా జరుగుతున్నా ఆమె ముఖంలో ఎలాంటి భావాలు కనిపించడం లేదు. పక్కన జగ్గుల్తో కల్లు తాగుతూ దోసెలు తింటున్న వాళ్ళతో మాట్లాడుతూ మధ్యమధ్యలో నవ్వుతోంది. ఎవరో పిలిస్తే ఇంట్లోకి వెళ్లి జగ్గులో కల్లు బోసి, మళ్ళీ తిరిగి పొయ్యి దగ్గర కూర్చోని దోసెలు పోస్తోంది.

'పక్కలో బాంబు పడ్డా కదిలేటట్టులేదు. కాస్త వాళ్ళని అవతలకి పొమ్మని చెప్పొ చ్చుగా. పొద్దున్నే ఏందీ గోల! పక్కనోళ్ళు చూస్తున్నా పట్టించుకునే రకంగా లేదే! కుదు ములా ఎట్ట కూచ్చుందో చూడు. మనిషి తొణకదూ బెణకదూ. దిగులూ ఇశారమూ ఉండదు. దర్జాగా మొగరాయుళ్ళాగా చెలాయి స్తుంది.

దాని కొట్లో కల్లు తాగేగా, వాళ్ల తన్నుకుం టోంది. అయినా చీమకుట్టినట్టన్నా ఉందా దానికి. ఇరంపరం లేకుండా ఇట్ట ఉండగలిగి తేనే లోకంలో బతగ్గలిగేది' అనుకుంది రంగమ్మ.

అప్పుడే కల్లు తాగి డబ్బుల్లేవు తరవాతిస్తా అంటూ పోబోతున్నాడు ఒక్కడు. వాడి చొక్కా పట్టుకొని ఒక్కలాగు లాగింది కొండమ్మ. వాడు ముందుకి తూలి పడబో యాడు. జేబులో చెయ్యిబెట్టి కాగితాలు బయ టికి తీసింది. వాటి మధ్యలో ఉన్న యాభై రూపాయల నోటు తీసుకొని, "మొన్నటిదీ ఇయ్యాల్టిదీ చెల్లు ఇంక కాలికొద్దీ పరిగెత్తు. యెదవ నాయాల్లారా నన్ను ముంచడానికి వస్తారంటరా" అంటూ మళ్ళీ పొయ్యి దగ్గర కూర్చుంది.

"చూడు! రంగమ్మా! కాలు మీద కాలేసుకుని సంపాయిస్తుంది కొండమ్మ. ఎట్టాంటోళ్ళ యినా డబ్బులాడ బెట్టి కదలాల్సిందే. లేదంటే వాడి మీద కలబడి వసూలు జేస్తది. పుటక ఆడదైనా మగరాయుళ్ళాగా చెలాయిస్తుంది. నువ్వూ ఉన్నావు ఎన్ని రకాలుగా కష్టపడు తున్నా ముందుకి రాలేకపోతున్నావు" అని ఎగతాళి జేశాడు, మిల్లులో పనిజేసే అంకయ్య బల్లమీద కూర్చుంటూ.

"ఎట్ట జరిగే వాళ్ళకి అట్టనే జరుగుద్ది. దానిలా రౌడీయిజం చెయ్యటం అందరివల్లా ఎట్టవుతుంది. రాత్రింబవుళ్లూ వళ్ల ఇరగదీసు కుంటుంటే ఏ దరీ దోచడం లేదు. చూడు దర్జాగా ఎట్ట చలాయిస్తుందో! ఏం గావా లన్నా? ఇడ్లీనా, దోసా!" అడిగింది అంకయ్య వైపు చూస్తూ.

"ఇడ్లీ ఇయ్యి" అని "అది ఆ యెనక కూర్చు న్నవాడి అండలేమ్మాయ్. చూడు పందెపు కోడిని మేపినట్టు మేపుతుంది. మొగుణ్ని వదిలేసింది. వాణివుణ్ణో ఉంచుకుంది. ఇంక వాడు తింటం దానిక్కాపలా కాయడం. అంద రికీ అట్ట చెయ్యడం ఎవరి వల్లవుద్ది చెప్పు" అంటూ రంగమ్మ ఇచ్చిన ప్లేటందుకుని ఇడ్లీ తినసాగాడు.

ఆ మాటలు విన్న రంగమ్మకి నారాయణ గుర్తొచ్చాడు. చెయ్యని పాపానికి బలైపోయా

డు. ఎటు పోయాడో, ఏమైపోయాడో పాపం యాడ తిరుగుతున్నాడో, అసలు ఉండాడో లేడో ఏమైపోయాడో. నా దరిద్రం నెత్తికెక్కి ఆయన దేశాల మీద పోయాడు. అందరూ నావల్లే మొగుడు దేశాల మీదకు పోయాడని అనుకున్నారు. ఎంత చెప్పినా ఎవరూ నమ్మలేక పోతిరే. ఆ యెదవ నాయాల నా మొగుడు ఉసురుబోసుకున్నాడు. రంకు నేర్చినమ్మ బొంకు నేర్వదా అని అందరూ నన్ను ఆడిపోసుకున్నారు వాడి వల్ల.

అప్పటి పరిస్థితికి వాడు లొంగదీసుకున్నాడు గానీ, రంకుతో బతికే దాన్నయితే ఇన్ని అవస్థలు ఎందుకు పడతాను అనుకోవడంతో రంగమ్మ కళ్ళ వెంబడి నీళ్ళొచ్చాయి.

పరధ్యానంగా అట్లకాడ పెట్టబోయి పెనం మీద చెయ్యి బెట్టింది. చుర్రుమని కాలడంతో చెయ్యి వెనక్కు తీసుకుంది.

"ఏంది రంగమ్మా? అంత యెతిమతమైతే ఎట్టజేస్తావు యాపారం. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తా పరధ్యానంగా ఉంటే ఎట్ట చెప్పు" అని టిఫిన్ ముగించి చేయి కడుక్కుని డబ్బులు ఇచ్చి వెళ్ళిపోయాడు అంకయ్య.

ఏం జేస్తాం ఆలోచనల్లేకుండా ఎట్టుంటయ్యి అనుకుంటూ అంకయ్య పోయినవైపే చూసింది.

రోడ్డు మీద తన్నుకున్న ఇద్దరూ అలిసిపోయి పక్కనే పడిపోయారు ఒగర్చుకుంటూ.

"చూడు యెదవలు తాగి తన్నుకుని ఎట్టపొర్లుతుండారో! తన్నుకున్నంత సేపు వొదిలిపెట్టాల. అలపడిం తరువాత వాళ్ళే పడిపోతారు" నవ్వుతూ పక్కన ఎవురికో చెబుతోంది కొండమ్మ.

'రోజూ ఇదొక యేశమైంది. పడే కష్టం పడతా గూడా మనశ్శాంతి లేకుండా పోతంది.' అనుకుంటూ వాళ్ళ వంక చూసింది రంగమ్మ.

"ఏం రంగమ్మా ఇయ్యాలెంత కావాల" అంటూ సైకిల్ బెల్లు మోగిచ్చుకుంటూ వచ్చాడు చలపతిరావు.

"అయ్యా చలపతిరావా నీకెందుకీ ఖర్మ చెప్పు. లక్షలక్షలు వొడ్డీకి మారుస్తున్నావు గదా! ఒక మంచి బండి కొనుక్కోని తిరగ్గూడదూ!" అంటూ ఎగతాళి చేసింది.

"రంగమ్మా నా సంపాదనకి బండొకటా! తా దూరకంత లేదు మెడకొక డోలా! అయినా నేనెంత దూరం తిరుగుతున్నాను కాబట్టీ! అదీగాక సైకిలైతే ఖర్చుకి ఖర్చూ తగ్గుద్ది. ఆరోగ్యానికి ఆరోగ్యం. ఇంతకీ నీకు ఎంత కావాలో చెప్పనే లేదు. మాటల మధ్యలో వ్యాపారం గుర్తు చేశాడు.

"నీకేం ఎంత కావాలన్నా ఇస్తావు. నూటికి పది రూపాయలు తగ్గించుకుంటావు. మాయిటేలకి వచ్చి వంద దీసుకుంటావు. పొదస్తమానం ఒళ్ళు హూనం జేసుకున్నా మాకు మిగిలేదేముంటది. మీలాంటోళ్ళకి దారాగతం చెయ్యనే సరిపోతుణ్ణే. అయినా ఎంతోకంత తీసుకోక తప్పకపోతుండే. అయ్యి లేకపోతే అవతల సరుకులు ఇయ్యరు. ఇక్కడ యాపారం ఉండదు. ఐదొందలియ్యి. సరుకులన్నీ అయిపోయినియ్యి" అనడంతో బ్యాగులో నుండి ఐదొందలు తీసిచ్చి పుస్తకంలో నోట్ చేసుకున్నాడు. మరి నా చీటీ డబ్బులూ అనడంతో రంగమ్మ వాటిల్లో నుండి రోజువారీ చీటీ కింద వంద తీసిచ్చింది.

"నువ్వయ్యా ఉండాల్సినోడివి. ఇచ్చినట్టే ఇస్తావు. మళ్ళీ తీసుకుంటావు. రెండందాలా

రంకుతో బతికే దాన్నయితే ఇన్ని అవస్థలు ఎందుకు పడతాను అనుకోవడంతో రంగమ్మ కళ్ళ వెంబడి నీళ్ళొచ్చాయి

పాచి మొకాన ఇంటికాడ బయలుదేరుతావు. ఎక్కడో ఒకచోట పైసా ఖర్చులేకుండా టిఫిన్ చేస్తావు. టీ తాగుతావు. వచ్చినప్పుడల్లా నీకు మిగులుదలే కదా!

లాభాలే నీకు. బతకనేర్చినోడివి" అంది.

"సరేలే పళ్ళపొడి ఎక్కడుంది? " అడిగాడు పళ్ళు తోముకోవడానికి. "పాచి మొకాన్నే లేసి రాకపోతే, ఇంటికాడ ఆ మొకమన్నా కడుక్కుని రాగూడదా! ఆ కంపు, దరిద్రం కూడా మా ఇళ్లకాణ్ణే వొదిలిచ్చుకోవాలా! ఇదుగో" అంటూ పళ్ళపొడి చేతిలో పెట్టింది.

"ఎంత కసురుకున్నా నీయంత ధర్మతల్లులు ఈ భూమ్మీద ఇంక పుట్టరు." అంటూ పళ్ళు తోముకుని, మొఖం కడుక్కుని జేబులోని చేతి గుడ్డతో ముఖం తుడుచుకుంటూ బల్లమీద కూర్చున్నాడు.

"చలపతిరావూ! నువ్వయ్యా ఉండాల్సినోడివి. అందరు మొగోళ్ళూ ఉండారు. నువ్వూ ఉండావు. పాచి మొకాన ఇంటికాడ బయలుదేరుతావు. ఎక్కడో ఒకచోట పైసా ఖర్చులేకుండా టిఫిన్ చేస్తావు. టీ తాగుతావు. వచ్చినప్పుడల్లా నీకు మిగులుదలే కదా! ఏం మా దగ్గిర రూపాయి రూపాయీ లెక్కబెట్టి మరీ తీసుకుంటావే! మా సొమ్ము అసువంటిది గాదా! యాడేడదీ దోచి నీ పెళ్ళాం మెడలో యెయ్యాలా!" కడుపు మంట ఆపుకోలేక నవ్వుతూనే అడిగింది, దోసెలు ప్లేట్లో పెట్టి చేతికిస్తూ.

"ఇదుగో రంగమ్మా రొండు దోసెలంటే ఎంత? అయిపోయిన తరువాత కుండ కడిగినంత, ఒక 'టీ' అంటే ఎంత? అడుగున నువ్వు పారబోసినంత గూడా ఉండదు కదా! అయినా నాలోంటోళ్ళకిస్తే పుణ్యమూ పురుషార్థమూనూ" అంటూ ప్లేటులో దోసెలు ఖాళీ చేసే ప్రయత్నం చేస్తూ అన్నాడు.

"నా పుణ్యం బొగ్గులైనట్టే ఉందిలే! అవి జాలా ఇంకొకటి యెయ్యమంటావా? "

"ఒకవేళ నేను చాలన్నా నువ్వూరుకుంటావా! యెయ్యి. యెట్టో కట్ట నీ కోసమైనా తినాలిగా"అంటూ ప్లేటు ముందుకి పెట్టాడు.

'నీ అంత కిలాడోడు ఈ భూమ్మీద కనపడడు. ఎంత నేర్పుగా మాట్లాడుతావురా' అనుకుంటూ ఇంకో దోసె ప్లేట్లో వేసింది.

'ఎన్ని మాట్లన్నా సిగ్గులేదు ఈడికి. వాడికి య్యాల్నుంటే ముక్కుపిండి వసూలు చేస్తాడు. ఏం! టిఫిను తిని డబ్బులియ్యొచ్చుగా! అది వల్లగాదు. గట్టిగా అడుగుదామనుకుంటే, మరీ ఎప్పుడన్నా గొంతు మీదకి వచ్చినప్పుడు ఇయ్యకుండా ఎగ్గొడితే ఎట్టని చూడ్డమే! ఇట్టుంటి తప్పుడు సన్యాసుల్ని చీపురు కట్ట మీద పేణ్ణీళ్ళు చల్లి కొట్టాల' అనుకుంటూ టిఫిను ముగించి చేతులు కడుక్కుని రావడంతో టీ అందించింది.

"అమ్మా! నాకు టైమైంది నేను వెళ్తన్నాను" సుధారాణి అనడంతో "ఏమే నీకు ఎన్నిసార్లు చెప్పాలే! ఎళ్తున్నాను కాదు ఎల్లొస్తాను అని చెప్పాలని" ఆ అమ్మాయివైపు చూస్తూ గట్టిగా చెప్పింది.

"ఏం రంగమ్మా! అమ్మాయి ఎక్కడ పని చేస్తోంది" వెళుతున్న సుధారాణి వైపు చూస్తూ అడిగాడు చలపతిరావు.

యీడికి అన్ని కావాల. ముదనష్టపోడు. పాపిష్టి కళ్ళు పడితే పటక్కుమని గుండ్రాయైనా పగుల్తుందంట అనుకుంటూ, "అదేందో పోన్ల సాపంటయ్యా! రాత్రింబగుళ్ళు చేయిచ్చుకుంటారు. రొండేలు ఇచ్చేతలికి సస్తారు. ఒక్కోరోజు అర్థంరేత్తిరి దాకా చేయిచ్చుకుంటారు. ఏం వాయవా ఎక్కువ జేయిచ్చుకునేటప్పుడు కాస్త ఎక్కువియ్యొచ్చుగా!" అంది.

ఇట్టాంటి బొమ్మల్ని రాత్రింబవుళ్ళయినా షాపుల్లోనే ఉంచుకుంటారు అనుకుంటూ,

"అమ్మా! ఈ ప్రైవేటు కంపెనీ వాళ్ళ సంగతులు చెప్పాల్నా. ఉండేవరికీ రసం పిండుకుంటారు. ఏం జేస్తాం మన అవసరం, వాళ్ళ అవకాశం" అంటూ టీ గ్లాసు బల్లమీద పెట్టి వస్తా రంగమ్మ అంటూ సైకిలెక్కి తొక్కుకుంటూ పోయాడు.

చలపతిరావు పోయినంత దూరం చూస్తూ, "పోరా యెదవ. కానీ ఖర్చులేకుండా టిఫిన్ తినడానికి పొద్దున్నే వస్తావు. నీలాంటోళ్ళేరా మిద్దెలమీద మిద్దెలు కట్టేది. మాలాంటోళ్ళము ఎంత సంపాయిస్తే ఏముంది? మీ లాంటోళ్ళ మొకాన పొయ్యానే సరిపోయెనే!' అనుకుంటూ పెనం మీద పిండి పోసింది. సుయ్‌మంటూ శబ్దం వచ్చింది.

"అమ్మా" అంటూ ఇంట్లో నుండి వెర్రికేక వినిపించడంతో, చేతిలో పని వదిలేసి హడావుడిగా పరిగెత్తుకుంటూ ఇంట్లోకి వెళ్ళింది రంగమ్మ. "ఎందుకే అంతలావున అరుస్తావు? " ముసలమ్మ చిన్నగా గొణిగింది.

"అమ్మా ఏంటే? ఇది గుడ్డకంతా నెత్తురవుతోంది" అంది గాభరాగా చిన్న కూతురు సుజాత.

"ఏముందే! ఎందుకు అంత గాభరా పడతావు. పెద్ద మనిషివి అయ్యావు లేవే!" అంటూ చాప దీసుకొని ఒక పక్కన వేసి అదుగో ఆ మూలన్న కూచ్చో" అంది.

"ఇదేంటమ్మా షాపుకి టైమవుతుంటే కూర్చోమంటావేంటి? " అమాయకంగా అడిగింది సుజాత.

"పదిహేను రోజుల్దాకా బైటికి పోవడానికి లేదమ్మా" మామూలు పద్ధతి ప్రకారం చెప్పింది రంగమ్మ.

"అమ్మా నువ్వు చెప్పేది బాగానే ఉందిలే. అన్ని రోజులు పోకపోతే షావుకారు ఊరుకుంటాడా? తీసేసి ఇంకెవుర్నన్నా పెట్టుకుంటాడు" అంటూ చాపమీద కూర్చుంది సుజాత.

అమ్మో తీసేస్తే ఇంకేమన్నా ఉందా. వీళ్ళు తెచ్చేయి వేణ్ణీళ్ళకు చన్నీళ్ళులాగా తోడవుతుండయ్యి. ఈ నాలుగు రూపాయలు కూడా రాకపోతే తీర్చాల్సిన అప్పులన్నీ ఎవరు తీరుస్తారు అనుకుంటూ "అమ్మాయ్ ఆ ఫోన్ నంబరియ్యమ్మా, ఫోన్ జేసి వస్తాను" అంటూ బతిమిలాడింది.

"నువ్వు ఎంత ఫోన్ జేసినా ఆయన ఒప్పుకోడమ్మా. షాపు చాలా బిజీగా ఉంటది. ఒక్క గంట ఆలస్యమైనా ఆయన అగ్గిమీద గుగ్గిలం అవుతాడు" అంటూ ఫోన్ నంబర్ చెప్పింది.

పక్కింటి అమ్మాయిని కాస్త బంకు చూస్తుండమని చెప్పి, ఫోన్ బూత్ దగ్గరికి వెళ్లింది.

మూలన కూర్చున్న సుజాతను చూస్తూ, "ఏందమ్మా ఏంది హడావుడిగా పోతోంది మీ అమ్మ" అడిగింది ముసలమ్మ.

"అన్నీ నీగ్గావాల గదా నాయనమ్మా. షాపుకి ఫోన్ చేసి పదిహేను రోజులు నేను రానని చెప్పిరావడానికి వెళ్లింది" అంటూ విసుక్కుంది.

'ఎట్ట ఉండాల్సినోళ్ళు ఎట్ట అయిపోయారు. ఎందుకొచ్చిన గాశారం. అందరూ కలిసుంటే, సొంతూర్లో ఉంటే, ఇట్టాంటప్పుడు మామూలుగా జరిగేదా! పెళ్ళి జరిగినట్టు జరగబోయిందా! ఉండూరు వదిలిపెట్టాల్సి రావడం ఎంత శాపమో కదా! కోడలు మంచిది కాబట్టి, కష్టపడి వచ్చింది కాబట్టి ఇన్ని కష్టాలని భరిస్తోంది. అదే ఇంకెవరన్నా అయితే కొడుకులు వదిలి పెట్టేస్తే కోడలు చూడాల్సినంత అవసరమేముంది. అయినా చూస్తుందంటే సత్తెకాలపు మణిసి కాబట్టి చూస్తుంది. చేతులెత్తి దణ్ణం పెట్టుకోవచ్చు. కాపరానికి వచ్చినప్పుడు కూడా పెద్ద కోడళ్ళిద్దరూ ఎంత యాతన పెట్టేవాళ్ళు. అయిన పనీ కానిపనీ అన్నీ చెప్పేవాళ్ళు. పాపం పల్లెత్తు మాట కూడా అనేది కాదు. తలొంచుకోని చేస్తానే ఉండేది.

అందుకే మిగిలిన ముగ్గురు కోడళ్ళ కంటే ఎక్కువ అభిమానంగా ఉండేదాన్ని' అనుకుంటూ బాధపడింది ముసలమ్మ.

"అమ్మాయ్ రొండ్రోజుల కంటే ఎక్కువ ఉండటానికి లేదంట. అట్టయితే ఇంకో మణిసిని చూసుకుంటానని ఖరాఖండిగా చెప్పాడే!

ఇప్పుడెట్టా చెయ్యాల" ఫోన్ చేసి వచ్చిన రంగమ్మ కూతురికి చెప్పి తల పట్టుకొని కూర్చుంది.

"అమ్మా ఇప్పుడీ చాదస్తాలెవరు చూస్తున్నారు. మా ఫ్రెండ్స్ ఎంతమంది కావడం లేదు. రొండేరోజే షాపు కొస్తున్నారు" అనడంతో, "అదేనమ్మాయ్ నేను కూడా ఆలోచిస్తోంది. ఇది కూడా పోయిందంటే మళ్లీ ఎక్కడో ఒకచోట చూసుకోవాల్సిందే! ఎందుకొచ్చిన తంటా! ఏం చెయ్యడానికీ దరిదోచడం లేదు. అని "ఏమమ్మా ఏం చేద్దాం!" అంటూ సుబ్బులమ్మను సలహా అడిగింది.

"ఏం జేస్తారే! అన్నీ సక్కరమంగా ఉంటే ఇంతగా ఆలోచించాల్సిన ఖర్మ ఎందుకుండేది? అంతా అయిపోయింది. నీకు తోసినట్టుగా చెయ్యి" అనడంతో తల పట్టుకొని కొద్ది సేపు కూర్చుని ఆలోచించింది.

"మరీ మూడు రోజులన్నా లేకుండా రెండ్రోజులు ఎట్టనే" అనడంతో "అమ్మా మూడు రోజులైతే ఒప్పుకుంటాళ్ళే" అనడంతో సరే మూడోరోజు దిగపారా నీళ్ళన్నా పోసి పంపిద్దాం. అంతకంటే చేసేది ఏఘుంది" అంటూ సుబ్బులమ్మ వైపు చూసింది.

ఆమె మొఖంలో ఎలాంటి భావమూ కనిపించలేదు. ఏమీ మాట్లాడలేదు. సరేలే అనుకుని సరిపెట్టుకుని బంకు దగ్గరికి వెళ్లిపోయింది రంగమ్మ.

మూడు రోజుల తరువాత తల దిగపారా నీళ్ళుపోసి, కూతుర్ని షాపుకు పంపుతుంటే ఆమె తల్లి మనసు విలవిల్లాడింది.

'ఉన్న ఊరు వదిలి పెట్టి, వాలుకి పారే నీళ్ళలాగా కొట్టుకుని వచ్చాం. గాశారం గాక పోతే ఈ అడివిలో ఈ వనస్థాపమేంది? కూటికోసం వచ్చి కంచం కోసం పోట్టాడుకున్నట్టే ఉంది.

ఊరు కాని ఊరు.



ఇరంపరం లేని మనుషులు. పూచికపుల్లకి కూడా లెక్కలు తీసే మనుషులు. ఆడుంటే తిన్నా తినకపోయినా గాలి పీలిస్తేనే పేణం హాయిగా ఉండేది.

ఎంతోమంది అప్పులు ఇచ్చినోళ్ళని జూశాం. తీసుకున్నోళ్ళని చూశాం కానీ

ఇంతగా కూలికి విషం తాగే మణుసుల్ని యాడా చూళ్ళేదు. మణుసుల్తో మాట్లాడినట్టే ఉండదు. ఈళ్ళకి డబ్బు యావ తప్ప రెండో యావ ఉండదు లాగుంది.

ఎవురికి అన్యాయం జేశానో నేను అనబగి



చ్చేది గాకుండా, నా కడుపున పుట్టినందుకు యీళ్ళు కూడా అనబగిస్తున్నారు. యీళ్ళకి ఎటువంటి పెట్టిపోతలు పెట్టి సాగనంపు తానో గానీ, పిల్ల పెద్దమణిసి అయినా కానీ నలుగురు ముత్తయిదువల్ని పిల్చి తాంబూలం ఇచ్చుకోవటానికి గూడా లేకపో యినే! నలుగురు మనుషులు నా అనేవాళ్ళు లేరు. ఒకపూట పిల్ల ఇంటికాడ ఉండటానికి లేదు.

ఊళ్ళో ఎవరు పెద్దమణిసైనా ఎంత వినోదం చేసేవాళ్ళు. ఊరందరికీ పేరంటమే గదా! ఇంకా స్థితిమంతులైతే ఒక వేడుకలాగా చేసుకుని ఊరందరికీ బంతి భోజనాలు కూడా పెట్టేవాళ్ళు గదా!

నాకు కూడా తక్కువగా జరిగిందా! అనా థలాగా ఉండినా కానీ అందరూ తలా ఒక చెయ్యేసి, ఆ కార్యాన్ని కాస్తా జరిపించే వాళ్లుగదా! అమ్మ యాడుందో తెలియని నాకు నాయనమ్మే కదా ఏంజేసినా! అయితే మాత్రమేం ఊళ్ళో అందరూ వచ్చి నాయన మ్మని ఏపనిలోనన్నా ఏలు బెట్టనిచ్చేరా! అన్నీ దగ్గిరే ఉండి చూసుకున్నారు కదా!"

ఆ తర్వాత పెళ్లి ఎంత వైభోగంగా జరిగిం దీ, అని ఆలోచించుకుంటున్న రంగమ్మ కళ్ళలో కన్నీటి తెరలు. ఆ తెరలమీద గతం నీడలు...

## 4

ఇంట్లో కిచకిచమంటూ ఎలు కలు. బయటివైపున బెకబెక మంటున్న కప్పలు. ఒక మూలన మంచంపై పడుకుని ఉంది రంగమ్మ. పక్కనే నాయనమ్మ.

"ఏందమ్మా నిద్ర పట్టడం లేదా?" అడిగింది వీరమ్మ అటూ ఇటూ మెసుల్తున్న మనమ రాల్ని చూస్తూ.

"ఆ!" అంటూ తలూపింది రంగమ్మ. "ఏమమ్మా ఎందుకని" అంటూ రంగమ్మ వైపుకు తిరిగి పడు కుంది వీరమ్మ.

"మొన్నటి దాకా మిరపకాయలు కోసీకోసీ ఒళ్ళంతా మంటబుడుతోంది. ఇయ్యాల పొక్కట్టెలు పీకేతలికి చేతులంతా బొబ్బలెక్కి నయ్" అంటూ చేతుల్లోని బొబ్బలు చూసు కుంది రంగమ్మ.

వీరమ్మ మాట్లాడలేదు. చదువుకోవాల్సిన

వయసులో ఈ పిల్లకి ఎంత గాశారం పట్టిప డింది. ఎర్రనగ్గిలో కూలికిపోవాల్సిన కర్మం బుట్టింది.

ఏం జేద్దాం ఆ తల్లి సక్కమంగా ఇంటి పట్టున ఉండి చూసుకుంటే ఈ గాశారం ఉండేదా! కమ్మగా అందరు పిల్లలతోపాటు చదువుకునేది గదా! అనుకుని కళ్లల్లో నుండి కొలుకుల్లోకి జారిన రెండు కన్నీటి బొట్లను తుడుచుకుంటూ "రంగమ్మా" అని మళ్ళీ పల కరించింది.

"ఊ..." అని పలికింది. "నక్కపాలెంలో హరిశ్చంద్ర నాటకం ఉంది. వెళ్దామా!" అంటూ రంగమ్మ మొఖంలోని బాధను చూడ దానికి ప్రయత్నించింది.

"ఈ నాటకం చాలదంటమ్మా మనకి. అమ్మ గుర్తొస్తేనే ఎంత దిగులుగా ఉంటుందోనమ్మా. అందరు పిల్లలూ బళ్ళకి వెళ్తారు. ఇంటికొచ్చి ఆడుకుంటారు. ఇంటి దగ్గిర ఏమన్నా పనులుంటే ఎగదోస్తారు. నేనె పుడన్నా ఆటకి పోతే ఏరు బందరంగా పెట్టి చూస్తారు. నా మొకానెందుకు ఇట్ట రాశాడు దేముడు" అడిగింది రంగమ్మ.

వీరమ్మ కనుకొలనుల నుండి ధారాపా తంగా కారుతున్న కన్నీళ్ళు చెంపల మీదుగా జారి, భుజాల పైని పైటకొంగును తడుపుతు న్నాయి.

ఎంత బాధ పడకపోతే ఈ పిల్ల ఇయ్యా ల ఇంత లోతుగా మాట్టాడుద్ది. ఆడుకోవా ల్సిన వయిసులో అన్నీ బాధలే అయితే ఏం జేసుద్ది. పాపం ఎండకీ వానకీ పెద్దోళ్ళలాగా పొరకాడాల్సి వస్తుంది అనుకుంది. "అయితే, బడికిపోతావా రంగమ్మా"అడిగింది వీరమ్మ.

నిదురబోతూ రెప్పలు మూస్తున్న రంగమ్మ ఆ మాటకు "ఇంకేం బడికి పోయేన్లే! తింటాని కెట్టొచ్చుద్దమ్మా చేసుకోక పోతే! నువ్వేమో మోకాళ్ళ నెప్పుల్తోటి బాధ పడతంటివి. నాన్నేమో ఇంటికి చేసిన అప్పులు ఇంకా తీరుస్తానే ఉండే! అమ్మెక్క డుంటదో తెలియకనే పోతుండే. పాపం తాత కూడా కాళ్ళీడ్చుకుంటానే జంగిలి గొడ్ల కాడికి పోతానే ఉండాడు కదా! ఇంతమంది బాధపడుతుంటే నేను బడికి పోకపోతే ఏం బోయిందిలే గానీ, నానమ్మా మమ్మకి ఈ గుబులు పుటకతోనే వచ్చిందా! మజ్జలో ఏమన్నా అయ్యిందా!" తన సందేహాన్ని బయట పెట్టింది.

"పుటకలో యాడుందమ్మా. రత్నంలాంటి దైతేనూ. పుట్టినప్పుడు బాగానే ఉంది. పెద్ద యినాక బాగానే ఉంది. దాని తోటోళ్ళం దరూ తొందర తొందరగా పెద్ద మడుసుల వుతున్నారు. ఇదేమో అట్నే ఉండిపో యింది. మీ అమ్మమ్మకి పెద్ద బెంగ పట్టు కుంది. మనూర్లో ఇట్టాంటి వైదగాలకి మంత్రసాని మట్టపాటి లచ్చిమని ఒకామె ఉండేది. ఏదో ఆకుపసురు పోస్తానంది. సరే పొయ్యి ఈడు దాటిపోతంది" అని చెప్పింది.

ఒకరోజు ఏదో పసురు తయారు జేసు కొని వచ్చింది లచ్చిమి. ఆ రోజు అందరూ కూళ్ళు తిని పడుకోబోయేటప్పుడు, అన్నం తిన్న తరువాత మీ అమ్మని పడుకోమని చెప్పి ముక్కుల్లో పసురు పోసింది. పేద్ద గిన్నెడు పసురు కదా; రెండు మూడుసార్లు గొంతులోకి పోయి పొరబోయింది. అయినా ఆపకుండా మొత్తం పొయ్యాల్సిందే నని ఊపిరాడకుండా మొత్తం పోసేసింది. దాంతో మణిసి దిమ్మరపోయింది. తెప్పరిల్ల లేక అట్నే శానాసేపు ఉండిపోయింది.

ఆ తరవాత వారం రోజులపాటు జెరం తగిలింది. తల పగిలి పోయేటంత నెప్పి వచ్చింది. ఎన్ని కట్లు కట్టినా, ఎన్ని వైద గాలు జేసినా అబ్బే, లాభం నేకపోయింది. నెల రోజులపాటు తలంతా భారంగా సూదులు గుచ్చినట్టుగా పోటుగా ఉండే దంట. ఆ తరవాత క్రమేణా అదే తగ్గిపో యింది.

అప్పట్నుండీ ఒక్కోసారి ఉన్నట్టుండి గుబులు మళ్ళేది. దాంతో ఏదేదో మాట్లా డేది. అది మొదలు ఒకసెర పడ్డారా మీ అమ్మతోటి. తెల్లారకముందే కరేడు

బోవడం, అక్కణ్ణుండి తమలపాకులు తీసుకొని నందానం పోవడం, అక్కడ ఆకులన్నీ అమ్ముకుని ఇంటికి రావడం, అప్పుడు మీ అమ్మని తీసుకుని ఒంగోలు మిషనాసుపత్రికి తీసుకుపోవడం. అప్పుడు బస్సులు కూడా ఇంతిదిగా ఉండేయి కాదు. రెండే రెండు బొగ్గు బస్సులు తిరుగుతుండేయి. ఒకటి కావలికి పోతే ఇంకోటి ఒంగోలుకి పోయేది. మజ్జిలో ఒకటి చెడిపోయిందంటే ఇంక అయిపోయినట్టే. ప్రతి ఊళ్ళో అడ్డరోడ్ల దగ్గరికి చేరుకొని అందరూ దానికోసం ఎదురు చూస్తా కూర్చుని ఉండేవాళ్ళు. వచ్చినరోజు పైనా కిందా యాలాడతా ఉండేవాళ్ళు. అట్ట ఎంతకాలం పడ్డదో పాపం.

అయినా తగ్గితే గదా! ఇంక ఈడ లాభం లేదని మెడ్రాసు తీసుకెళ్ళమన్నారు. అప్పుడు అసలు నరకం మొదలైంది. ఆడ కరెంటు బెట్టారు. అప్పుడు కాస్త తగ్గినట్టు ఉండేది. తరవాత మళ్ళీ పది రోజులకి మామూలుగానే ఉండేది. దేశదేశాల్లో తిప్పి తిప్పి పేణాలు అలసిపోయినియ్యి.

పాపం పుణ్యాత్ముడు మీ నాన్న అన్నీ తెలిసీ కూడా అయినోళ్ళు పోయినోళ్ళని బాధ పంటి బిగువున భరిస్తానే ఉండేవాడు.

భరించి భరించీ పాపం ఒక్కమాట కూడా మాట్లాడలేకపోయేవాడు. అప్పుడే నువ్వు బుట్టావు. నువ్వు పుట్టిన రెండు నెల్లకే నిన్నక్కడ పారేసి ఎటు పోయిందో అంతులేదు. ఆ తరవాత ఎప్పటికో వచ్చింది."

అంతా విన్న రంగమ్మ "నాకు ముందు మగపిల్లోడు పుట్టేడంట కదమ్మా" అని అడిగింది.

"అవునమ్మా పుట్టినప్పుడు బాగనే ఉండాడు. ఒకరోజు అర్ధరాత్రప్పుడు పక్కలో పడుకున్నాడు పడుకున్నట్టే మెలికలు తిరిగి పోవడం మొదలు పెట్టాడు. గుర్రపు సంధ న్నాడు డాక్టర్. తెల్లారేసరికి కన్ను మూసాడు. వాడు కూడా ఉండట్టయితే

## పిల్సా!... పాస్... పాస్...

"అమ్మో! ఇంజక్షనా!" అంటూ ఆమడ దూరం పరిగెత్తే వాళ్ళని చాలా మంది ని చూస్తుంటాం. టాబ్లెట్లయితే కళ్ళు మూసుకుని మింగెయ్యొచ్చని సంబర పడి పోతుంటూరు. ఇవ్వాళ ఏ వ్యాధికైనా ఇంజక్షన్లతో బాటు టాబ్లెట్లూ అందుబా



టులో కొచ్చాయి. కుటుంబ నియంత్రణ కోసం వచ్చిన అనేక పద్ధతుల్లో... మాలా -'డి' వంటి ఓవర్ పిల్స్... వాడకంలోకి వచ్చాయి. ఈ ఓరల్ పిల్స్ వాడటం వల్ల స్త్రీలలో సెక్స్ కోరికలు తగ్గిపోతాయంటున్నారు బోస్టన్ యూనివర్సిటీ వాళ్ళు. ఈ సమస్య పిల్స్ తీసుకునే సమయంలోనే కాక నిలిపివేసిన తర్వాత నెలలు, సంవత్సరాల వరకూ కొనసాగుతుందంటున్నారు. ఈ పిల్స్ వాడటం వల్ల సెక్స్ హార్మోన్ బైండింగ్ గ్లోబ్యులిన్ (SHBG) అనే ప్రోటీన్ విడుదలై సెక్స్ కోరికల్ని ఉద్రేకపరిచే టెస్టోస్టిరోన్‌ని నియంత్రిస్తుందని వాళ్ళు సెలవిస్తున్నారు. 124 మంది పిల్స్ తీసుకుంటున్న స్త్రీలపై జరిపిన పరిశోధనల్లో ఈ SHBG నాలుగు రెట్లు అధిక ప్రమాణాల్లో ఉన్నట్టు పరిశీలించారు. పిల్స్ తీసుకోవడం ఆపేసిన స్త్రీలలో 1 1/2 నుండి 3 రెట్లు నార్మల్ కంటే ఎక్కువగా ఉన్నట్టు నిర్ధారించారు. సో, మీలో సెక్స్ కోరికలు తగ్గుముఖం పట్టినట్టనిపిస్తే మీ గైనకాలజిస్టుని, సంప్రదించండి. పిల్స్ ప్రిస్క్రైబ్ చేస్తే పాస్... చెప్పేయ్యండి.

# చతుర భాషితాలు

▶ మూర్ఖుడి హృదయం నాలుకపై ఉంటుంది. వివేక వంతుడి నాలుక హృదయంలో ఉంటుంది.

– ఒక సామెత

▶ ఒక మంచి మనిషి జీవితంలోని ఉత్తమమైన భాగం– దయతో, ప్రేమతో తను చేసి మరచిపోయిన చిన్న పనులే.

–వర్డ్స్‌వర్త్

▶ ప్రపంచ శాంతిని తమ షరతుల ప్రకారం ఆశించే దేశాలే యుద్ధ బీజాలను నాటుతున్నాయి.

–బ్రౌన్

▶ మనం చేసే పనులు మన మాటల కంటే బిగ్గరగా పలుకుతాయి.

–కార్ల్

▶ అవధులు దాటితే ఓర్పే పిరికితనం అనిపించుకుంటుంది.

–జోసఫ్ రోక్స్

▶ ఎక్కువగా నమ్మడంవల్ల మోస పోవచ్చు. కానీ నమ్మకమే ఉంచకుండా బతకడం దుర్భరం.

–క్రేన్

▶ చేయదలచుకున్న మంచి పని వెంటనే చేయగలగాలి. జాప్యం చేస్తే అందులోని 'మంచి' హరించుకుపోవచ్చు.

–ఎమర్సన్

▶ తక్కువ స్థాయిలో ఉన్న వారిపట్ల చూపే ప్రదర్శన ద్వారానే ఒక గొప్ప వ్యక్తి తన గొప్పదనాన్ని తెలియజేస్తాడు.

– కార్లైల్

▶ మంచి విషయాలను పొందేందుకు ఉపయోగపడే పనిముట్లుగా దేవుడు మనకు కష్టాలను ఇస్తాడు.

–ఒక సామెత

▶ స్వచ్ఛమైన వివేకం కంటే మృదువైన తలదిండు మరొకటి లేదు.

–ఫ్రెంచి సామెత

▶ సౌందర్యం నిత్యానందం. దాని సొగసు సదా ప్రవృద్ధినే పొందుతుంది.

–కీట్స్

▶ సమదృష్టి గల మనస్సు అన్ని దుఃఖాలకు ఉత్తమ ఔషధం.

–ప్లాటస్

ఇంక ఎన్ని తంటాలు పడేవోళ్ళో! ఏందమ్మా ఇయ్యాల ఎక్కడెక్కడి ఆలోచనలో చేస్తుం డావు" అడిగింది వీరమ్మ.

"ఎందుకోనమ్మా అమ్మ గుర్తొస్తే చాలా బాధనిపిస్తుంది. పాపం ఎప్పుడూ పాత పాశారకోకలు కట్టుకునేది. వాటిని జూసుకునే తెగ మురిసిపోయేది. ఎప్పుడన్నా కోరా గుడ్డ లకి రంగేయించుకునేది. అదే కొత్త కోకలాగా ఎంత సంబరంగా ఉండేదో!" అనడంతో-

"అది మంచి చావే చచ్చిందమ్మా. ఉండం తకాలం ఎవురింట్లో చెట్లపాదులు యెయ్యా లన్నా మీ అమ్మనే పిలిచేవాళ్ళు. ఎవరు కోణ్ణి గుడ్లకి పొదగేయాలన్నా మీ అమ్మనే పిలిచేవాళ్ళు. పొలంలో యెద బెట్టడానికి కూడా మీ అమ్మచేతే మొదులు బెట్టిచ్చే వోళ్ళు. ఎందుకనో మరి మీ అమ్మంటే ఊరందరికీ అంతగురి.

నాలుగో తరగతి చదివింది. చదువుకోవడ మంటే ఎంత అపేచ్చో! కొట్లో తెచ్చిన పొట్లాం కాయితం గూడా వదిలి పెట్టేది కాదు. గోయిందమ్మ దగ్గిరికి పోయి నాకు చదువు చెప్పు అని అడిగి మరి చెప్పిచ్చుకునేది. కాలం దాని మొకాన రాత అట్టరాసింది. ఎట్ట తెల్లార్చుకోని పోయేవాళ్ళు అట్టపోవాల. కలి కాయ చెరువుకి వప్ప జెప్పాల్సుంది. అట్నే జెప్పేము" అంటూ నిద్ర ముంచుకు రావ డంతో వీరమ్మ నిద్రలోకి జారుకుంది.

రంగమ్మ కళ్ళు మూసిందన్న మాటేగానీ, ఒక పట్టాన నిద్ర పట్టలేదు. ఆ రోజెందుకో ఎంత విదిలించుకున్నా అమ్మ జ్ఞాపకాలే ముసురుకుంటున్నాయి.

ఊహ తెలిసినప్పటి నుండీ ఎంతో ప్రేమగా చూసేది. మనిషి మామూలుగా ఉండప్పుడు తలకాయ ఒంచుకునే పోయేది. ఎవుర్నయినా ఒక్క మాటనేది కాదు. గుబు లొస్తే మాత్రం పిచ్చెక్కిపోయేది. ఆ పిచ్చిలో నేగా ప్రాణాలు తీసేసుకుంది.

ఆ సంవత్సరం మాగాణి పండింది. ఆ వడ్లు అమ్మాలని నాన్నా, వద్దని అమ్మా వాదులాడుతున్నారు. గుబులు మళ్ళినప్పుడు ఆమెని ఎవురు ఏమన్నా ఊరుకోదు కదా! నాన్నని బెదిరించడానికి అక్కడున్న పురుగుల మందు తీసుకుంది. 'ఇది తాగితే ఒకరోజు తోటి నిడివేరి పోవచ్చు అంది.'

పనిలో ఉన్న నాన్న పట్టించుకోలేదు. అంతే సీసా ఎత్తిపట్టుకొని గటగటా తాగిం దంటా. ఎంతపని చేసిందో! ఏమీ తినకుండా ఖాళీ కడుపుతో ఉండడంతో తొందర తొంద రగా పాకిపోయిందంట. అక్కడికక్కడే కుప్ప కూలిపోయింది. బాధ పడీపడీ తెల్లార్చుకుని పోయింది.

రంగమ్మ తల్లి గురించిన ఆలోచనలతో కలత నిద్రలో కలవరిస్తూ పడుకుంది. తెల్ల వార్లూ కలవరిస్తున్న రంగమ్మని వీరమ్మ నిద్ర లేపుతూనే ఉంది. అప్పుడు కలవరింత లాపినా మళ్ళీ కలవరిస్తూనే ఉండేది.

* * *

తొలికోడి కూతతో వీరమ్మ నిద్రలేసింది. తెల్లవార్లూ కలవరింతలతోటే నిద్ర పోకపోవ డంతో రంగమ్మని నిద్ర లేపలేదు.

తూరుపు వెలుగురేకలు భూమిని ముద్దా డుతున్నాయి. జనం ఊరంతా ఎవరి పను ల్లో వాళ్ళున్నారు. కావళ్ళూ, బుంగలూ, చేతి కడవలతో నీళ్ళు తెచ్చే వాళ్ళు తెచ్చుకుంటు న్నారు. కిర్రుంకిర్రుం అంటూ కావిళ్ళు పైకీ కిందకూ ఊగుతూ చేసే శబ్దం సంగీతాన్ని పుట్టిస్తోంది. రెడ్డి బాయి దగ్గర చుట్టూ చేరి కొందరు బుంగలతో నీళ్లు తోడుతున్నారు. ఆడవాళ్లు భుజాలమీద బుంగలు పెట్టుకొని నడుమున చేతులు బెట్టుకొని వయ్యారంగా తిప్పుకుంటూ నీళ్ల తీసుకువెళ్తున్నారు.

అలాంటి ప్రభాతవేళ కాలకృత్యాలకు వెళ్లి వచ్చాక మనుమరాలు గాభరాగా చెప్పిన విషయం విని వీరమ్మ ముసిముసిగా నవ్వి ప్రేమగా దగ్గరకు తీసుకుంది.

"నువ్వు పెద్ద మణిసివయ్యావే, భయంలే దులే" అంటూ ఇంట్లోకి పిలిచి ఒక మూలన చాపవేసి కూర్చోబెట్టింది. "ఇక్కడ కూచుంటే ఎట్టా రత్తమ్మోళ్ళ పనికి పోవద్దంటే" అంటూ అడిగింది రంగమ్మ.

"ఇంక పదిహేను రోజుల దాకా ఇంట్లో నుండి ఎక్కడికీ కదలడానికి లేదు. ఇంతకు ముందు నీ స్నేహితుల్ని చూశావుగా."

చుట్టుపక్కల అందరూ వచ్చి "ఏం జేద్దామనుకుంటున్నావు ఈరప్పా!" అనడిగారు. లోపలికి పిల్ల వైపు తొంగిచూస్తూ.

"అదే ఆలోచిస్తున్నా. దరి దోచడం లేదు."

ఒక్కగానొక్క పిల్లాయె. అది తల్లిలేని పిల్లయినా నువ్వే కళ్లల్లో పెట్టుకుని కాపాడుతుంటివి. అందుకే ఆ పిల్ల నిన్నే అమ్మా అమ్మా అనే పిలుస్తుంది. కోడిరెక్కల చాటున పిల్లల్ని కాపాడినట్టు కాపాడుకొస్తుంటివి. నువ్వు కూర్చోబెట్టు. మేమంతా లేమా ఏందీ? తలా ఒక చెయ్యేస్తాము" అన్నారు.

"అమ్మాయ్ ఇంక ఏదంటే అది తింటానికి లేదు" అని రంగమ్మకి పిట్టు వండిపెట్టింది వీరమ్మ. అది తినడం రంగమ్మ వల్ల కాలేదు. వాంతొచ్చినంత పనైంది. అయినా అది తప్ప తింటానికి గత్యంతరం లేక ఒక్కో ముక్క తీసుకుని తింటూ అలవాటు చేసుకుంది.

రోజుకొకరు ఇంటి చుట్టుపక్కల వాళ్ళు తలా ఒకరకం తినటానికి వండుకుని వచ్చారు. ఆ విధంగా ఎండు కొబ్బరీ, బెల్లం, పెసరపప్పు పులగం, పిట్టు, సెనగపప్పుతో కొట్టిన పిండి వంటి రకరకాల పదార్థాలు తినడం వల్ల నోరు ఎండుగడ్డి తిన్నట్టుగా తయారయింది.

చుట్టుపక్కలవాళ్ళు ఆప్యాయత చూపిస్తుంటే రంగమ్మ తల్లి లేని బాధ కూడా మరచిపోయింది.

ఏడో రోజు కుండల్లోకి వచ్చే రోజు. ముత్తయిదువులంతా చేరి, తమ ఇంట్లో పిల్ల పెద్దమనిషి అయినట్టుగానే భావించి సందడి సందడిగా మంగళహారతులు పాడుతూ, ఇంట్లో కుండలన్నీ తాకిస్తూ, నవధాన్యాలు దోసిలిలో పోస్తూ, ఇంట్లో అన్ని వస్తువుల్ని పరిచయం చేస్తూ శుభకార్యాన్ని ఘనంగా చేశారు. తల్లిలేని పిల్లని తలా ఒకవస్తువు కూడా బహుమతిగా తెచ్చిచ్చారు.




రంగమ్మ పెద్దమనిషయ్యాక అయిదారేళ్ళకు పెళ్ళి జరిగింది. పెద్దగా కలిగినోళ్ళు కాకపోయినా తాను తూగినంతలో వైభవంగానే జరిగిందనుకోవాలి. ఆ పెళ్లికి ఎంత హడావిడి... ఎంత ఆర్భాటం... అసలదే ఎంత ముచ్చట...

మేఘాలు ఆకాశంలో ఒక్కచోటికి పోగవుతున్నట్టు హడావుడిగా అటూ ఇటూ పరిగెత్తుతున్నాయి. తొలికోళ్ళు కూస్తున్నాయి. తెల్లవారితే రంగమ్మ పెళ్ళి. అంత చిమ్మ చీకట్లో కూడా వీరమ్మ ఉరుకులు పరుగులతో వంటకు కావలసిన కాగుల కోసం, గిన్నెల కోసం ఇంటింటికీ తిరుగుతోంది.

అంతకు ముందురోజే కావాల్సిన సామాన్లన్నీ కాలుగాలిన పిల్లిలాగా ఇంటింటికీ తిరిగి సేకరించింది. క్షీరాన్నం చెయ్యడానికి ఒక పాత్ర తక్కువ కావడంతో ఆ చీకట్లోనే నిదురపోయే వాళ్ళని లేపి మరీ అడుగుతోంది.

చివరికి చిన్నప్పగారి ఇంటి దగ్గర దొరకడంతో అది తీసుకుని ఇంటికి వచ్చింది.

'ఈ ముదనష్టపు వాన ఎట్టజేసుద్దో. బాగా మొయిలు లేసుంది. ఇప్పుడా! ఇంకాసేపా! అన్నట్టుంది' అనుకుంటూ ఆందోళనగా తీసుకొచ్చిన గంగాళాన్ని టెంకాయ పీచుతో రుద్దుతోంది.

పెట్రోమాక్స్ లైట్ సుయ్యిమంటూ శబ్దం చేస్తూ చుట్టూ ఉన్న చీకటిని పారదోలుతూ తెల్లని వెలుగుని చుట్టుపక్కలకు వెదజల్లుతోంది. దాని చుట్టూ తిరుగుతున్న పురుగులు దానికి కొట్టుకొని టప్ టప్మని శబ్దం చేస్తున్నాయి.

దగ్గర చుట్టాలూ, దాయాదులూ, చుట్టుప క్కల వాళ్ళు పనులు చెయ్యడానికి వచ్చారు.

ఆ లైటు వెలుతురులో పొలాన్నుంచి కోసు కొచ్చిన గోంగూర కాడలు కోస్తూ అమ్మల క్కలు తలా ఒక మాట మాట్లాడుకుంటూ ఆ చీకటి నిశ్శబ్దాన్ని పారదోలుతున్నారు.

పొద్దున్నే పనులకు పోయేవాళ్ళు కావిళ్ళతో నీళ్ళు తెస్తుండడంతో కిర్రుకిర్రుమని కావడి శబ్దాలు వినిపిస్తున్నాయి.

"ఇంతకీ ఏమేం కూరలు చేస్తున్నారు" ఈశ్వరమ్మ గోంగూర దగ్గర కూర్చుంటూ అడిగింది.

"కూరలు జేసే పెద్దవి ఇప్పుడా వొచ్చేది" వెంకటరత్నం అంది.

"ఆ యెమ్మాయి ఎప్పుడో వొచ్చిందే! అప్ప టికి మీరెవరు రాలేదు. మళ్లా ఇంటికి పోయి వాళ్ళమ్మాయిని నిద్రలేపి వస్తోంది" వీరమ్మ అందుకుంది.

"సూత్రధారివి నువ్వే కదమ్మా. నీ చేతి మీదగానే గదంటమ్మా ఊళ్ళో పెళ్ళిళ్ళన్నీ జర గాల్సింది. నువ్వు లేకపోతే ఎట్ట" లక్ష్మమ్మ నవ్వుతూ అంది.

"నువ్వన్నీ తీసుకోవే పెత్తనం. నేనెట్టాగూ మానుకుందామనుకుంటున్నాను. నా గ్గూడా ఒంట్లో ఓపిక ఉండడం లేదు"

"దాని మాటలకేం గానీ, నీకు తెలియని కూరలేమి ఉండయ్యి. చేలల్లో గోంగూర, దోస కాయలు దొరికినియ్యి. సరే ఇంక పెసరపప్పు, ఉల్లిగడ్డ కారం, పప్పుచారు, బెల్లపు చారు ఉండనే ఉంటయ్యి గదా. అవిగో ఆ గిన్నె నిండా అయినియ్యి. అందరూ తెచ్చి పోసిన పాలు వాటిని తోడేశాను" అంది వీరమ్మ.

"ఇంతకీ సిరాణం (క్షీరాన్నం) ఉందా లేదా!" రాగమ్మ అందుకుంది.

"అది లేకపోతే నువ్వూరుకుంటావా. అది కూడా ఉందిలే" నవ్వుతూ చెప్పింది వీరమ్మ.

"అందరం గోంగూర కాడెందుకు గానీ, కొంతమందిమి ఆ పొయ్యి కాడ చూద్దాం రండి" అంటూ ఇద్దర్ని తీసుకొని పొయ్యి దగ్గ రకెళ్లింది ఈశ్వరమ్మ.

"ఈరప్పొ బియ్యమెన్ని యెయ్యాలో, ఎంత మందిని పిల్చారో, ఇట్రా నైనం చెబుదువు" అంటూ పిల్చింది వీరమ్మ.

"ఊళ్ళో అందర్నీ పిలవలేదమ్మాయ్. మన దాయాదులు, మా ఇంట్లో వాళ్ళు, వొచ్చే చుట్టాలు అంతవరకే. ఎంతమంది చుట్టాలొ స్తారో రాత్రి రాగవులు లెక్క చెప్పాడు కదా!"

"ఆ...ఆ...చెప్పేడులే. అంటే మొత్తం కలిసి" అంటూ గాల్లోకి చూసి ఉజ్జాయింపుగా లెక్క వేసింది.

"బయట్నించి చుట్టాలంటే బొడ్డేరిపాలెం, ఆలూరు, గాదెపాలం, కొప్పోలు, కాణిజేడు, అల్లూరు దాయాదులే కదా!"

"ఆ అంతే. ఆడ మీ నరసమామ ఉంటాడు పిలువమ్మా చెబుతాడు" అంది వీరమ్మ.

"ఆయనవసరం లేదుగానీ, ఇంక నా లెక్క నా కొచ్చింది గానీ, నీ పనికి నువ్వు బో" అని ఈశ్వరమ్మ అనడంతో, "నీ కెందుకు తెలియ దమ్మా ఆవలిస్తే పేగులు లెక్కబెట్టే దాని వైతే" అంటూ గిన్నె తీసుకొని ఇంట్లోకి వెళ్ళింది వీరమ్మ.

కుమ్మరి వెంకయ్య పొయ్యిలు తొవ్వి గడ్డ పారలు పేర్చి టెంకాయలు కొట్టి పొయ్యి రాజే శాడు. అన్నం డేగిశాలు పొయ్యిమీద పెట్టి ఎసరుకు నీళ్ళు పొయ్యడానికి కుర్రాళ్ళను కేకే శాడు.

"ఇదుగో ఎంకయ్యో, నువ్వే పోసుకో. రాత్రి గుండెలు పగల పట్టకొచ్చాం సిమెంటు తొట్లు. వాటిని నింపొద్దా. రా, ముంచుకొని పో" వా ళ్లలో ఒకడైన కోటిరెడ్డి తమాషాగా అన్నాడు.

"ఏయ్ నీకు బాగా గీర ఎక్కువైందిరా. మీ అయ్యకి చెబుతాలే. నీకూ ఒకదాన్ని చూసి చెయ్యమని! ఊ నేనొచ్చి పోసుకోవాలంటనే. రావాల్సొస్తే రానా, తేతే" అంటూ పోయి బుంగ పట్టుకున్నాడు.

"వాడితో నీకెందుకు పో. మీ ఇద్దరికీ పడ దుగానీ, నేనొస్తున్నా పా" అంటూ యల్లమం ద కావిడి పొయ్యి దగ్గర దించాడు.

"ఉండు మామా! మా ఇద్దరి మధ్యన తగాదా పెట్టాలని చూస్తున్నావా ఏంది. రేపు

నా పెళ్ళికి కావాలని ఎగ్గొట్టినా ఎగ్గొడతాడు. నేనే పోస్తా ఉండు" అంటూ కోటిరెడ్డి వచ్చి డేగిశాల్లో నీళ్ళు పోశాడు.

"మనిద్దరికీ ఎప్పుడైనా ఉండేదే లేవోయ్" అంటూ తేలగొట్టాడు వెంకయ్య.

"కానియ్యాల కానియ్యాల" అంటూ కోసిన కూరలు తీసుకొని పొయ్యి దగ్గరకు వచ్చింది ఈశ్వరమ్మ.

"అది సిరాన్నానికి పెట్టిందే కదా! ఇయిగో దానికి సంబంధించిన చక్కెరా, సగ్గుబి య్యమూ" అంటూ అందించింది వీరమ్మ.

"కానియ్యండి కానియ్యండి అన్నీ అయిపో యేతలికి చినుకులు రానే వచ్చేటట్టుండయ్యి. పైన మెయిలు చూడు ఎంతిదిగా కమ్ముకుని ఉందో చిన్న తుంపర్లు కూడా పడుతుండయ్యి చూడండి." అంటూ నాలుగు వైపులా తిరిగి ఈశ్వరమ్మ అందర్నీ తొందరపెడుతోంది.

ఆమె అన్నట్టుగానే చిన్న చిన్న తుప్పర్లు అక్కడొకటీ ఇక్కడొకటీ పడసాగాయి.

రంగమ్మ మనసులో ఆందోళన పడు తోంది. ఈ చినుకులు పెద్దవిగా మారి వాన పెరిగిందంటే వండే వంటకాలన్నీ వృధాగా పోతయ్యి. చివరికిది పెళ్ళిరోజు కూడా దుర దృష్టాన్నే వెంట తెచ్చుకుంది. పుట్టటమే శనే శ్వరము తోటి పుట్టింది. పెళ్ళిరోజు కూడా అట్నే అయింది. మిగిలిన జీవితం ఇంకా ఎంత సక్కంగా ఎలగ బెట్టుద్దో అనంటారనీ సగం ఉడికినియ్యన్నీ నేలపాలు చెయ్యాల్సి వస్తుందేమోననీ తెగ భయపడిపోతోంది.

కానీ రంగమ్మ భయపడినట్టుగా కాలేదు. వంటలన్నీ అయిపోయిందాకా తుప్పర్లు తప్ప వర్షం పడలేదు.

అప్పటి దాకా రంగమ్మ కోసమే ఆగినట్టు వాన వంటలు అయిపోతూనే మొదలై పెద్ద జల్లుగా మారింది.

హడావిడిగా వంటకాలన్నీ చుట్టుపక్కల అందుబాటులో ఉన్న ఇళ్ళల్లోకి సర్దేశారు.

అప్పుడే చుట్టాలు కూడా ఒక్కొక్కరే వస్తు న్నారు. వాళ్ళకీ ఇళ్ళలోనే మంచాలు వేసి మర్యాద చేస్తున్నారు.

బజార్లన్నీ జలమయమయ్యాయి. జల్లు ఆగిపోయి చినుకులుగా సన్నని తుంపర్లుగా మారిపోయింది.

"పొద్దున్నే వొచ్చిన వాన పొద్దుగూకి వొచ్చిన చుట్టం పోవంటారు. అయినా రంగమ్మ ఎంత రోటి కాడా రోకళ్ళ కాడా నాకినా కూడా వాన దానంతట అదే పోయిం దంటే అంతవరకూ జాతకురాలే నమ్మాయ్" అంటూ అమ్మలక్కలు రంగమ్మను ఆట పట్టించారు.

"ఎండొస్తోంది పనులు కానిచ్చి ఆ బాల దాసుళ్ళని పిలవండి "అంటూ ఈశ్వరమ్మ తొందర చేసింది.

పీటలమీద దుప్పటి పరిచి అక్షింతలు



చల్లారు. వాటి మీద రంగమ్మతో పాటు పిల్లల్ని కూర్చోబెట్టి సున్నిపిండిలో నెయ్యి కలిపి నలుగు బెట్టారు. ముత్తయిదువులకి తాంబూలాలు ఇప్పించారు. బావి దగ్గరకు తీసుకువెళ్ళి స్నానాలు చేయించారు.

ఎదురు నడవడానికి అవసరమైన పదార్థాలు అన్నీ హారతి పళ్ళాల్లో సర్ది దేవుడి ముందు పెట్టారు.

రంగమ్మ, నరసమ్మ, వీరమ్మ చేత కొబ్బరికాయలు కొట్టించారు. గోయిందా గోయిందా అంటూ ఒరపెంకులోని నిప్పుమీద సాంబ్రాణి వేస్తుంటే ఒక్కొక్కరూ దణ్ణం పెట్టుకున్నారు. కొండారెడ్డి జంఖాణా మధ్యలో కర్రను పైకెత్తి పట్టి నాలుగు వైపులా నాలుగు చెంగుల్ని నలుగురి చేత పట్టిచ్చి "ఇంత తెమిలిచ్చి బైటికి రావాల" అంటూ అరవడంతో లోపలి నుండి అందరూ తలా ఒక హారతి పళ్ళెం పట్టుకుని బయటికి వచ్చారు.

ఈశ్వరమ్మ పసుపు నీళ్ళు చల్లుతుంటే మధ్యమధ్యలో కొండారెడ్డి గోయిందా అంటుంటే మిగిలిన వాళ్ళు కూడా గోయిందా అంటూ అరుస్తూ ముందు మేళగాళ్ళు మేళం వాయిస్తుంటే వెనకే నడుచుకుంటూ పెద్ద పంతులుగారి ఇంటి ముందుదాకా వచ్చారు.

అక్కడికి రాగానే మేళగాళ్ళు మేళం ఆపి పక్కకు వెళ్ళి కూర్చున్నారు.

ఇంటి ముందున్న పెద్ద చింత చెట్టు కిందకు రాగానే కాంతమ్మ నీళ్ళు చల్లి ముగ్గు కర్ర వేసింది. దానిమీద హారతి పళ్ళాలు పెట్టారు.

సుబ్బయ్య చుట్టుపక్కల వెతికి పెద్దరాయి తెచ్చాడు. ఆ రాయి మీద కొబ్బరికాయలు కొట్టించి,



రంగమ్మ చేత దండం పెట్టించారు. వరసగా బాలదాసుళ్ళు, తరువాత మిగిలిన వాళ్ళు అందరూ దణ్ణాలు పెట్టారు. కొబ్బరి చిప్పలు రెండు మేళగాళ్ళకిచ్చి మిగిలినవి కొబ్బరి తీసి బెల్లం కలిపి అందరికీ పెట్టారు.

బెల్లం, పెసరపప్పు కలిపి విడిగా పంతులు గారింట్లో అందరికీ పెట్టి వచ్చింది కాంతమ్మ.

ఒకరు సలిమిడి తలా కాస్త పెడుతుంటే, ఇంకొకరు పానకం గ్లాసు తీసుకుని అందరికీ పోశారు.

దారిన కనపడ్డ వాళ్ళందరికీ ప్రసాదం పంచుకుంటూ ఇంటికి వచ్చి మళ్ళీ రెండో సారి కోటప్పకొండ మూలకు, మూడోసారి ఈశ్వరుడి దేవళం దగ్గరకు ఎదురు నడిచేస రికి ఎండ పెళపెళలాడుతూ కాస్తోంది.

"దీని పెళ్ళికి అన్నీ ఇసిత్రాలే జరుగుతు న్నాయ్యి గదమ్మా! అంతలావున వాన కురి సింది. మళ్ళీ ఇంతలోనే ఎండ కాస్తోంది" ఆదెమ్మ రంగమ్మను చూస్తూ అంది.

"అమ్మాయ్ ఇప్పటికే ఎండబడింది. బంతులు మొదలు పెట్టండి. వాళ్ళు బర్రెగొడ్ల కాడికి పోవాలంట" అంటూ ఈశ్వరమ్మకు చెప్పింది ఆదెమ్మ.

"నాదే ముందే, ఆ పంచల్లో అన్నీ అడ్డాలుం డయ్యి. కొత్త తాటాకుల్తో పందిరేసినా గానీ పందిట్లో కూడా నీళ్ళు పడినయ్యి. కాస్త ఆ పట్టాలను అక్కడ వెయ్యండి, తేమ పీలు స్తయ్యి" ఈశ్వరమ్మ సలహాతో గోతాం పట్టలు పందిరి కింద నీళ్ళున్నచోట వేశారు. అవి కాస్త తేమ పీల్చుకున్నాయి. అయినా అడుగువేస్తే బురద లసాలసామంటూనే ఉంది.

"ఒరేయ్ పేళ్ళు ఎత్తుకురాండ్రా" అంటూ సుబ్బారెడ్డి పిల్లల్ని పంపించడంతో వాళ్ళు వెళ్లి పేళ్ళు తెచ్చి పందిట్లోనే వరసగా వేశారు.

బురదగా ఉండడంతో విస్తరాకులు అతు క్కుని పోతున్నాయి. ఆకుల్లో పోసిన బెల్లపు చారు, క్షీరాన్నం సర్రున జారిపోతున్నాయి. అయినా విస్తరాకులో చుట్టూ అన్నంతో కట్టలు కట్టుకొని మధ్యలో పోయించుకొని జుర్రుకోసాగారు.

రెండు బంతులు లేవటంతో అన్నం దాదా పుగా అయిపోయింది. అది చూసిన వీరమ్మ గాభరా పడిపోయింది.

"యీరప్పా ఎందుకంత గాభరా పడతావు. కూచ్చున్నాళ్ళకి వండింది సరిపోయిద్ది. ఇంక పనోళ్ళకీ, ఇంట్లో వాళ్ళకీ పనులు జేసిన వాళ్ళకి అంతేకదా. పొయ్యిమీద ఎసురు కాగు తూనే ఉండయ్యి. బియ్యం నానేస్తే ఎంత సేపు ఉడుకుతయ్యి" ఈశ్వరమ్మ వీరమ్మకు సర్ది చెప్పసాగింది.

"అది కాదమ్మాయ్ బియ్యం కూడా కొద్ది గానే ఉండయ్యి. మళ్ళీ రేపు చుట్టాలు రావ డాలూ పోవడాలూ ఉంటయ్యి కదా! అప్పుడు కావాల్సొస్తయ్యి. మళ్ళీ అయిపోతే తేవడానికి చేతిలో చిల్లిగవ్వ కూడా లేదు. మా ఇంట్లో వాళ్ళకి నూక బియ్యం వండుకుంటాము గానీ, కొద్దిగా చూసి వాళ్ళిందరికీ ఎన్ని కావాల్సొ స్తయ్యో ఎసట్లో యెయ్యమ్మా" గాభరాగా చెప్పింది.

"అదిగాదు యీరప్పా పండగరోజు గూడా పాత మొగుడేనా అని, ఇయ్యాల గూడ నూక కూడు ఏం దింటావు గానీ బియ్యమేస్తాను. అదే అందరం సర్దుకోవచ్చులే" అని చెప్ప డంతో తలాడిస్తూనే అనుమానంగా వెళ్ళింది వీరమ్మ.

సాయంత్రం అందరూ పెళ్ళి కొడుకు వాళ్ల ఊరు వెళ్లటానికి ముస్తాబవుతున్నారు.

"కానియ్యండమ్మాయ్. బిట్రగుంట నుండి ట్రాక్టర్ కూడా వచ్చింది. తొందరగా తెమ లాల. అవతల వర్షం వచ్చేస్తుంది" అంటూ పెళ్ళి పెద్ద సుబ్బారాయుడు హెచ్చరించాడు.

రంగమ్మకు అడ్డెడు తవ్వెడు వడిగట్టు బియ్యం కొంగున కట్టి ఆ కొంగును చుట్టూ తిప్పి బొడ్లో దోపారు.

"జాగర్తమ్మాయ్ వడిగట్టు బియ్యానికే వంగి పోతున్నావు. ఇంక పెళ్ళి జేసుకుని మొగు డితో కాపరమేం జేస్తావు" ఎగతాళి చేసింది నాగమ్మ. దేవుడికి దణ్ణం పెట్టుకుని దోసిట్లో టెంకాయ పట్టుకుని కుడికాలు ముందు బయట బెట్టి గడపదాటింది రంగమ్మ.

బయట పంచలో కొచ్చి నిలబడింది. మేళం గట్టిగా మోగుతోంది.

బయట నరసయ్య, వీరమ్మ, ఇంకా ఇతర బంధువులు అందరూ నిలబడి ఉన్నారు.

ముందు నరసయ్య కాళ్ళకు వంగి దణ్ణం పెట్టింది రంగమ్మ. పక్కనే నిలబడి ఉన్న వీరమ్మ కళ్ళ వెంట పటపటా నీళ్ళు రాలాయి. "ఊరుకో, యాడవక. ఇంతకాలం సొంత కూతుర్ని సాకినట్టే సాకావు. ఇప్పుడు అత్తగారింటికి పంపుతూ అసురసందేళ ఏడుస్తావెందుకు" అంటూ ఈశ్వరమ్మ ఓదార్చింది.

రంగమ్మ వచ్చి వీరమ్మ కాళ్ళకు కూడా వంగి దణ్ణం పెట్టింది. పమిట కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ రంగమ్మను రెండు చేతుల్తో పైకి లేపింది వీరమ్మ

రంగమ్మ చుట్టాలందరికీ పాదాభివందనం చేసిన తరువాత ట్రాక్టర్ దగ్గరకు నడిపించుకుని వచ్చారు.

స్టూలు మీదుగా ట్రాక్టర్ ట్రాలీ లోపలికి ఎక్కించారు. లోపల కుర్చీవేసి కూర్చోబెట్టారు. తోడి పెళ్ళికూతురు పక్కనే నిలబడింది.

పిల్లా జెల్లా ముసిలీ ముతకా అందరూ ట్రాలీలోకి ఎక్కి సర్దుకుని కూర్చున్నారు.

ట్రాక్టర్‌కి ముందు సన్నాయి మేళం జోరుగా మోగుతోంది. ట్రాక్టర్‌తో పాటు ముందు కొంతమంది వెనక కొంతమంది నడుస్తూ ఉండగా నాలుగు బజార్లలో తిరిగి ఊరేగింపు చేశారు. అక్కణ్ణుండి పొలిమేర దాకా మేళతాళాలతో సాగనంపారు.

పెళ్ళి విడిదికి చేరేసరికి అక్కడ పెళ్ళికొడుకు తరపువాళ్ళు ఎదురు చూస్తూ ఉన్నారు.

అక్కడ దిగినప్పట్నుండి పెళ్ళికూతురు తరపు బంధువులకు పెళ్ళి కొడుకు తరపు వాళ్ళు చేసే గౌరవ మర్యాదలు చూసి పెళ్ళికి వచ్చిన వాళ్ళంతా ఉక్కిరి బిక్కిరి అయ్యారు.

"కూర్చుంటే లేవలేని వాళ్ళయినా పిల్ల కుందనపు బొమ్మని చేసుకుంటున్నారు. గానీ లేకుంటేనా! ఎట్టాంటి కుటుంబ మంటా. ఈ ఊళ్లో నాలుగు పెద్ద కమతాల్లో ఈళ్ళదొకటి" అని చెబుతున్నాడు బయట నిలబడ్డ పెళ్ళి కూతురు తరపు బంధువులకి ఆ ఊరి పెళ్ళి పెద్ద.

పెళ్ళికూతురు తరపు బంధువులకు పెళ్ళి కొడుకు తరపువాళ్ళు చేసే గౌరవ మర్యాదలు చూసి పెళ్ళికి వచ్చిన వాళ్ళంతా ఉక్కిరి బిక్కిరి అయ్యారు

"నలుగురంటగా అన్నదమ్ములు. ఇప్పుడు ఇయ్యమ్మాయిని చేసుకునే పిల్లోడు కాస్తె మెత కంటనే" అక్కడే నిలబడి ఉన్న కొండారెడ్డి అడిగాడు.

"ఏం మెతకలే, నలుగురి మజ్జన ఉండాడు. తలా ఒక చెయ్యేస్తారు. మీ పిల్లకేం దిగుల్లేదులేయ్యా" చెప్పాడు పెద్దాయన.

"రొండో ఆయనకి ఉజ్జోగమంటగా" అడిగాడు మళ్ళీ కొండారెడ్డే. "ఆ మొదటాయనేమో పెత్తందారి. ఎగసాయమంతా ఆయనే దగ్గరుండి చూస్తా చేయిస్తుంటాడు. ఇక రెండో ఆయనేమో టీచరు. మూడో వాడు మంచి సేద్దెగాడు. కొండ్రేసేడంటే వంక జూయించటానికి ఉండనే ఉండదు. అంత చక్కంగా వేస్తాడు. వాడే బండచాకిరీ చేసేది. ఇక కడగొట్టోడు ఇప్పుడు పెళ్ళి కాబోయేవోడు ఈడు పొలాన దప్ప ఇంటికాడ ఉండనే ఉండడు. మంచోడు కుర్రాడు" అంటూ నలుగురు అన్నదమ్ముల వివరాలన్నీ చెప్పాడు పెద్దాయన.

పెళ్లికూతుర్ని విడిది నుండి పెళ్ళి మంటపానికి తీసుకుని వెళ్ళారు.

ఆడపెళ్ళివారు మంటపాన్ని చూసి నోరు తెరిశారు. "ఏందిరా నాయనా మన ఊరంత పందిరేశారు. ఈ ఊళ్ళో ఉండే తాటి చెట్లన్నీ నరికేశారా ఏంటి" అనుకున్నారు.

ఇంటి ముందునుండి బజారు దాకా విశాలమైన స్థలం. ఆ స్థలంలో తాటాకు పందిరి వేసేసరికి అక్కడంతా ఎండిపోయినా కొత్త తాటాకు వాసన పైన గాలితో కలిపి ముక్కు పుటాలకు చేరి ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తోంది.

అక్కడ చేసిన ఏర్పాట్లన్నీ చాలా ఘనంగా ఉన్నాయని పెళ్ళి కూతురు తరపువాళ్ళు వేనోళ్ళ పొగుడుకుంటున్నారు.

'వాళ్ళ మర్యాదలు చూస్తుంటే, నిజంగా రంగమ్మ పడ్డంత కాలం కష్టాలు పడ్డా, తంతే గారెల బుట్టలో పడ్డట్టు పడిందమ్మా! వాళ్ళు వాళ్ళ మర్యాదలూ చూస్తుంటే ఇది అదృష్టవంతురాలే' అనుకున్నారు.

ఒకపక్క పెళ్ళి జరుగుతుంటే ఇంకోపక్క అన్నం వండి రాశి పోస్తున్నారు. ఐదారు గాడి పొయ్యిల మీద వంటలు జోరుగా వండుతున్నారు. కావిళ్ళతో నీళ్ళు తెచ్చి తొట్లలో పోసేవాళ్ళు పోస్తున్నారు. ఊరంతా దాదాపుగా అక్కడే ఉన్నట్టుంది.

బిట్రగుంట పూజారి గంట నుంచి మంత్రాలు చదువుతూనే ఉన్నాడు.

"ఏందిరా, బేమ్మడు ఒకపూట నుండి మంత్రాలు చదువుతూనే ఉన్నాడు" అన్నారు ముందు వరసలో కూర్చున్న ఒకరు.

"బేమ్మడు మంచి బేమ్మడే. పెళ్ళి బ్రహ్మాండంగా చేస్తాడు. ఒక్క మంత్రం కూడా ఒదిలి పెట్టకుండా చదువుతాడు" అన్నారు ఇంకొకరు "ఆ సింగినాదం జీలకర్ర" అన్నారు పక్కనున్న ఇంకొకరు.

తలంబ్రాలు పడేసరికి బాగా పొద్దుబోయింది. చదివింపులు అయిన తరువాత అన్నాలు తింటానికి పోదాంలే అనుకున్నోళ్ళకి కడుపులో పేగులు నకనకలాడి పోయి నియ్యి. బంతులు మీద పడ్డవాళ్ళు ఆవురావురుమంటూ రకరకాల పిండి వంటలు, రుచికరమైన కూరలతో భోజనం కానిచ్చి పెళ్ళి భోజనమంటే ఇట్టా ఉండాలిరా అనుకుంటూ లేచారు.



ఆకాశం ఎక్కడా మబ్బు తునక జాడ లేకుండా నిర్మలంగా ప్రశాంతంగా ఉంది. భూమ్మీద ఎత్తు గాలికి లేసిన దుమ్ము అంతెత్తుకు ఎగిసి పడుతూ ఏ వస్తువుల్నీ పెట్టిన చోట ఉంచటం లేదు. కాలానికి కత్తెర వేస్తున్నట్లు గాలి ఈడ్చి కొడుతోంది.

ఎండలు మండిపోతున్నాయి. చుక్కనీరు దొరకడం చాలా కష్టంగా ఉంది. బావులన్నీ ఎండిపోయాయి. బోరింగులన్నీ ఆడుగంటిపోయాయి. పంపుల్లో ఐదురోజుల కొకసారి వచ్చే నీళ్ళని చాలా జాగ్రత్తగా ఉపయోగించుకోవాల్సి వస్తోంది.

ఉదయం కూడా మధ్యాహ్నపు ఎండను మించిన ఎండ వేడి పొగలు సెగలు కక్కుతోంది.

కుండ నిండా మజ్జిగ చేసి, నిమ్మకాయ, ఉప్పు కలిపి, కుండకు తెల్లని గుడ్డ చుట్టి అప్పుడప్పుడు తడుపుతోంది రంగమ్మ.

ఉదయాన్నే టిఫిన్ తిన్నవాళ్లు కూడా ఎన్ని నీళ్లు తాగినా దాహం తీరడం లేదని ఒకటో రెండో గ్లాసులు మజ్జిగ తాగి కడుపు చల్లబరుచుకుంటున్నారు.

"పొద్దున్నే ఆ మజ్జిగ తాగకపోతే, అటుబోయి ఒక జగ్గు కల్లు యేసుకోని పోగూడదా!" అన్నాడు మంగయ్య. మజ్జిగ తాగుతున్న ఒక పెద్దాయన నుద్దేశించి.

పెద్దాయన అతనివైపు అయోమయంగా పోయినంత దూరం చూస్తూనే పోయాడు.

"ఒరే యెదవా, తాగుబోతు సచ్చినోడా! నువ్వు తాగేది గాక వచ్చినోళ్లందరినీ తాగుబోతు కొంపకి పొమ్మని చెబుతున్నావు. అది

నీకేమన్నా కమీషనిస్తుందా! లేకపోతే నిన్నే మన్నా మరగేసుకుందా!" అంటూ చేతిలో గంటె తీసుకోని ఒక్కటెయ్యబోయింది రంగమ్మ.

"అమ్మో! నీతోడు కాదమ్మో! పొరపాటున నోరు జారాను. నీతో ఎందుకుగానీ, ఇంక ఒక దోసె యెయ్యి తినేసి పోతాను. నీతో ఒక మాటెక్కువ, రెండు మాటలు తక్కువ" అంటూ ప్లేటు ముందుకి సాచాడు మంగయ్య.

"ఒరే ఇంకా మాట్లాడతన్నావు. నీ జన్మకి సిగ్గులేదురా. మిల్లులో రోజూ అంతంత సంపాయిస్తావు గదా! డబ్బు అడిగితే రేపిత్తా ఎల్లుండిత్తా అంటూ నా కొట్టు మీదపడి తెగ తినేది కాకుండా వచ్చినోళ్లని కల్లుకొట్టుకి పొమ్మని సలహాలిస్తుండావు. ఇంకోసారి అట్టాంటి మాటలన్నావంటే చీపురుకట్ట తిర గేస్తా నా సంగతి తెలవదు గామాల" అంటూ నాలుగు పెట్టింది.

"ఇదుగో రంగమ్మత్తా నా సంగతి నీకు తెల వదంటే. అన్నీ తెలిసి కూడా ఎందుకు డబ్బు లియ్యలేదని గుర్తు చేస్తావు" దీనంగా అడి గాడు.

"పాపం డబ్బంతా నీ పెళ్లాం రోగానికి పెడ తన్నావని తెలుసు కాబట్టే డబ్బులడక్కుండా నీకు రోజూ టిఫిన్ పెడుతున్నా" అంతలోనే జాలిగా అంది మంగయ్యతో.

ఉన్నట్టుండి ఎక్కడ నుండి వచ్చాడో ఒక తాగుబోతు హఠాత్తుగా తూలుకుంటూ వచ్చి టేబుల్ మీద పడ్డాడు. టేబుల్ ఒరిగిపోయి టేబుల్ పైన ఉన్న టీ జగ్గు కిందపడి భళ్లున పగిలిపోయింది. ఇడ్లీల గిన్నె ఎగిరి కిందప డింది. ఇడ్లీలన్నీ మట్టిపాలయ్యాయి. బెంచీ మీద ఉన్న ఖాళీ కూల్ డ్రింక్ సీసాలు కూడా కిందపడి పగిలిపోయాయి.

క్షణంలో కోతులు చిందరవందర చేసిన ఇల్లులాగా మారిపోయిన ఆ దృశ్యం చూసి రంగమ్మ గుండె ఝల్లుమంది. కోపం నషాళా నికి అంటింది.

"ఎవడ్రా నువ్వు దొంగ సన్నాసి. నోటికాడ సొమ్ము నేలపాలు చేశావు గదరా! సచ్చీచెడీ తినీ తినకా అప్పులోళ్లకి కట్టుకుంటూ ఎట్నో కట్ట పొట్ట పోసుకుంటున్నాం. ఇయ్యాల మా నోటికాడ కూడు దియ్యటానికి వచ్చావు ఎక్క డోడివిరా నువ్వు" అంటూ చీపురు తీసుకుని నాలుగు విదిలించింది.

కల్లు కొట్టువైపు చూస్తూ "యాడేడ గుంపంతా ఈ గుడిసేటిదాని దగ్గరకొచ్చేదీ; మా నోట్లో మట్టికొట్టేది" అనడంతో కొండ మ్మకు ఆ మాటలు వినపడ్డాయి.

"ఏమేయ్ నీకు బలిసింది కదే! మొగమడిసి అని కూడా చూడకుండా చీపురు తీసుకొని కొడతంటే చూస్తా ఊరుకున్నాను. నన్ను బట్టుకుని గుడిసేటిదానా అంటావా" అంటూ తగాదాకు వచ్చింది కొండమ్మ.

"ఏందే అంత రోషముండదానివైతే నా కొట్టుమీదకి రాకుండానే చూసుకోవాలి. నీకు అంత కావాల్సినోళ్లయితే నీ గుడిసెలో పండ బెట్టుకో. నా కొట్టుమీదకి పంపావేందే! నీ చేతులకి జెట్టల్లేవ" అంటూ రెండు చేతులూ ముందుకి బారజాపుతూ శాపనార్థాలు పెట్టింది రంగమ్మ.

"ఏయ్ మాటలు జాగర్తగా రానియ్యి" అంటూ వేలు చూపించింది కొండమ్మ.

"పెద్ద లార్డువైతివీ, నిన్నుజూసి తెగ భయ పడి పోవాల." అంటూ చెంగు వెనుకకు తిప్పి బొడ్లో దోపి రెండడుగులు ముందుకేసింది కొండమ్మ.

"ఏందే నిన్ను జూసి అంత లావున భయ పడేది" అంటూ ముందుకొచ్చింది రంగమ్మ కూడా.

"ఏమే అంత కొవ్వు పట్టిందా! మీద మీద కొస్తుండావు" అంటూ కొండమ్మ గుడ్లెర్రజే సింది.

"నువ్వు ఉరిమి చూసినా ఈడెవడూ భయ పడేవోడు లేడు. కాస్త తగ్గు" అంటూ రంగమ్మ ఇంకా దగ్గరగా వచ్చింది. అంతే! కొండమ్మ జుట్టు పట్టుకొని ఒక్కసారిగా ముందుకి గుంజింది.

"చంపేశావు గదే ముండా!" అంటూ

కొండమ్మ జుట్టు దొరకపుచ్చుకుంది రంగమ్మ. ఇద్దరూ కాసేపు అలాగే జుట్లు పట్టుకొని పెనుగులాడారు. ఒకరినొకరు రక్కుకున్నారు. ఇద్దరూ సమ ఉజ్జీలుగా ఉన్నారు.

దాంతో కొండమ్మకి వళ్లు మండిపోయింది. రంగమ్మ కాలుకేసి తన కాలుని మెలేసి ఒక్క లాగు లాగింది.

పట్టు తప్పి కొండమ్మ కిందపడిపోయింది. పడటం నాపరాయి అంచుమీద పడటంతో కాలు పుటుక్కుమని శబ్దం వచ్చింది. కింద పడ్డ రంగమ్మ పైకి లేవలేకపోయింది.

పక్కన ఉన్నవాళ్లు వచ్చి చెయ్యి ఆసరా ఇవ్వడంతో పైకి లేసి కుంటుకుంటూ నడిచింది. కాలు కిందపెడితే ప్రాణం పోతోంది.

నా ఉసురు తగిలి ఎప్పుడు కాటికి పోయిద్దో ముండ. ఈ కాలేదో మూలం చేసేటట్టే ఉంది. అనుకుంటూ బయట వాల్చిన మంచమ్మీద పడుకుంది.

కాలు తాకితే ప్రాణం పోతోంది. సాయంత్రానికి కాలు బాగా వాచిపోయింది.

చింతచెట్ల మీద పక్షులన్నీ గూళ్లకు చేరే సందడిలో అరుస్తున్నాయి. రోడ్డుమీద వాహనాలు రొదచేసుకుంటూ సాగుతూనే ఉన్నాయి. కొండమ్మ కల్లు అంగడిలో కల్లు అమ్మకం సాగుతూనే ఉంది. రంగమ్మ కొట్టే మూతబడిపోయి చీకటి ఆవరించింది.

నా బతుకులో నిప్పులు బోసి ఏమీ ఎరగనట్టే ఎంత నంగనాచిలా ఉందో చూడు అనుకుంది రంగమ్మ కొండమ్మను చూస్తూ.

అసలు ఆ రౌడీ ముండ జోలికి పోవడమే తప్పయిపోయిందిలే. కూర్చుంటే లేవలేని దాన్ని. దాని నోటికి భయపడి గమ్మున ఊకుంటే ఇంకా మీదమీదకొస్తుందని ముందుకెళితే ఈ గతిచేసి పెట్టిందని, అనుకుంటూ ఉండగా చిన్నమ్మాయి షాపు నుంచి వచ్చింది.

రంగమ్మను చూసి "ఏంటమ్మా పడుకున్నావు" అంటూ హ్యాండ్ బ్యాగ్ తీసి, ఇంట్లో వంకెకు తగిలించి మంచం దగ్గరకు వచ్చింది సుజాత.

"ఆ మాయదారి ముండ పున్నెం కట్టుకుందమ్మా" అంటూ కల్లుకొట్టు వైపు చూపిస్తూ మెల్లగా అంది. రంగమ్మ

మంచమ్మీద రంగమ్మ పక్కనే కూర్చుంటూ, "కాలు ఇంత లావున వాసిపోయింది. లోపల ఎముకేమన్నా విరిగిందేమో!" అనుమానంగా అంది సుజాత.

"ఏమోనమ్మా, ఆ మాయదారిది నా పేణం తీసింది. కాలు కదిపితేనే పేణం పోతోంది" అంటూ కాలు కదపటానికి ప్రయత్నించింది. కానీ కాలు పైకి లేవలేదు. గాభరాగా "అమ్మాయ్ కాలు కదలడం లేదు. కాస్త ఆ ప్రసాదు డాక్టర్నన్నా పిల్చిరామ్మా" అని చెప్పడంతో సుజాత డాక్టర్ని పిలుచుకొచ్చింది.

డాక్టర్ వచ్చి కాలు పరిశీలించి, "లాభం లేదమ్మా, ఎముక విరిగి ఉంటుంది. లేకపోతే కాలు ఇంతలావున వాయదు" అనడంతో, "వామ్మో ఎనిక ఇరిగితే నేనేం జెయ్యాలో దేవుడో" అంటూ ఏడుపు మొదలెట్టింది రంగమ్మ.

"ఎందుకమ్మా ఏడుస్తావు? ఏడిస్తే వచ్చింది పోయిద్దా! పోయి తొందరగా హాస్పటల్లో చూయించుకోవాలగానీ, ఏందమ్మాయ్ మీ అక్క రాలేదా" అడిగాడు ప్రసాద్.

"అదిప్పుడే రాదు. పోయి ఫోనన్నా చేసొస్తా"అంటూ వెళ్ళి ఫోన్ చేసి వచ్చింది సుజాత.

"అమ్మా ఇంట్లో డబ్బులున్నాయ్యా" అడిగింది.

"యాడుండయ్యమ్మా పొద్దున వచ్చిని య్యన్నీ కట్టాల్సినోళ్ళకి కట్టేశా! ఇంక రొండొందలో ఎంతో ఉండాల. అక్కాయి రానియ్యి చూద్దాం. నువ్వు ఇంట్లోకి పోయి, ఆ కర్రల సంచీలో గుడ్డలు సర్దమ్మా" అనడంతో ఇంట్లోకి వెళ్లింది సుజాత.

సుబ్బులమ్మ మెల్లంగా కర్ర ఆసరాతో లేచి అడుగులో అడుగేసుకుంటా రంగమ్మ దగ్గరకు వచ్చింది.

"యేందే మనకి వక్కోటి చుట్టుకుంటుదయ్యా. అయినా ఆ ముదనష్టపు ముండ

జోలికెందుకు యెల్లేవే!" అంటూ వచ్చి మంచ మీ్మద కూర్చుని "మీ అక్కాయేదమ్మా ఇంకా రాలేదు" అడిగింది సుజాతను చూస్తూ.

సుజాత ఆమెవైపు తిరిగి చూసి మౌనంగా బట్టల సంచీ బయటికి తెచ్చింది. సుధారాణి వచ్చీ రావడంతోనే ఆటోని పిలిపించింది. "డబ్బులమ్మాయ్" అనడంతో, "మ్మా కంపెనిలో అడ్వాన్స్ తెస్తాలే" అంటూ ఆటోలో ఎక్కించి తను పక్కన కూర్చుంది. సుజాత డ్రైవర్ పక్కన కూర్చుంది.

కాలుకి పిండికట్టు కట్టి వారం రోజులు హాస్పిటల్లోనే ఉండాలన్నాడు డాక్టర్. ఆ వారం రోజులూ దిగులు మంచమ్మీదనే పడుకుంది రంగమ్మ.

ఆస్పత్రిలో ఉందన్న మాటేగానీ, ప్రాణమంతా కొట్టుమీదే ఉండిపోయింది. ఇయ్యాల్సిన అప్పులూ, కొట్టు మీద పోయిన రాబడీ తల్చుకుని తల్చుకుని బాధపడింది. ఇద్దరు కూతుళ్లూ చెరి రొండ్రోజులూ సెలవు పెట్టి తల్లి దగ్గరుండి చూసుకున్నారు. తరువాత రోజు నుంచి ఉదయం సాయంత్రం వచ్చి అన్నం పెట్టి మందులు మింగించి వెళ్లింది సుధారాణి.

వారం రోజుల వనవాసం ముగించుకుని రంగమ్మ ఇంటికొచ్చింది.

అప్పటికే దిగులు పడిపోయి ఆ రోజు నుంచీ కొట్టు పెట్టాలని గోల చేస్తే "ఇంక నెల రోజులు ఏ పనీ చెయ్యొద్దన్నాడు కదమ్మా డాక్టర్" అంటూ వారించబోయింది సుధారాణి.

"ఇప్పటికే వారం రోజులు పోయిందమ్మా ఇంకా ఉంటే ఎట్ట చెప్పు. ఈ సంకల కింద కర్రలు కూడా తెచ్చుకున్నాం కదా! పడుకుంటే ఎట్ట జరుగుద్ది మనకి" అంటూ ఆ రోజే పని ప్రారంభించింది.

* * *

"ఏంది రంగమ్మ ఈ కాలికి కట్టేందీ! ఈ కర్రలేందీ! ఏమైందత్తా ఎట్టుండే దానివి ఎంత చిక్కిపోయావో" అంటూ వచ్చాడు ఆంజనేయులు చేతిలో బ్యాగ్ సవరించుకుంటూ.

"ఏందో శాన్నాళ్ళకి వచ్చావే. అత్త బాగోగులు చూసే అల్లుడివి" టీ డికాషన్ ఫిల్టర్‌లో పోస్తూ అంది రంగమ్మ.

"యాడ తీరతం దత్తా! ఎప్పుడూ తిరుగుడే తిరుగుడు కదా!" అంటూ కుర్చీమీద కూర్చున్నాడు ఆంజనేయులు.

"లాభం లేని యాపారస్తుడు ఎల్లవగ్గూడా పోడని సామెత. నువ్వేమన్నా ఊరక తిరుగుతావంట్రా! ఆదాయం లేకుండానే ఉత్తిగా తిరుగుతారా!"

"కోతికి పుండయితే గోకా, నాకా! అని నాకు తగిల్తేనే గానీ కొంతమంది కళ్ళు సల్లబళ్ళేదు ఏం జేస్తాం" అంటూ కల్లుకొట్టు వైపు చూసింది రంగమ్మ

"అదంతా సరేగానీ, ఇంతకీ కాలికేమైందో చెప్పనే లేదే!" మళ్ళీ కాలు సంగతి గుర్తు చేశాడు.

"కోతికి పుండయితే గోకా, నాకా! అని నాకు తగిల్తేనే గానీ కొంతమంది కళ్ళు సల్లబళ్ళేదు ఏం జేస్తాం" అంటూ కల్లుకొట్టు వైపు చూసింది రంగమ్మ.

అర్థమైనట్టుగా "ఏందత్తా? ఇద్దరూ తన్నుకున్నారా ఏంది? " అన్నాడు.

"ఇద్దరు తన్నుకునేది యాడంట! ఒంటిచేతి చప్పట్లే. దాన్ని ఢీకొని యాగలేమనేది అర్థమైపోయింది. ఇల్లు దాటిన ఆడది లోకానికి లోకువైనట్లు, కాలికింద కొస్తే కాల్తో తంతన్నారు. చేతికింద కొస్తే చేత్తో తంతన్నారు. ముదనష్టపు ముండ కాలు ఇరగొట్టింది" అంటూ మెటికలు విరిచింది.

"ప్చ్! ఆయ్యో పాపం పెద్ద ఘోరమే జరిగిపోయిందే! ఎన్ని రోజులైందేంది పాపం" అన్నాడు దీనంగా మొఖం బెట్టి.

"నువ్వన్నా ఒకల్లుడువి పుట్టకొచ్చావులే పాపం అంటానికి. ఏంది! టిఫిన్ తింటావా? " అడిగింది.

"ఆ పెట్టత్తా బాగ ఆకలవుతోంది. ముందు నాలుగు ఇడ్లీలియ్యి. ఆ తరవాత దోసెలు తింటాగానీ!" అనడంతో వెంటనే ప్లేటు చేతికిచ్చింది. తరువాత దోసెలు కూడా తిని, "కాసింత మజ్జిగియ్యత్తా! నీ దగ్గిరకొస్తే మంచి మజ్జిగ దొరుకుతుంది." అంటూ రెండు గ్లాసులు మజ్జిగ తాగి బ్రేవ్‌మని తేన్చాడు.

"ఇంతకీ అప్పుల గొడవలు యెట్టుండయ్యత్తా! ఏమన్నా కొస్తెన్నావాలుకి వచ్చినయ్యా" మూతి చేతిగుడ్డతో తుడుచుకుంటూ అడిగాడు.

"వల్లకాట్లోకి పోయిన్నాడే ఇయ్యి గూడా నాతోపాటు పోయేది. ఎన్ని రకాలుగా యేదిస్తన్నారో ఏంది చెప్పేది. అటయ్యి ఇటూ, ఇటియ్యి అటూ తిప్పలేక సర్దలేక సస్తన్నాను. ఈ ఫైనాన్సుల్లో ఏలు పెట్టే కంటే యాడన్నా దూకి చావడం మేలు గదా! పైగా ఈ కాల్తోటి ఈ పది రోజులూ ఆ ఎదురు వగలాడి బాగ పోసుకుని ఉంటుంది"

"చెప్పటం మర్చిపోయా. ఆ శ్రీనువాస హోలుకాడ ఎరికలోడొకడు సచ్చిపోయేడు. ఆడా ఈడా ఫైనాన్సుల్లో అప్పులు తీసుకున్నాడంట. వాటితో తాగడం. తందనాలాడ్డం. ఇళ్ళ చుట్టూ బళ్ళేసుకోని తిరుగుతుంటే పారిపోయాడంట. ఇద్దరు ముగ్గురు ఫైనాన్సోళ్ళు వెతికి వెంటాడి మీదబడి సావ చితక్కొట్టేరంట. తెల్లారేసరికి డబ్బులు తెచ్చి కట్టకపోయావంటే సంపేస్తామన్నారంట. దాంతో వాడి బతుకు తెల్లారిపోయింది. దాంతో వాళ్ళ మీద కేసులు పెట్టారంట. పాపం డబ్బులిచ్చి తన్నిచ్చుకోవడమంటే ఇదే కదా!" ఆంజనేయులు జాలి ధ్వనించే స్వరంతో అన్నాడు.



"తగిన శాస్తే జరిగింది లేరా! ప్రతి యెదవా మరీ కూర్చుంటే లేవలేనోడు కూడా ఫైనాన్సీ ఫైనాన్సీ అని అదొకటి మొదలెట్టారు. పెట్టేది పదేలు. చేతులకి వాచీలు, ఉంగరాలు, బళ్ళు, రేత్రయితే మందూ, ఒకరకంగా ఊరేగారా. మొత్తం మీద ఒక్క ఒంగోల్లోనే ఐదొందలు ఫైనాన్సులు పెట్టారంటే ఎంతమంది కొంపలు కూల్చారో! అయ్యేం వడ్డీలురా బాబూ! ఐదులూ, పదులూ. ఆ! నెల తిరిగేతలికి కట్టకపోతే డబలు, ఆ నెలా కట్టకపోతే దానికి డబలు. కట్టటానికా ఇంకేమన్నానా. మొన్నయితే అబ్బాయ్, అర్ధరాత్రి రొండు గంటలప్పుడు వచ్చారు. ఎప్పుడొచ్చినా దొరకడం లేదంట వాడు. అబ్బా నిదరబోయే వాణ్ణే ఇంట్లో నుండి బరబరా ఈడ్చుకోని వచ్చారు. ఆరుబయట పడుకోని ఉండాం. అబ్బా ఇంకవాణ్ణి కొట్టారు చూడూ! నలుగురు మణుసులు పట్టుకోని ఒక్కణ్ణి కొడతంటే వాడి పెళ్ళామొచ్చి అడ్డం బడింది. ఆ ఆడకూతుర్ని లాగి అవతల పారేసి ఎన్ని కూతలు కూసేరనీ, అవి ఆడోళ్ళని అనే మాటలేనా! అబ్బో అబ్బో మరీ ఎంత ఛండాలమైపోయారో" అంది రంగమ్మ.

"ఇంకే ఎరికలోడి దెబ్బకి అన్నీ బందవతయ్యిలే! పోలీసులు పేపర్లో వేశారుగా. ఎవురైనా ఫైనాన్సోళ్ళు గోల జేస్తుంటే వాళ్ళు బోయి పోలీసులకి రిపోర్టు జేస్తే తీసకెల్లి లోపల నూకుతారంట్లే. ఈటి వల్ల ఎంతో మంది నాశనమై పోయారంట"

"ఈ ఫైనాన్సోళ్లు ఎవర్ని ప్రశాంతంగా బతకనిచ్చారులే. ఒకణ్ణి జూసి ఒకడు. అబ్బబ్బో ఎవర్నీ ప్రశాంతంగా ఉండనియ్యలేరులే. ఆరిపోయే దీపానికి ఎలుగెక్కువని ఏం ఎలిగేరు. ఏం ఎలిగేరూ" రంగమ్మ ఫైనాన్సు వాళ్ల మీద ఉన్న కసినంతా మాటల్లో చూపించింది.

"మనఊరు రమిణి అట్నే గదంటా ఒంగోలొచ్చింది. కమ్మంగా ఊళ్ళో ఇల్లూ, బోలెడంత పొలమూ ఉంది. అయినా ఒంగోలొచ్చిన ఊరి వాళ్ళని జూసి, వాళ్ళలాగా సంపాయించాలని ఈమె కూడా ఊపుకుంటూ వచ్చింది. ముందు మొగుడు నేను రాను నువ్వెల్లమన్నాడు. మొగుణ్ణి వదిలేసి వచ్చింది. జయమ్మ దగ్గర జేరింది. ఆ యెమ్మి చాలా సంవత్సరాల క్రితమే ఎవుడితోనో వచ్చేసి, ఇల్లూ గిల్లూ బాగ కట్టిందిలే. అది జూసేగదా ఈయమ్మి కూడా ఆశపడింది. మొదట గాంధీనగర్లో యాణ్ణో చిన్నపూరిల్లు అద్దెకి తీసుకుంది. బర్రెల్ని పెట్టుకుంది. ఆ పాలమీద వచ్చే డబ్బుల్తో చెక్రం తిప్పాలని చూసింది. వాటితోనే చీట్లేసింది. వడ్డీలకి తెచ్చింది. ఎక్కువ వడ్డీలకిచ్చింది. ఇల్లు కొనింది. ఇంకా ఏదో యాపారాలు కూడా మొదులుబెట్టి గోల గోలగా తయారయింది. ఈమె ఇక్కడేదో సంపాయిస్తుందని, మొగుడు పిల్లలు అందరూ ఎగబడి వచ్చేశారు. అక్కణ్ణుండి మొదలయ్యింది. ఇంటి చుట్టూ తిరిగే అప్పులోళ్లతో నిత్యం రభసే. ఇంక ఆ యెమ్మి మొకం తప్పించడం మొదులయ్యింది. దీంతో మొగుడికి సారాయి అలవాటయింది. ఇంటికి రావడం మానేశాడు. యాణ్ణో తాగి తందనాలాడ్డం మొదలైంది. అటూ ఇటూ కాకుండా పోయింది. ఈ మజ్జెలో ఊళ్ళో పొలం గూడా అమ్మిందన్నారు" ఆంజనేయులు సొంత ఊరి కథ చెప్పాడు.

"ఇట్టాంటి కథలు ఎన్ని చెప్పుకున్నా తరగవులే! ఇవి ఎందుకొచ్చినయ్యోగానీ మనలాంటోళ్ళని ఎంతమందిని నాశనం జేసినయ్యో. ఇప్పటికైనా ఇంతటితోటి పోతే బాగుణ్ణు. అంతకుముందు నాలాగా ఏదోక పనిజేసుకొని బతికారు. ఈటిని జూసి ఆ పనులన్నీ మానుకున్నారు. ఇప్పుడు ఇంటి కూటికీ బంతి కూటికీ రెంటికీ చెడిపోయారు" రంగమ్మ నిట్టూర్చింది.

"ఈ ఊరికి అంతా వేలం వెర్రేనమ్మా" అప్పుడే వచ్చి ఆ మాటలు విన్న సుబ్బయ్య అన్నాడు.

"ఏం సుబ్బయ్యన్నా బాగుండావా! ఎట్టుంది నీ యాపారం" పలకరించాడు ఆంజనేయులు.

"ఏం యాపారాలయ్యా నేను గూడా నాకు తెలిసినోడికి ఒకడికి షూరిటీ పెట్టాను. వాడేమో ఎటో ఉడాయించాడు. ఇప్పుడు నా నెత్తికొచ్చిపడింది. యాడ తెచ్చి కట్టాలనో పాలుబోవటం లేదు. అయినా దీనెమ్మ ఏమి యాలమెగ్రి జనాలకి, ఒక గొర్రె దూకిందంటే అన్ని గొర్రెలూ దూకడమే. మరీ గొర్రెదాట యిపోయింది" బాధపడుతూ చెప్పాడు టిఫిన్ తింటున్న ఒక పెద్దాయన.

"ఇదే కాదు; స్కూల్లూ, కాలేజీలు జూడు కోళ్ళఫారాలు పెట్టినట్టు పెట్టారు. స్థలాల రేట్లు ఎన్నిరెట్లు పెంచారో చూడు. సరేగానీ, ఇంతకీ నీ యాపారాలు ఎట్టుండయ్యి. దేశ మ్మీద పడి తిరగడమే కదా నువ్వు!" ఆంజనే యుల్ని అడిగాడు ఆ పెద్దాయన.

"ఇప్పుడు కొత్త స్కీమొకటి వచ్చింది" రంగమ్మ వైపు చూస్తూ బేగ్‌లో నుండి కాగి తాలు బయటికి తియ్యబోయాడు ఆంజనే యులు ఆ పెద్దాయన మాటలు విననట్లుగా.

"అయ్యయ్యా, స్కీములొద్దూ ఏమొద్దూ నాయనా. అయ్యి జూస్తంటేనే జరం కాస్తంది. యాడ తెచ్చి కట్టాల. డబ్బులేమన్నా చెట్లకి కాస్తన్నయ్యా" అంటూ వారించింది రంగమ్మ.

"అది కాదు. నువ్వు కట్టొద్దూ! ఏమొద్దూ ముందు చెబుతా ఇను. సుబ్బయ్య మామ కూడా ఉండాడుగా. ఇదుగో మామా" అన డంతో "నా కొద్దులేయ్యా ఇప్పటికే తలబొప్పి కట్టింది"అంటూ పక్కకు తిరిగాడు సుబ్బయ్య.

"ఏహే మీరు కట్టొద్దంటంటే ఇనిపిచ్చుకో రేంది. ఇది ఒకసారి కట్టి వదిలేస్తే చాలు. మల్లీమల్లీ కట్టబనిలేదు" అన్నాడు.

"ఒరే ఆంజనేయులా, నీలాంటోళ్ళందరూ మా మీద బెమ గిలిగి మమ్మల్ని ఉద్ధరిచ్చడా నికి ఇట్టాంటి స్కీములు దీసుకుంటార్రా. ఎట్టోకట్ట ఏదో ఒకటి మాయమాటలు చెప్పి మాకు గుండుగొరగడానికేగా! ఎప్పుడూ ఏదో ఒకటి ఇన్స్యూరెన్సులనో, స్కీములనో, పీర్‌లెస్ లనో, గోల్డెన్ గేట్లనో మట్టీ మశాణమనీ మా చేత కట్టిస్తారు. అదేమంటే సస్తే అంతొ స్తయ్యా, పోతే ఇంతొస్తయ్యనీ చెబుతారు. ఇక్కడ బతకడానికే సస్తుంటే, సచ్చిన తరు వాత ఎవుడికి కావాలా ఇయ్యాన్నీ. అనవ సరం మాలాంటోళ్ళకి" రంగమ్మ గట్టిగా చెప్పింది.

"దీనికి ఇన్స్యూరెన్స్ కూడా ఉంది. పైగా గవర్మెంటుది కూడా. ఇది కట్టకపోతే ఒక పని చెయ్యండి. గోల్డ్‌స్కీమని ఒకటుంది. అదయినా చెయ్యండి. నెలనెలా కట్టుకో వొచ్చు వారం వారం కట్టుకోవొచ్చు లేదంటే ఒకసారే డిపాజిట్ కూడా చేసుకోవొచ్చు లోన్ కూడా ఇస్తారు"

"అబ్బకు లేక ఆకులు మేస్తుంటే కొడుకొచ్చి కోడి పలావు తెమ్మన్నాడంట. అట్టుందిరా నువ్వు జెప్పేది. ఇప్పటికే కొంప కొల్లేరయి ఏడుస్తుంటే అది గట్టు ఇది గట్టు అని మమ్మ ల్ని పీక్కు తినబాక. యాడేడ దరిద్రాలన్నీ మా వెంటబడే ఒస్తన్నయ్యి. ఈ సారికి మమ్మల్నొదిలెయ్యి" అంటూ బతిమలాడసా గింది రంగమ్మ.

"ఇదుగో రంగమ్మత్తా, నీకు డబ్బులొచ్చే మార్గమొకటి చెబుతా గానీ, నేను చెప్పింది మాత్రం నువ్వు చెయ్యాల" అన్నాడు.

"ఎక్కడా డబ్బులొచ్చేది. ఒళ్ళిరగదీసుకుం టేనే రూపాయి సంపాయించడం కష్టంగా ఉంది. చెమట చుక్క నేల రాలకుండా డబ్బి లెట్టొస్తయ్యిరా" నిరాశ ధ్వనించింది ఆమె మాటల్లో.

"అహా, ఒస్తే చేస్తావా!" మళ్ళీ ఊరించాడు.

"ఎక్కడొస్తయ్యిరా" కాస్త ఆశ మినుకు మినుకుమంటుండగా అడిగింది.

"అప్పుడు పీర్‌లెస్ కట్టి ఒదిలేసేవు చూడు. వాటికి టైము దగ్గరకొచ్చింది. నువ్వు గానీ మళ్ళీ ఇప్పుడొక పాలసీ జేస్తే ఇప్పటికిప్పుడే అంటే ప్రతినెలా మొదటి బుధవారం ఒంగోలొచ్చే చెక్కిస్తారు. చెప్పు ఇప్పుడు చెప్పు, చేస్తావా! లేదా ఆ డబ్బులొ చ్చేదాకా ఆగతావా. ఇప్పుడు వెయ్యి కట్టే వంటే అయ్యి నాలుగు వేలు వొస్తయ్యి. ఇంకా మూడు వేలు నీకే మిగుల్తయ్యి గదా! ఈ పాలసీ ప్రతి సంవత్సరం కట్టుకోవొచ్చు

ఏమంటావు. ఎప్పుడేనా నేను చెప్పినట్టు చేస్తే నీకే లాభం చూయిస్తా. ఇదుగో రా, ఈ కాయితమ్మీద సంతకం బెట్టు"అంటూ పెన్ను చేతి కిచ్చాడు.

"మొత్తమ్మీద ఒచ్చినప్పుడల్లా ఏవో మాయ మాటలు చెప్పి మాచేత ఏదో ఒకటి రాయిచ్చుకుని పోతావుగదరా" అంటూ కళ్ళల్లో రాబోయే నాలుగువేలు తాలూకు ఆశ మినుకు మినుకు మంటుండగా సంతకం పెట్టింది రంగమ్మ.

"ఏం సుబ్బయ్య మామా మీయి కూడా అట్టాంటి బాండ్లేమన్నా ఉంటే చూడు. మీకు గూడా డబ్బు లిప్పిస్తా" అన్నాడు ఆంజనేయులు.

"నాకు లేవుగానీ మా అమ్మయోళ్ళయ్యి ఉండాల. అడిగి కనుక్కుంటాలే" అనడంతో, "పోదామంటే ఇప్పుడే పోదాం పా. బండిమీద ఎక్కిచ్చుకోని తీసుకోనిపోతా" అంజనేయులు హుషారుగా గాలం వెయ్యబోయాడు.

"మా అమ్మాయి లేదులే. ఊరికి బోయింది. నేను కనుక్కుంటాలే" అన్నాడు సుబ్బయ్య.

"ఇంకా ఎవురియ్యన్నా ఉంటే చెప్పు అత్తా ఇంకా వారం ఆగి వొస్తాగనీ డబ్బులు జూసి పెట్టు" అనడంతో ఇప్పుడు నా దగ్గరేడుం డయ్యి. నువ్వేసి కట్టు. ఒచ్చిన తరవాత తీసుకుందువుగానీ" రంగమ్మ చెప్పింది.

"ఆ పప్పులేం ఉడకవు. ఆ వెయ్యి కడితేనే! నాలుగు వేలు. నేనెక్కడ తెచ్చి కట్టేది" అంటూ బేగ్ తీసుకుని బండికి పక్కగా తగిలించుకుంటున్నాడు.

"ఇదుగో ఆంజనేయులూ, టిఫిన్‌కి డబ్బులియ్యాలా" రంగమ్మ కేకేసింది.

"అత్తా నీకు ఉట్టిపున్నేనికి నాలుగు వేలు ఒచ్చే మార్గం జెబితే, ఇంకా టిఫిన్‌కి కూడా డబ్బులు అడుగుతున్నావా" అంటూ జేబులోకి చూసుకున్నాడు, కానీ చెయ్యి పెట్టలేదు.

"మేం కట్టకుండా నీ సొంతయ్యేమన్నా ఇప్పిస్తున్నావా ఏంది? " నిష్ఠూరంగా అంది.

ఆ మాటలు వినపడనట్లుగా బండి స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు.




నట్టింట్లో పడుకుని పైకప్పు కేసి చూస్తున్న రంగమ్మకి నిద్రే రావడం లేదు.

'ఇంత పొద్దు బోయిందాకా పిల్ల ముండ రాకనేపోయినే. చుట్టుపక్కల వాళ్లు చెవులు కొరుక్కుంటున్నారూ అంటే కొరుక్కోక ఏం జేస్తారు' అనుకుంటూ.

ఇంట్లోకీ బైటికీ కాలుగాలిన పిల్లిలాగా తిరుగుతూనే ఉంది. పొద్దస్తమానం రెక్కలు ముక్కలు జేసుకోవడం, అర్ధరాత్రి దాకా ఈ పిల్ల కోసం ఎదురు చూడటం పెద్ద యాతనగా ఉంది. దూరాన టీ కొట్టు దగ్గర ఇంకా లైటు వెలుగుతూనే ఉంది. రోడ్డుమీద అప్పుడొకటీ ఇప్పుడొకటీ వాహనాలు తిరుగుతున్నాయి.

చుట్టుపక్కల వ్యాపిస్తున్న చీకటిని వీధి లైట్లు పారదోల లేకపోతున్నాయి. కీచురాళ్ళ రొద ఆకాశమే హద్దుగా హోరెత్తుతోంది.

"ఏందే, అమ్మాయి ఇంకా రాలేదా!" ముసలమ్మ బోసి నోటిని ఆడించుకుంటూ అడిగింది.

"నీకెందుకు నువ్వు పడుకోవమ్మా. మా కంటే తప్పక చస్తున్నాం. మజ్జెలో నువ్వు కూడా ఎందుకు చావడం" విసుక్కుంది రంగమ్మ బయటకు వెళుతూ.

"ఎందుకమ్మా ఈడొచ్చిన పిల్లలు ఇంతంత రాత్రుళ్ల పూటదాకా రాకపోవడం. ఏం పిల్లలో, ఏం ఉజ్జోగాలో!" తనలో తాను గొణుక్కుంటూ పక్కకి తిరిగి పడుకుంది

ముసలమ్మ.

బయట కుర్చీలో కూర్చుని చూస్తుంటే మిద్దెలు మేడలు రంగు రంగుల లైట్లు వెద జల్లే కాంతిలో బంగారు రంగులో మెరిసిపో తున్నాయి. ఇవన్నీ ఎట్టా కట్టగలుగుతున్నారు. ఈ డబ్బంతా ఎక్కణ్ణుండి తెస్తున్నారు అనేది రంగమ్మకు ఊహకు అందడం లేదు.

'అయినా నా పిచ్చిగానీ అందరి సంసా రాలూ నాకులాగే ఉండాల్నా! యాడేడ దరిద్రం అంతా నా మొఖానే రాసినట్టు. గాశారం గాకపోతే ఇంత పొద్దు పోయిందాకా రాకపోతే పిల్ల కోసం ఎన్ని రాత్రిళ్ళు ఇట్లా ఎదురు చూసేది. రేపు ఒకయ్య చేతిలో పెట్టాలంటే ఎంత కష్టమో కదా!

ఆడ మానిపిద్దామంటే ఆ వచ్చే నాలుగు రూపాయలు రాకపోతే ఈ కష్టాల్నుంచి గట్టె క్కేది ఎట్ట. రేపు ఎవరన్నా చేతిలో ఒక్క రూపాయి కూడా లేకపోతే ఎట్ట చేసుకుం టారు. ఈ నికృష్టపు బతుకు బతికేకంటే చద్దా మంటే ఈ పిల్లల్ని ఒకదారి జేసేవాళ్ళే లేకపో యిరే! యాడకేడకో పిల్లని కేంపులకి పంపిస్త న్నారనీ, యాడేణ్ణో తిరుగుతుందనీ వాళ్లూ వీళ్ళూ అనుకుంటుంటే చెవుల పడుతున్నా యినీ యిననట్టు పోవాల్సి వస్తంది. ఏదేదో జరుగుతోందని చూచాయగా తెలుస్తున్నా ఇంత జీతం ఇచ్చేవాళ్ళు ఎవురూ కనబడకపో తుంటిరి.

యాడకి పోయినా ఆడకూతురుకి ఈ కష్టా లు తప్పవు. గాశారం బాగ లేకపోతే ఎవురేం జేస్తారు. ఈడదాకా ఈ యాళప్పుడు రిక్షాలు కూడా రావే' అనుకుంటూ ఆందోళన పడు తుండగా కారొకటి వచ్చి దూరంగా ఆగడం గమనించింది రంగమ్మ. కారు తలుపు తెరు చుకొని కూతురు దిగడం, తలుపు మూసుకో వడం క్షణాల్లో కారు వెళ్ళిపోవడం జరిగింది.

నీరసంగా కాళ్ళీడ్చుకుంటూ వస్తున్న కూతురు మొహం చూస్తుంటే ఏడుపు నాభి నుండి ఎగదన్నుకు రావడం మొదలైంది.

కూతురు దగ్గరకు రావడంతో "ఎవరిదమ్మా కారు? " అడిగింది రంగమ్మ. ఆరాగా అడుగు తున్న అమ్మవైపు ఒక్క చూపు చూసింది సు ధారాణి.

ఆ చూపులో రంగమ్మకు ఎన్ని అర్థాలు గోచరించాయో, ఎన్ని అగ్ని పర్వతాలు పేలు తున్నట్లు అనిపించిందో. ఇంకేం మాట్లాడ కుండా ఇంట్లోకి నడిచింది.

అమ్మ ఏమనుకుందో అనుకుంటూ "కంపెనీ కారమ్మా. ఇంత పొద్దు పోయిందని ఓనర్‌గారే పంపించారు" అంటూ ఇంట్లోకి వచ్చి చీర విప్పేసి నైటీలోకి మారిపోయి చాపమీద నడుం వాల్చింది.

"మళ్ళీ పడుకుంటావేందే ఇంత పొద్దుపోతే! పొయ్యి మీద నీళ్ళు కాగుండయ్యి. తోడతా రా!" అంటూ పిల్చింది రంగమ్మ.

"అమ్మా నాకిప్పుడు ఓపిక లేదమ్మా. నేను చెయ్యలేను. ఒళ్ళంతా హూనమైనట్టుంది" అంటూ వళ్ళిరగదీసుకొని పక్కకి తిరిగి పడు కుంది.

"పోనియ్యి కూడన్నా తినమ్మా. ఆమ్లేట్టేసి పెడతాను లేమ్మా" అంటూ వచ్చి తల పట్టు కుని "రేపు పొద్దున లేవలేవమ్మా. లే" అంటూ బతిమిలాడింది.

"అమ్మా! ఆకలిగా లేదమ్మా. టిఫిన్ జేశా నులే. నువ్వు పడుకో" అంటూ నిదర కళ్లతో ఆవలిస్తూ కళ్ళు మూసుకుంది.

"ఏం ఉజ్జోగాలో ఏందో ఆ పిల్ల కూడా నేనె క్కడో తినొచ్చానని చెప్పి పడుకుంది. నువ్వు కూడా అట్నే పడుకుంటివి. వండిన కూడంతా అక్కడే ఉంది" అంటూ తాను పళ్లెంలో అన్నం పెట్టుకుని తినలేక అలాగే వదిలేసి పిల్లల వంక ముసలమ్మ వంక చూస్తూ పడు కుంది.

రంగమ్మ పడుకోవటంతో పక్కనే ఉన్న సుధారాణికి మెలకువొచ్చింది.

"అమ్మా! రేపట్నుండి ఆ ఆఫీసుకి నేను పోలేనమ్మా. ఎక్కడకంటే అక్కడికి నా ఇష్టంతో పనిలేకుండా పంపిస్తామంటారు..."

అంతకంటే తల్లికి ఎక్కువ చెప్పలేక సన్నగా రోదించసాగింది.

వాడు, మొగోడొకడు ఉండాడన్న ఆశ

లేకుండా పోయింది. యాడ తిరుగుతాడో, ఏం తింటాడో, ఎపుడో వచ్చి బతికుండానని తెలపటానికి కనపడిపోతాడు.

ఆడపిల్లలైనా వీళ్లు ఎంత కష్టపడతుండారో! పాపం మణుసుకి ఎంత కష్టం కలగకపోతే నేను పోనంటది అనుకుంటూ "ఏమైందమ్మా. ఎవురేమన్నారు. ఏం జేస్తాం రాత బాగుంటే ఎంతబాగ బతకాల్సినోళ్ళు ఇప్పుడు ఒకయ్యకాడికి పోయి దేబిరిచ్చాల్సి వస్తుండే! అన్నయ్యేమో వాడి తిరుగుళ్ళతో ఆ మాయదారి రోగం తెచ్చుకుని వాడి దారి వాడు జూసుకుని చస్తన్నాడు. వాడి సంపాదన వాడి మందులకే సరిపోక అప్పుడప్పుడు వచ్చి నా దగ్గిర దండుకుని పోతున్నాడు. సరే అంత బాధగా ఉంటే మానేసెయ్" అయిష్టంగానే చెప్పింది.

సుధారాణి ఎప్పుడో నిదర్లోకి జారుకోవడంతో రంగమ్మ చెబుతున్న మాటలు వినసే లేదు.

అటునుండి మాటలు వినపడకపోవడంతో రంగమ్మ కూతురు వైపు చూసి ఇటు తిరిగి పడుకుంది.

'పాపం పిల్ల ఎంత బాధ పడుతోందో అర్థమవుతూనే ఉంది. ఏం జేస్తాం, కాలం అట్టుంది. అవసరాన్ని బట్టి మణుసులు మారతా ఉండారు. ఆడదాన్ని జూస్తే దీన్నెట్ట నాశనం జెయ్యాలని చూసే వాళ్లేగానీ, పోనియ్యిలే పాపం ఇంట్లో జరక్క ఉద్యోగానికి వచ్చారని తలిచే మొగోడే లేకపోయినే!

బెమ్మ రాసిన రాతని ఎవురు మారుస్తారు. ఎంత ఇబ్బందిగా ఉంటే అంత మంచి ఉజ్జోగం వదులుకుంటానంటంది. ఎంతో ఓర్పు గల్ల మడిసి నా బాధల్ని అర్థం జేసుకోని ఎన్ని బాధలైనా భరిస్తోంది. ఏం జేస్తాం నట్టడవిలో ఉన్నంట్టుండే!

ఉండూళ్ళో పస్తులుండా నలుగురు మనోళ్ళ మధ్యన ఉండామన్న ధైర్యమన్నా ఉండేది. ఈడ చచ్చేమా బతికేమా అని విచారించేవాళ్లు కూడా లేకపోతిరి.

ఏ కూలో నాలో జేసుకోని పొట్ట బోసుకునే

## రంజుగా రంగేసుకోండి

నల్లబైల్లో పద్తున్న వాళ్ళంతా తెల్లబడుతున్న జుట్టును నల్లబరచుకునేందుకు "డై" వేసి నానా తంటాలు పద్తుంటారు. మరో వైపు నల్లగా ఉన్న కేశాలకి రకరకాల రంగులు వేసి నాగరికత పేరుతో నానా హైరానా పడు



తోంది నేటి యువతరం. వాళ్ళనీ, వాళ్ళ వేషాల్ని చూసి "హన్నా!" అని ఆశ్చర్యపోతున్నారు. వయసుడిగిన వాళ్ళు ఈ "డై"లు వాడటం వల్ల బ్లాడర్ కాన్సర్లు, చర్మ వ్యాధులు వస్తాయని "వదంతులు" ప్రచారంలో ఉన్నా కూడా "డై" వేసే వారి సంఖ్య రోజురోజుకీ పెరుగుతూనే ఉంది. స్పానిష్ శాస్త్రవేత్తలు 11 దేశాల్లోని ప్రజల మీద 79 రకాల పరిశోధనలు జరిపాక "డై" చెయ్యటం వల్ల బ్లాడర్, బ్రెస్ట్ క్యాన్సర్లు వచ్చే అవకాశం లేదని బల్లగుద్ది చెబుతున్నారు.

చాలా తక్కువ శాతం అదీ బార్డర్ లైల్లో బోన్ క్యాన్సర్ వచ్చే అవకాశం ఉండొచ్చని అంటున్నారు. అయితే పబ్లిక్ హెల్త్ రిస్క్ ఫ్యాక్టర్స్ మాత్రం ఏమీ లేవని తేల్చి చెబుతున్నారు.

కాబట్టి డై వెయ్యటం వల్ల డెత్ ముంచుకొస్తుందన్న ఫోబియా ఉన్న వాళ్ళు ఆ ఆలోచన ఆపేసి, హాయిగా డైలో డైవ్ చేసి అందంగా తయారవ్వొచ్చంటున్నారు.

వాళ్ళం. పొద్దుగూకే తలికి గుడిసెలో కాళ్ళు పొట్టలోకి ముడుచుకుని పడుకున్నా అడిగే వాడే ఉండడు. సంసారాన్ని ఊళ్ళో నుండి అడవిలోకి లాక్కొచ్చిన తరవాత మారాజు ఎటుపోయాడో అంతూపొంతూ లేకపోయినే!

మొగ బిడ్డొకడు ఉండాళ్ళే. వాడన్నా అండగా నిలబడతాళ్ళే అనుకుంటే వాడు; ఆ లారీల మీదకి పోవద్దురా ఏదోక పని జేసు కుని బతుకుదాం అంటే, నా కొచ్చిన పని అదొకటేనని ఆ లారీలకే పోతుండే! ఏందిరా ఇంటికాడ ఒక్కపూటన్నా ఉండవంటే ఈ దివాణంలో ఉండోళ్ళు చాల్లే. ఇంక నేను కూడా ఉంటే కూచ్చోడానికి నుంచోడానికి కూడా సందుండదు అంటూనే పోయేవాడు. అందుకే వాడూ, వాడి సావాసాలూ అట్టేడి సినియ్యి.

ఆడ పిల్లలైతేమి ఆదుకుంటున్నార్లే అను కుంటే చిన్నదాన్నేమో ఆడ బండచాకిరీ చేయిస్తన్నారని ఒకటే ఏడుపైపోయింది. పెద్దదాని పరిస్థితేమో ఇట్టుండే. ప్రయివేటు ఉజ్జోగాలంటే వాళ్ళ చెప్పుచేతల్లో ఉండా ల్సిందే. ఎక్కడ కూచోమంటే అక్కడ కూచో వాల. ఎక్కడ నుంచోమంటే అక్కడ నుంచో వాల. ఆడపిల్లలైపోతిరి. వాళ్ళకి పెళ్ళిళ్ళు చేసి ఒకయ్య చేతిలో పెట్టాల్సింది పోయి వాళ్ళ సంపాదన మీదే బతుకు ఈడవాల్సిన గతి పట్టిందే' అనుకుంటూ పైకప్పు వంక చూస్తూ ఆలోచిస్తున్న రంగమ్మకు ఎంత వద్దు వద్దనుకున్నా గతమంతా కళ్ళ ముందు కనిపిస్తూ గుండెల్నిండా అలజడి కలిగిస్తూనే ఉంది. ఎంత కళ్ళు మూసు కున్నా ఆ రోజు నిద్ర పట్టలేదు.

పెద్దపిల్ల ఉద్యోగం మానేస్తే ఏం జెయ్యాలో తోచడం లేదు. ఇంకా అప్పులోళ్ళు ఎక్కువైపోతారేమోననే బాధతో ముసలమ్మ వంక జూసింది.

నలుగురు కొడుకుల్ని కన్న ముసలమ్మ తన చేతి మీదుగా ఎంతోమందికి వండి వార్చింది. వడ్డించింది. ఇప్పుడు తలాతోకా లేకుండా నా పంచనపడి ఉండాల్సివచ్చింది అనుకునేసరికి కాపరానికి వచ్చిన కొత్త రోజులు గుర్తొచ్చాయి.

కొడుకులూ, కోడళ్ళూ పిల్లా జెల్లా అంతా ఒక పెద్ద సంస్థానం లాగుండేది. పుట్టుదరి ద్రంలో పుట్టిన నాకు ఆ ఇంట్లో అడుగు బెట్టడం స్వర్గంలోకి పోయినట్టే ఉండేది.

ఏ పని చెయ్యాలన్నా అత్తగారి చేతుల మీదుగానే జరిగిపోయేది. తల్లి మాట జవ దాటే వాళ్ళు కాదు పిల్లలు. ఎవురెంత మొండికి పడ్డా అమ్మ సర్దిజెబితే ఒడిదుడుకు లన్నీ సమసిపోయేవి.

'లేని కుటుంబం నుంచి వచ్చానని తోడికో డళ్ళు కాస్త చిన్న చూపు చూసి ఎక్కడెక్కడ అరవచాకిరీ నాచేత చేయించేవాళ్ళు. ఎంత పని జేసినా చిన్నప్పట్నుండీ కష్టపడటం అల వాటయినందున దాంతో పోలిస్తే వీళ్ళు చెప్పే పనులన్నీ చిటికెలో చేసేదాన్ని.

అప్పుడప్పుడూ వాళ్ళు మాట్లాడే సూటిపో టీ మాటలు ములుకుల్లా గుచ్చుకునేవి. అయితే ఈ ముసలమ్మ ఉంది కాబట్టే దేని కైనా అడ్డంబడి నా వైపు మాట మాట్టాడేది. లేనిదాన్నని ఎప్పుడూ లేనితనంగా చూళ్ళే దు. ఎప్పుడూ నా తరపునే వకాల్తా పుచ్చు కుని వాళ్లనే మందలించేది. ఎంతోమందిని చేరదీసేది. ఇంటికొచ్చిన పనోళ్ళకి లేదన కుండా పెట్టేది. ఎవరన్నా ఇబ్బందుల్లో ఉన్నా మని వస్తే పదో పరకో ఇయ్యకుండా పంపేది కాదు.

ఎప్పుడూ పొయ్యిమీద ఏదో ఒకటి ఉడుకు తూనే ఉండేది. ఎంతమందికి వండితే ఆ రోజు అంత ఆనందంగా ఉండేదామెకు.

ఎంత వండినా, వడ్డించినా పొయ్యికాడికి రొండో మడిసిని రానిచ్చేదే కాదు. అంతంత పెద్దపెద్ద అండాలు కూడా మసిగుడ్డ పట్టు కుని గంజి వొంచుతుంటే చూసేవాళ్లకి భయ్యి మేసేది. ఈ మడిసి మాత్రం ఎంత సునా యాసంగా చేసుకుని పోయేదో!

పూటపూటా తొట్టికుడితి తయ్యారయ్యేది. బర్రెల్ని మాత్రం మామూలుగా చూసుకు నేదా? జొన్నకూడు, పిట్టు, పచ్చిమేత వేస్తే

మామూలు బర్రెలే ఢిల్లీ బర్రెల్లాగా ఎన్ని పాలిచ్చేయి? యెద్దులకి గంపలు గంపలు ఉలవలు వండి రోజూ ఎవురో ఒకరికి ఉలవ చారు పోసేది. ఊళ్ళో ఎవురికి ఉలవచారు కావాలన్నా ఈమె దగ్గరికే వచ్చే వాళ్ళు. గొడ్లని కూడా మనుషుల్లాగా ప్రేమగా చూసుకునేది. ఈమె చేతి కింద గొడ్లు పుష్టికరంగా నిగనిగ లాడతా ఉండేవి.

ఎట్టాంటి మారాణో ఇక్కడ నా అవస్థల్ని జూస్తాపడుండాల్ని వచ్చింది ప్చ్.. రాజెవురో రెడ్డెవురో. నొసటి రాత ఎట్ట తిరుగుద్దో ఆ భగవంతుడికే తెలియాలి.

ఆ రాత్రి రంగమ్మకు నిద్రే పట్టలేదు. గతం మళ్లీ మళ్లీ కళ్ళ ముందు దోబూచులాడింది. జరుగుతున్నదంతా ఒక తతంగంలాగే అనిపిస్తోంది. ఏమీ అర్థంకాని అయోమయంలో నుంచి ఎటూ తేల్చుకోలేని సందిగ్ధంలో పడిపోయింది. తెల్లవార్లూ నిద్రనిండా గతం వర్తమానాలు తీపి, చేదు అనుభవాలు కలల రూపంలో వెంటాడుతూనే ఉన్నాయి.

8



మసక చీకటిగా, నిశ్శబ్దంగా ఉన్న వాతావరణం ఒక్కసారిగా ఏడుపులు పెడ బొబ్బలతో గోలగోలగా మారిపోయింది. ఉలిక్కిపడి లేచిన రంగమ్మ అప్పటికే మెలకువతో ఉన్న ముసలమ్మ వైపు జూసి "ఏందమ్మా ఏంది గోల" అనడిగింది.

"ఏమోనమ్మా ఒక్కసారిగా సామ్రాజ్యం వాళ్ళింటో నుంచి శోకాలు పెట్టడం ఇనపడుతోంది."

దుప్పటి పక్కకి తీసి, చీర కుచ్చిళ్ళు సరిచేసుకుని జుట్టు ముడేసుకుంటూ రెండు మూడిళ్ళవతల ఉన్న సామ్రాజ్యం ఇంటికి వెళ్లింది. అప్పటికే చుట్టుపక్కల వాళ్లు గుమికూడి ఉన్నారు. జనం మధ్యలో గుండా చూసిన రంగమ్మకు వరిగడ్డి మీద పడుకోబెట్టిన శవం కనిపించింది.

ఎవరూ అని పరీక్షగా చూసి "ఓయమ్మో సామ్రాజ్యమే! ఏమయ్యిందే!" ఆశ్చర్యపోతూ "నిన్న నా దగ్గిరకొచ్చి శానాసేపు కూర్చోని మాట్లాడింది. తెల్లారే తలికే తెల్లార్చుకొని పోయింది గదే! ఎట్ల జరిగిందట" పక్కనున్న సీతారత్నంను అడిగింది.

"ఏం కష్టమొచ్చిందో! ఎంత ధైర్నం కల మడిసి. దేనికీ భయపడేది కాదు. అట్టాంటి మడిసి ఉరేసుకుందంటే, ఏమోనమ్మా నమ్మ లేకుండా ఉన్నాం." కంటికి పూసిన కన్నీటి చెమ్మను తుడుచుకుంటూ చెప్పింది సీతారత్నం.

"ఈ యబ్బ చేసే పనులకి ఆయమ్మ పడే కష్టాలకి అంతే లేకుండా పోయింది. ఒకరికి నలుగురు పిల్లలు ఇంట్లో ఉండారా! ఒకరోజు పనికి పోతే ఒకరోజు నాగా ఏస్తాడు. ఒంట్లో బాగ లేదని, కంట్లో బాగ లేదని ఇంటికాణ్ణే తాగి తందనా లాడతండాడు.

ఎన్నాళ్ళని అటుదిటు ఇటుదటు సర్దుతుంటది. అందుకే ఈ అతుకుల బతుకు నించి తెల్లార్చుకుని ఎల్లిపోయింది" వెంకటలక్ష్మి కోపంగా మెటికలు విరుస్తూ సామ్రాజ్యం శవం ముందు కూర్చుని కన్నీరు పెడుతూనే సామ్రాజ్యం భర్తని చూస్తూ "ఈడి మొకానికి ఎప్పుడన్నా పది రూపాయలు ఇచ్చాడా దాని చేతికి" అంటూ అరిచింది.

"ఏందే ఎందుకు సచ్చిపోయిందే మీ అప్ప" ఆమెను పక్కకి లాగుతూ అడిగింది రంగమ్మ అక్కడ గోల చేస్తుందని.

"యాడ దెచ్చి సవిరిచ్చిద్దే. కుండలు, చాటలు లేవని కూడొండటం మానుకుంటదా! ఒక్క మణిసి చేస్తే ఎంత మందికని వొచ్చుద్ది. పైగా తాగుడుకి లేని రోజు దాని మీద పడి చావగొట్టి పదో పరకో ఉంటే ఎత్తు

కుని పోతాడు. కూశమ్మ కూడ బెడితే మాశమ్మ మాయం జేసిందనీ! అప్పటికీ పిల్లల్ని నేను దగ్గరికి తీస్తా. నీ సొంత అప్ప బిడ్డల్ని అక్కున చేర్చుకుంటావని ఇంట్లో దెప్పి పొడుపులు పొడుస్తున్నా వినీ విననట్టు ఓర్చుకోని పోతండాను. పక్కనే ఉండి ఈ గోల పడేకంటే ఎటన్నా ఎల్లిపోదామని పిచ్చేది" తన గుండెల్లో మంటని వెలిగక్కుతోంది వెంకటలక్ష్మి.

"ఈ మజ్జె అదేందో షేరు బేంకంట. దానిలో అప్పు తీసుకుందంటమ్మా. అప్పట్నుండి చూడాల. అటు పరిగెత్తనూ ఇటు పరిగెత్తనూ! ఒకటే ఉరుకులు పరుగులైతే. అబ్బో వారం వారం తెచ్చి కట్టాలంటే ఈళ్ళయ్యే పనా పెద్ద పెద్ద యాపారాలా! కూచుంటే లేవలేని వాళ్ళమయితిమి. తెచ్చుకుని తినేటప్పుడు బాగానే ఉంటది. కట్టబోయే తలకి గదా! చెంబులు సెరవలు గంగాళాలు ఇంట్లో ఉండే ప్రతి వస్తువూ కుదవ బెట్టి డబ్బులు దేవడమే! మెళ్లో తాళిబొట్టు కూడా కుదవ కొట్టుకి పోయింది' ' ఆక్రోశం వెళ్ళగక్కుతూనే ఉంది వెంకటలక్ష్మి.

"అమ్మాయ్ ఊరుకో! ఎంత అరిసినా పోయిన ప్రాణం ఒస్తదా! జరగాల్సినియ్యి చూడండి" సలహా ఇచ్చారెవరో!

"ఇంకేంది చూసేది. ముదనష్టపోడు ఒక్కరోజు కూడా దాన్ని సుఖపడనియ్యలేదు కదా! ఒకటే నరకం చూపిచ్చాడు. ఇంక తింటాళ్లే నలుగురు పిల్లల్ని పెట్టుకుని" అంటూ వెంకటలక్ష్మి ఏడుస్తూనే ఉంది.

రంగమ్మ ఇక అక్కడ ఉండలేక ఇంటికి బయలుదేరింది.

"ఏందే ఈ షేరు బేంకులు, జనం తెగ చెప్పుకుంటుండారు. వాళ్లెవరో బేంకోళ్ళు ఒచ్చినప్పుడు బజారు బజారంతా ఉరుకులు పరుగుల మీద ఉంటారు. వాళ్ళని వీళ్లని అప్పులు అడుక్కోవటం, అందిన వస్తువుని కుదవ బెట్టడం. ఇంతకీ ఎవురే ఆ బేంకు" సామ్రాజ్యాన్ని చూసి వస్తున్న రంగమ్మ తనతోపాటే వస్తున్న శాంతమ్మని అడిగింది.

"ఏం లేదే, మొన్నటి దాకా ఫైనాన్సులోళ్ల ఎట్టాగో, అట్టాగే ఇప్పుడు ఆడోళ్ళకి అప్పులిచ్చే ఆడ ఫైనాన్సులన్నమాట. అంతకు ముందు లాగ ఈళ్లు కూడా వస్తువులేమీ పెట్టుకోకుండా ఇంటోవాళ్ళో లేకపోతే ఇంతకు ముందు ఖాతా ఉన్నోళ్లో సూరిటీ పెడితే చాలంట డబ్బులిచ్చేస్తారు.

ఒక్కో గ్రూపుకి ఎనిమిది మందిని జూసుకొని గ్రూపు కట్టాల. అట్ట ఒక చోటే పది గ్రూపులుంటయ్యి. ఒక్కో గ్రూపుకి ఒక్కొకర్ని లీడర్‌గా పెడతారు. అన్ని గ్రూపులకూ మొత్తం మీదా ఒక లీడర్ని పెడతారు. ఇచ్చిన అప్పులు వసూలు జేసుకోవడానికి వారానికి ఒక సారి పెద్ద లీడర్ దగ్గిరికి వస్తారు. అప్పుడు అందరు లీడర్లూ అందర్నీ ఆ ఇంటికాడ పోగు జేస్తారు. ఎవురి గ్రూపులోనన్నా ఒక్కరు కట్టకపోయినా ఆ గ్రూపులో అందరి చేతా కట్టిచ్చుకోరు. అట్టా ప్రతి గ్రూపులో చూస్తారు. ఆ ఎనిమిది మందీ కట్టని వాళ్లని అందరి ముందు పట్టుకుని పరువు తీస్తారు. పరువుకి భయపడి కడతారని బలే నేక్ జేశార్లే. అందుకే తల తాకట్టు పెట్టయినా సరే అణాపైసల్తో కడితేనే పరువు నిలబడుద్ది. లేదంటే తలా ఒక పోటు పొడుస్తారు.

అట్టా అందరు కట్టిందాకా ఆ ఇంటి కాణ్ణుండి కదలరు. మొండికిబడి కూచుంటారు" శాంతమ్మ షేరు బేంకు గురించి చెప్పింది.

"అందుకే గామాల నాలుగైదుసార్లు నా దగ్గిరి కొచ్చింది. అప్పా అప్పా రేపో ఎల్లుండో ఇస్తానే. గొంతుమీద కూర్చున్నారు. అని కాళ్ళావేళ్ళా పడింది. నా దగ్గరుండప్పుడు ఇచ్చాను. నిన్న గూడా అట్నే వొచ్చింది. అప్పుడే ఎవురికో కట్టేసు. సమయానికి లేవు గదే అని చెప్పాను. రేపయితే ఇస్తానన్నాను. కాదే యములోళ్ళు ఇయ్యాలే గొంతు మీద కూర్చున్నారే" అంటూ ఏడుపు మొఖంతో వెళ్ళిపోయింది."

"అప్పటికే డబ్బులందక ఒక్కటికి రెండుసార్లు నిలబడిందంట. అందరూ



తలా ఒక మాట అని వాళ్ళే సర్దుకుని కట్టారంట. ఈసారీ డబ్బులు అందలేదు. అందుకీ తల కొట్టే సినట్టయింది. ముగిచ్చుకోని పోయింది" అంటూ శాంతమ్మ తన ఇంటికి వెళ్ళింది.

"ఏందటనే ఆ గోల"? ఇంటికొచ్చిన రంగమ్మని అడిగింది ముసలమ్మ.

"సామ్రాజ్యం తెలుసుగా. అదే ఆ తాగుబోతు నాగరాజు పెళ్ళాం. అది ఉరిబెట్టుకుని సచ్చింది" ముసలమ్మకు కొద్దిగా చెవుడు ఉండడంతో పెద్దగా అరిచి చెప్పింది.

"అదిగాదే, గొంతు మునిగేటట్టు అప్పులు జేసుకోవడం దేనికీ? ఇట్టాపడి చావడమెందుకూ!" నిట్టూరుస్తూ అంది ముసలమ్మ.

"అది మాత్రం ఏం జేస్తుంది? ఒంటిచేత్తో చూసుకోవాల. మొగుడు పట్టించుకోవడంలా. తెప్పరిల్లుకోలేకపోయింది". అని "అమ్మాయ్! లేండమ్మా. తెల్లారింది. లేండమ్మా" అన డంతో పిల్లలిద్దరూ కళ్ళు తెరిచారు.

* * *

స్టౌ మీద టీ సలసలా మరుగుతోంది. పేపర్ చూడడానికి ఒకరిద్దరు వచ్చి బెంచీ మీద కూర్చుని ఉన్నారు. రంగమ్మ కొట్టు ముందు కసువు చిమ్మి కళ్ళాపి చల్లసాగింది.

"రంగమ్మత్తా, బాగున్నావా? " అంటూ విని పించడంతో కళ్ళాపి చల్లుతున్నదల్లా తలెత్తి ఎవరా ఇంత పొద్దున్న వరస కలిపి పిలు స్తోంది అనుకుంటూ తలెత్తి చూసింది.

"చామలోళ్ళ మోహన్రావువి కదా"!

"ఆ అవునత్తా, గుర్తు పడతావో లేదోనను కున్నాను. తొందరగానే గుర్తుపట్టేశావు" కుర్చీ మీద కూర్చున్నాడు.- అప్పుడే నిద్ర లేస్తున్న పిల్లల్ని చూస్తూ.

"చూసి చాలా సంవత్సరాలైంది గదయ్యా. ఊళ్లో అంతా బాగుండారా! మీ అమ్మా నాయనా ఎట్టుండారు? పాపం నిన్ను సదివించడానికి రెక్కలు ముక్కలు జేసుకున్నారు. నీకు ఉజ్జోగం వచ్చినాక పెళ్ళాం కొంగు బట్టుకొని యెల్లకుండా, వాళ్ళని కాలు కింద బెట్ట

కుండా చూసుకోవాల" చేతులు పైట కొంగుకు తుడుచుకుంటూ అంది రంగమ్మ.

"ఉజ్యోగం కూడా తొందర్లోనే వొచ్చిద్దత్తా వాళ్ళని కాకపోతే ఇంకెవర్నీ చూస్తాను" అన్నాడు మోహన్రావు.

స్టౌ మంట తగ్గించి, టీ ఫిల్టర్ చేసి, గ్లాసులో పోసి మోహన్రావుకు ఇచ్చింది. చేతిలో ఉన్న పెళ్ళి కార్డుల్ని చూస్తూ "పెళ్ళి కార్డుల్లాగున్నయే ఎవురివి" అనడిగింది.

"సుబ్బయ్య మామ కొడుకు వెంకటేశ్వర్లుది" కార్డుల మీద రంగమ్మ పేరు కోసం వెతుకుతూ, ఆమె పేరు కనబడడంతో కార్డు తీసి ఆమె చేతికి ఇచ్చాడు.

"పాపం, వాళ్ళ నాయన రెక్కల కష్టం కడతేరింది. కష్టపడి పైసా పైసా కూడబెట్టి వాణ్ణి చదివించాడు. వాడు కూడా ఏదో చదువుతున్నాలే అనుకోకుండా వాళ్ళ నాయన్నీ కనిపెట్టి నడచుకున్నాడు. కాబట్టే ఉజ్జోగం వొచ్చిందాకా ఉగ్గబట్టుకుని లాక్కొచ్చాడు.

అప్పటికీ పాపం ఉండ నాలుక్కుంటల మాగాణీ అమ్మేశారంట గదా! వచ్చే కోడళ్లని బట్టి కాకుండా మీరే వాళ్ళని పువ్వుల్లో పెట్టుకుని చూసుకోవాల" ఇడ్లీ పాత్ర పొయ్యి మీద పెడుతూ ఊళ్ళో నలుగుర్నీ గుర్తు చేసుకుంటూ మోహన్రావుకి మంచి మాటలు చెబుతోంది.

"ఏం జూస్తామో అత్తా. ఆ ఎంకమ్మగారి నారాయణుండాడు చూడూ. వాడు చదువుకుని ఉజ్జోగం వచ్చినాక పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళాం గూడా బాగా చదువుకుందే. ఏం లాభం ముసలోళ్ళని వదిలి పెట్టి టౌనుకి వొస్తావా రావా అంటూ భీష్మించుకుని కూర్చుంది. తప్పేదేముంది? అప్పటికీ పాపం నారాయణ సతపోరాడాడు. ఆ బండ పల్లెటూరుకి నేను రానని భార్య అమ్మగారింటికాణ్ణే ఉండిపోయింది. ఏం జేస్తాడు? పాపం సింగిరాయకొండలో కాపరం పెట్టండయ్యా. మా కోసం మీ సంసారాన్ని నాశనం జేసుకోవడం ఎందుకని వాళ్ళ నాన్నే కోడల్ని బతిమిలాడి తీసుకొచ్చి యేరే పెట్టించాడు. అంతా గూడా మన చేతుల్లో లేదులే రంగమ్మత్తా" మోహనరావు టీ తాగడానికి వస్తున్న వాళ్ళను చూస్తూ చెప్పాడు. రంగమ్మ కూతుళ్ళు అట్టలతోటీ మట్టలతోటీ రేకు తలుపుతో బాత్‌రూమ్ లాగా తయారుచేసిన ఆ కట్టడంలోకి స్నానానికి పోతుంటే మోహన్రావు మనసు చివుక్కుమంది.

ఓడలు బళ్ళవుతాయి, బళ్ళు ఓడలవుతాయంటే ఇదే మరి. ఎట్టాంటి గొప్ప సంసారం. నలుగురన్నదమ్ములు రామలక్ష్మణ, భరత శత్రుఘ్నుల్లాగా ఉండేవాళ్ళు. ఆంబోతుల్లాంటి యెద్దులు. ఎన్నో పాడి గొడ్లు, గేదెలు, ఆవులు. ఎట్టాంటి కమతం. ఆ రోజులే వేరు.

ఊర్నిండా ఆవులు మందలు మందలుగా పొలాలకు పోతుంటే పాల సముద్రం కదులుతున్నట్టు ఉండేది. బర్రెలు మేతలకి వెళ్తుంటే పొగ మేఘం గాల్లోకి తీస్తున్నట్టుండేది. గొర్రెలు, మేకలు చెప్పనే అక్కర్లేదు. ఎన్నెన్ని పశువులు! పంటలతోటి పాడి కూడా రైతుకి ఎంత సంపదనిచ్చేది. ఇప్పుడా పశువులే కంటికి కనబడకుండా పోయినియ్యి. మనుషులకి వాటి అవసరమూ లేకుండా పోయింది. అదే ఇట్టాంటోళ్ళని సర్వనాశనం జేసింది.

ఇప్పుడా పశువులే కంటికి కనబడకుండా పోయినియ్యి. మనుషులకి వాటి అవసరమూ లేకుండా పోయింది. అదే ఇట్టాంటోళ్ళని సర్వనాశనం జేసింది

ఇంట్లో నుండి వస్తున్న రంగమ్మత్తను చూస్తూ, "రంగమ్మత్తా! నేను ఎల్లొస్తాను ఇంక టౌన్లో చాలా కార్డులు ఇయ్యాల. యేకువ జామున్నే లేస్తే ఈ టయానికి వచ్చా" అంటూ లేవబోయాడు.

"ఎవురే? ఊర్నించి ఎవురన్నా వొచ్చారా ఏంది? " ఊళ్ళో విషయాలు చెవిన బడడంతో కేకేసింది ముసలమ్మ.

"అయ్యా, అటుబోయి కాస్త కనపడయ్యా. ఊళ్ళోవాళ్ళు కనబడి ఎన్నో రోజులైంది

పాపం" అనడంతో మోహన్రావు వొంగుని చూరు తగలకుండా ఇంట్లోకి ఒక అడుగేశాడు.

"అమ్మాయ్! ఆ కుర్చీ యెయ్యమ్మా" అని రంగమ్మ కేక వెయ్యడంతో సుజాత కుర్చీ వేసింది.

"బాగున్నావా? " అంటూ సుజాతను పలకరించాడు.

"ఆ" అంటూ నవ్వుతూ సమాధానం చెప్పింది.

కుర్చీమీద కూర్చున్న మోహన్రావు ముఖాన్ని పరీక్షగా చూస్తున్న సుబ్బులమ్మ దగ్గరగా వంగి "ఎవుర్నో గుర్తు పట్టావా? " అడిగాడు మోహన్రావు.

చెయ్యి కళ్ళపైన అడ్డంగా పెట్టి, "బాగా మసకలొచ్చేసినయ్యి. మణిసి దగ్గరకొచ్చినా సరీగా కనబడటంలా" చెప్పింది గుర్తు బట్టలేక.

"నేను చామల రాగమ్మ కొడుకుని" అన్నాడు.

"ఆ!... గుర్తొచ్చిందయ్యా. గుర్తొచ్చింది" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది. "ఊరుకో, యాడవబాక. ఎందుకు యాడవటం. ఎవురేం జేస్తారు" అన్నాడు మోహన్రావు.

"అయ్యా ఇట్టయిపోయింది మా గతి" అంటూ పై కప్పు వైపు చూపించింది. ఈ కాలానికి బిడ్డల బిడ్డలు ఎట్టా దర్జాగా మారాజుల్లా ఉండాల్సినోళ్ళు చెల్లా చెదురైపోయారు. ఇంట్లో జిల్లేడు చెట్లు మొలిచినట్టుగా అయిపోయింది. ఎప్పుడో ఎవురో ఏదో పాపం జేసుంటారయ్యా అది మాకు కొట్టింది" బాధను పుట్టెడు దుఃఖంలో నుండి భారంగా వ్యక్తం చేసింది.

"ఊరుకో అవ్వా! మన చేతుల్లో ఏముందిలే" మోహన్రావు ఆ పరిస్థితిలో ఆమెను చూసి, ఆమె బాధను చూసి ఊపిరాడక ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు.

కొద్దిసేపటి తరువాత కళ్ళు తుడుచుకుంటూ "నిన్ను బాధపెట్టినట్టుండాను. ముసిలి ముండను ఏదో నీలాంటోళ్ళు వొచ్చినప్పుడు అన్నీ గుర్తుకి వస్తుంటాయి. ఏమనుకోబాకయ్యా అయ్యా! ఊర్లో అందరూ బాగుండారా! మీ అక్కాయి పెనిమిటి పోయినే. యాడుందయ్యా అది" గుర్తుకు తెచ్చుకుంటూ అడిగింది.

ఎక్కడో బస్తీలో ఉన్నారనుకుంటున్నాను గానీ, అన్ని విషయాలూ తెలుసుకుంటూనే ఉందన్నమాట ఆశ్చర్యపడుతూ అనుకున్నాడు.

'ఆ! వొచ్చి ఇక్కడే ఉండమన్నాం. వాళ్ళ అత్తగూడా గయ్యాళిది. మా బిడ్డ పోయిన తరువాత నువ్వెందుకిక్కడ అని తరిమికొట్టింది. బలే గయ్యాళిదిలే. మనవడు ఉండాడని కూడా చూడకుండా గెంటేయించింది. మేమిచ్చిన డబ్బులు ఇయ్యమన్నా మీ బాబుగాడికి చెప్పుకోండి, ఇంతకాలం ఇక్కడ పడిమెక్కింది చాల్లేదా అని చాలా చండాలంగా మాట్లాడింది. ఎనక పిల్లోడు ఉండాడు కదా! కోర్టులో యేశాం. కేసు నడుస్తోంది. కట్టుబట్టల్తో పంపిచ్చారు. వాళ్ళ పుణ్యాన పిల్లోణ్ణి దీసుకొని కోర్టుల చుట్టూ తిరుగుతోంది."

"ఏం జేస్తాం నాయనా. మనుషులకి మరీ ఎక్కడా లేని ఆశలు పుట్టుకొస్తున్నాయయ్యా. ఉట్టి పున్నేనికే సొమ్ము ఎట్టా వచ్చుద్దా అని తెగ తపన పడతండారు. డబ్బుకు లోకం దాసోహమైపోయింది. మణుసులకి విలువలేకుండా పోయింది. అబ్బులెవురో కొడుకులెవరో. మామలు కోడళ్ళు అసలు ఎవురికి ఎవురూ యెనకటి లాగ అంత సేచ్ఛగా ఉండలేక పోతండారెందుకో మరి. ఆ డబ్బు పిచ్చితోటే మా పెద్దోడు మా కాపరాన్ని కష్టాల్లోకి ఈడ్చేడు. వాడు మాత్రం బావుకుందేముందిలే!" అని కూర్చోలేక కుక్కిమంచం లో పడుకుంటూ, "అయ్యా, మొన్నామధ్య మనూళ్లో వెంకట సుబ్బయ్య ఉప్పునీళ్ళ బాయిలో దూకి సచ్చిపోయాడంట కదా. ఎవురో చెప్పారయ్యా" జ్ఞాపకాల నుండి ఒక్కో పోగు తడుముకుంటూ అడిగింది.

"అది మరీ దిక్కులేని చావులే అవ్వా. ఏం

జేస్తాడు. నలుగురు పిల్లలున్నారు కదా. నలుగురూ నాలుగు భాగాలు పంచుకున్నప్పుడు ఎంత బాగా చూసుకోవాల. ఏర్లు బోయారు. ఎవురి పెళ్ళాలు, పిల్లలు వాళ్ళ రందే తప్ప ఇంకేం పట్టింది వాళ్ళకి. పాపం మెట్లు దిగబోయి కాలుజారి పడ్డాడు. తుంటి ఎముక విరిగింది. అప్పణ్ణించీ కుక్కచావు చచ్చాడంటే నమ్ము. అబ్బో అబ్బో అది నరమానవుడికి రావాల్సిన బాధ కాదనుకో. పాపం యేళకి తిండి బెట్టే వాళ్ళులేక మందులకి డబ్బులిచ్చే వాళ్ళులేక, సరిగ్గా ఎవురూ చూడక అల్లాడాడు. ఆ ముసలమ్మకేమో ఆయన్ని అట్నుంచిటూ, ఇట్నుంచటూ పొర్లిచ్చడానికీ వల్ల గాకపోయె. దారిన బోయేవాళ్ళు ఎంతకాలమని సాయం పడతారు. ఈ నికృష్టపు బతుకు ఎందుకనుకున్నాడు. పోయి బాయిలో దూకాడు" చెప్పాడు మోహన్రావు.

"ఆ ఉప్పునీళ్ళు బాయి మనూరి పాలిట దైవమేనయ్యా. తరతరాలుగా చూస్తే ఎట్టాంటి బాధలైనా కడతేర్చే దైవంగా మారింది. ఎంతమంది, ఎంతమంది. ఏ ఇంటో జూసినా ఒక్కరైనా ఉంటారు కదా! పడి బతికినోళ్ళు గాయాలైనోళ్ళు కూడా ఉండారు గానీ, సచ్చిపోయినోళ్లు ఎక్కువ. మొత్తానికి ఆ బాయికి చేతులెత్తి మొక్కాల్సిందే!

ఎప్పుడో తెల్లోళ్లు ఉండప్పుడు నీలిమందు తోటలు పెంచేవోళ్ళు. ఆ బాయి పక్కనే తొట్లు కూడా ఉండయ్యి చూడు. వాటిల్లో నీలి మందు ఉడకబెట్టేవాళ్ళు. నీళ్ళకోసం ఈ బాయిని ఊరికి దూరంగా తొవ్వారు. ఆ తరవాత పాడు బడిపోయినా ఈ రకంగా ఉపయోగపడుతోంది" అంటూ సుబ్బమ్మ గతకాలపు జ్ఞాపకాలలోంచి ఉప్పునీళ్ళ బాయి చరిత్రను విప్పి చెప్పింది.

మోహన్రావు ఎప్పడెప్పుడు అక్కణ్ణించి పోదామా అని చూస్తున్నాడు. ఇక్కడే ఉంటే ఊళ్లన్నీ ఎప్పుడు తిరగాలి. ఈ ముసలమ్మేమో ఒక పట్టాన వొదిలి పెట్టేటట్టు లేదు అనుకుంటున్నాడు.

"ఇదుగోమ్మా! ఇంక ఆయబ్బాయిని పోనియ్యి. చాలా ఊళ్ళు తిరగాలంట. నువ్వు రాయ్యా టిఫిన్ జేద్దువు" అంటూ రంగమ్మ పిలిచింది.

'బతుకుజీవుడా, ఇంక బయట పడ్డానులే. పాపం ఏమన్నా అంటే ముసలమ్మ బాధపడుద్దని ఇంతసేపూ కబుర్లు చెబుతా కూర్చున్నా గానీ, ఆ ఊళ్ళన్నీ ఎప్పుడు తిరగాల' అనుకుంటూ లేచాడు మోహన్రావు. బయటకు వచ్చి "టిఫిన్ వద్దులే రంగమ్మత్తా! యెల్తాలే. చాలా టైమైంది. మన చుట్టాలు ఉన్న ఊళ్ళన్నీ తిరగాల" అన్నాడు.

"కాదులే కూర్చో అయ్యా, టిపిను ఎంతసేపు తింటావు" అనడంతో మోహన్రావు కుర్చీ మీద కూర్చున్నాడు.

రంగమ్మ మోహన్రావుకి టిఫిన్ పెట్టి ముసలమ్మకి పళ్ల పొడి ఇచ్చి పళ్లు తోముకొమ్మని చెప్పింది.

పళ్ళు తోముకున్న తరువాత ఇడ్లీలు పెట్టి వచ్చింది.

పెద్దమ్మాయి సుధారాణి యధా ప్రకారంగా ఆఫీసు టయానికి రడీ కావడం ఒక కంట కనిపెడుతూనే ఉంది రంగమ్మ. ఇవాళ ఆఫీసుకి వెళుతుందా లేదా అని రాత్రి కూతురు ఆ మాట చెప్పినప్పటి నుండి ఆమెకు గుబులు గుబులుగానే ఉంది. కూతురు మానేస్తే రేపట్నుండి బాకీలోళ్ళకి ఏం సమాధానం చెప్పాలో అర్థమై చావడం లేదు. అనుకుంది.

బ్యాగ్ తగిలించుకుని బయటికి వచ్చిన సుధారాణిని చూసి మనసులో ఎంత బాధ ఉన్నా కానీ పరిస్థితుల వల్ల గుండె దిటవు పడింది. ఆఫీసుకి పోతున్న సుధారాణి రోజూ పోయొస్తానమ్మా అంటూ చెప్పేది. కానీ ఈ రోజు గమ్ముగా తల్లివైపు చూస్తూ నెమ్మదిగా మాటా పలుకూ లేకుండా రోడ్డు దాటింది.

ఇద్దరి మనసుల్లో జరుగుతున్న సంఘర్షణ మాత్రం ఒకరి కొకరికి అర్థమవుతూనే ఉంది.

ఉద్యోగం మానేస్తే అమ్మ ఎదుర్కొంటున్న కష్టాలు గట్టెక్కవు. ఇక్కడ మానేస్తే ఇంకో చోటైనా వెతుక్కోవాలి. అక్కడ కూడా మగవా

ళ్లుందరా, వాళ్లకి మాత్రం కోరికలుండవా, ఉద్యోగానికి పోయిన ఆడవాళ్లని వాళ్ళు మాత్రం అపురూపంగా చూస్తారా! నూటికి కోటికి ఒక్కరైనా ఉంటారా! అనుకుంటూ ఆటో ఎక్కింది సుధారాణి.

'పాపం కూతురు ఎంత బాధ అనుభవి స్తున్నా నా కోసం తన బాధను కూడా దిగ మింగుకొని వెళుతోంది. నువ్వే లేకపోతే నేనే మైపోయి ఉండేదాన్నో' కూతురికి మనసులోనే అభివందనాలు తెలియజేసింది రంగమ్మ.

సుబ్బులమ్మ మోహన్రావు వచ్చి వెళ్ళిపో యాక ఆ రోజంతా ఊరి జ్ఞాపకాలనే నెమరు వేసుకుంటూ ఉండిపోయింది.

కూర్చున్నా పడుకున్నా కళ్ల ముందు మెద లుతున్నాయి గతకాలపు దృశ్యాలు. విశాల మైన ముంగిలి. ముంగిట్లో వరుసగా సిమెంటు గోడలతో కట్టిన ఎత్తయిన వడ్ల పాతర్లు. పాతర్ల నిండా పూడ్చిపెట్టిన వడ్లు.

ముందు నుండి వెనుకదాకా విశాలమైన వసారా ఉంది. ఇంటి వెనుక దొడ్లో వాలుగా రక్షణ కోసం నిలబడినట్టున్న కొబ్బరి చెట్లు.

ఇంటి ముందు ధనియాలు, పెసలు, మిను ములు, కందులు ఎప్పుడు జూసినా నిగనిగ లాడతా ఎండుతూ ఉండేవి.

కొష్టం కాడనుంచి కుడితి తాగటానికి వర సగా వచ్చే బర్రె గొడ్లు. వాటిని మేపే బుడ్డోళ్ళు.

కాళ్లు జేశాక ఇంటి నిండా మనుషులు తిర గటానికి కూడా సందులేని ఇల్లు. ఎప్పుడూ పొలమో పొలమో అని కలవరిస్తూ ఇంటి దగ్గిర కంటే పొలంలోనే ఎక్కువగా గడిపే భర్త.

'రైతన్నోడు పొలం బోకుండా ఇంటికాడ మంచం కరుసుకుని కూర్చుంటే బువ్వెట్ట వొస్త దిరా! పాటు పడాల, పండించాల. మనం తినాల. నలుగురికి ఇంత పెట్టాల' అంటూ అందరికీ ఆయన చెప్పే మాటలు. ఆనాటి ఉలవచారు, జొన్న సంకటి, పేరినెయ్యి, మీగడ పెరుగు, రేగటి మజ్జిగ, చింతకాయ పచ్చడి, ఉప్పు గోంగూర ఎంత బాగుండేవా రోజులు.

ఉన్నట్టుండి ఆయన కూచున్నోడు కూచు న్నట్టే ఇరుసుకు పడిన్నాడే ఆ ఇంటి కళ తప్పి పోయింది. మొనగోడంటి ఎద్దుల మధ్య తాళ్లు పట్టుకుని తీయిచ్చుకున్న ఫోటోకి దండ యేసిన్నాడే ఎవరో శపించినట్టుగా ఆ ఇంటిలో ముసలం బుట్టింది. అంతటితోటే ఆ ఇంటికి మంచి రోజులు పోయినియ్యి. బంగా రమసువంటి ఇల్లు మట్టి దిబ్బగా మారిపో యింది.

ఆ జ్ఞాపకాలు దారపోగుల్లాగా ఒక్కొక్కటీ ఆమె మనో నేత్రాల నుండి అనుభవాల దొంతర్లుగా ముందుకు రాసాగాయి.




నిలువెత్తు రాగి కాగుకి చుట్టూ మట్టి పూసి దానిలో ఎసరుబెట్టి పసుపూ కుంకుమతో పూజించిన పొయ్యి మీద పెట్టి కింద చిల్ల కట్టెలు పెట్టి మంట రాజేసి పొయ్యి ముందు కూర్చుని ఉంది సుబ్బులమ్మ.

ఎసరు కాగిన తరువాత ఎసట్లో బియ్యం వేసి తెడ్డుతో కలియబెట్టి కట్టెల్ని ఎగదోసింది. ఇంట్లో ఉన్న అంట్లని తీసుకుని వెళ్ళి దొడ్లో వేసింది. కడిగిన తొట్టికి సున్నం పూసి మళ్లీ వంటింట్లోకి వచ్చింది.

కుత కుత ఉడుకుతున్న అన్నాన్ని పట్టుకుని చూడ్డానికి తెడ్డుతోనే పైకి తీసి చేతితో నలిపి ఉడికినట్టుందే అనుకుని పొయ్యిలో కట్టెలు బయటికి తీసి నీళ్ళు చల్లి మంటార్పేసింది.

పొయ్యి ముందున్న రాయిని పక్కకు లాగేసి, దాని స్థానంలో అల్యూమినియం గిన్నె ఉంచి, మసిగుడ్డతో రాగి కాగుని అటూ

## స్టోన్ కట్టర్స్

స్టోన్ కట్టర్స్ అంటే పలుగూ, పార అనుకునేరు సుమా! ఎంత మాత్రం కాదు! కంప్యూటర్ యుగంలో అందరికీ శారీరక శ్రమ తక్కువైపోయింది కదా. కంప్యూటర్ల ముందు గంటలకొద్దీ కదలకుండా కూచుని స్నాక్స్, పిజ్జాలు, బర్గర్‌లు తింటుంటే ఒళ్ళు



పెరిగి, కొలెస్ట్రాల్ ఎక్కువై కొంత మందిలో కిడ్నీల్లోనూ, గాల్ బ్లాడర్లలోనూ, "స్టోన్" తయారవుతున్నాయట. రక్తంలో కొలెస్ట్రాల్ ప్రమాణం పెరగడం వలన రక్తనాళాలు మూసుకుపోతాయి. దానివల్ల గాల్ బ్లాడర్ కూడా మూసుకుపోయే ప్రమాదం ఉందట. దీనివలన "బైల్" (పిత్తరసం) విడుదల కాదు. ఫలితం తట్టుకోలేని బాధ.

బాధ భరించలేకపోతే ఆపరేషన్‌కి ఐదు నిమిషాల్లో రంగం సిద్ధం చేస్తారు. కార్పొరేట్ ఆస్పత్రుల వాళ్ళు అయితే ఆపరేషన్ లేకుండానే ఈ గాల్ బ్లాడర్ స్టోన్స్‌ని కరిగించవచ్చంటున్నారు హార్వార్డ్ మెడికల్ స్కూల్ శాస్త్రజ్ఞులు. ఎలా? అని ఆశ్చర్యపోకండి. దీనికి మీరు చెయ్యాల్సిందల్లా రోజుకో... 150 గ్రాముల వేరుశనగ గింజలు తినటమే. ఇంత సులభమా! అంటే... అవునంటున్నారు. వేరుశనగ గింజల్లో ఉండే "మోనో పాలీ అన్ శాచ్యురేటెడ్ కొవ్వులు కొలెస్ట్రాల్‌ని కంట్రోల్ చెయ్యడానికి, గాల్ బ్లాడర్ స్టోన్స్‌ని కరిగించడానికి సహాయపడ్తాయని నిరూపించారు. ఇంకేం రోజూ గుప్పెడు "స్టోన్ కట్టర్"ని నమిలేయండి.

ఇటూ పట్టుకుని రెండు చేతుల్తో కిందకు వంచుతూ కూర్చుంది. గంజి సర్రుమనే శబ్దం చేస్తూ కింద గిన్నెలో పడుతోంది. గంజివైపు చూస్తూ చేతులకు తగుల్తున్న సెగని భరిస్తూంటే ముందు రోజు పెద్ద కొడుకు చెప్పిన మాటలు పదేపదే గుర్తుకొస్తున్నాయి. అందరూ కలిసి మెలిసి ఎంత ఒద్దిగ్గా ఉండారు అనుకున్నాను. ఒక్కో కుటుంబం ఏర్లు పడతంటే నా కొడుకులు రామలక్ష్మణులు, భరత శత్రుఘ్నులు లాగా కలిసి ఉంటారనుకోవడం నా భ్రమే అని తేలిపోయింది. లేకుంటే ఎల్లకాలం పొరపొచ్చాలు రాకుండా ఉండాలని ఎంకటేశ్వర స్వామికి ఎన్నిసార్లు ముడుపులు ఎత్తి పెట్టాను! మాల కొండ స్వామికి ఎన్ని మొక్కులు చెల్లిచ్చాను. తిరుపతి పోయినప్పుడల్లా నిలువు దోపిడీ ఇచ్చేదాన్నే! జాళ్ళపాలెం బ్రెమ్మంగారి స్వామికాడికి సంవత్సరం సంవత్సరమూ బండి గట్టుకుని పోయేమే! ఈళ్ళ గుళ్ళో నిప్పులు బొయ్య! ఎవరూ చక్రం అడ్డమెయ్యకుండానే పోయారా! ఒక్కరంటే ఒక్కరు నా మొర ఆలకించలేదు. ఏదైతే జరగకూడదని భయపడ్డానో అదే జరగడానికి సూచనలు కనిపిస్తున్నాయి. ఉజ్జోగం జేసేవాడు జీతం తెచ్చి ఇంట్లోనే ఇస్తన్నాడుగా! కాదు వాడు జీతంలోనే మిగిలిచ్చుకుంటున్నాడు. వాళ్ళాగా నాకూ పిల్లలు ఉండలేదా? నేనూ వాళ్ళ మంచి చెడులు చూడాలిగా! అందుకే రొయ్యల చెరువులు యేస్తే కాసిని డబ్బులు అదనంగా వస్తయ్యంటే వాడు కాదంటున్నాడు. వాడికేం ఉజ్జోగం చేసేవోడు ఎన్నయినా చెబుతాడు అని ఆడి మీద పెద్దాడు ఎగురుతుండాడు. యాదవ కులంలో ముసలం బుట్టినట్టు ఈడి మెదళ్లో ఏదో పురుగు బుట్టిందని అర్థమైపోతోంది. అలా ఆలోచిస్తూ ఈ కుటుంబం కూలిపోతే ఏమౌతుందో అని కుమిలిపోతూ కాగుపైన మూత కొంచెం బెసకడం గమనించుకోలేదు. అంతే! పైన మూత, దాని కింద ఉన్న గిన్నె దొర్లిపడి గంజి, అన్నం మొత్తం చేతుల మీద, కాళ్ళ

మీద పడింది. అప్పటి కప్పుడే ఒళ్ళంతా భుగ భుగమని మంటలు మండింది. చర్మమంతా కమిలిపోయింది.

"వొళ్ళు కాలిందే అమ్మో అయ్యో" అని పెద్దగా అరిచింది సుబ్బులమ్మ. దొడ్లో ఏదో పని చేస్తున్న రంగమ్మ పరిగెత్తుకుంటూ వచ్చి అక్కడ దృశ్యాన్ని చూసి కెవ్వుమని అరిచింది.

"ఎందుకే అట్ట అరుస్తావు. బువ్వంతా నేల పాలై పోయింది" ముందు అదంతా శుభ్రంగా ఎత్తేసి మళ్ళీ ఎసరు బెట్టు" అంటూ పైకి లేచింది.

"అత్తా, ముందు నీ చెయ్యి సంగతి జూడు. ఎసరు తరవాత పెడతా" అంటూ పరుగు పరుగున పోయి పడమటింట్లో పుస్తకాల అల్మారాలో ఉన్న సిరాబుడ్డి తీసుకుని మళ్ళీ పరుగు పరుగున వచ్చింది.

అత్తను మంచం మీద పడుకోబెట్టి సిరా బుడ్డి మూత తీసి కాలిన చోటల్లా సిరా వంచి చేత్తో రాసింది.

అప్పటిదాకా మంట మంట అని అరిచిం దల్లా "అమ్మా, ఇప్పుడు చల్లగా ఉందమ్మా" అంటుంటే "అబ్బా చూడు ఎంతెంత బొబ్బలె క్కినయ్యో అమ్మో" అంటూ రంగమ్మ ఏడ్చే సింది.

"ఏయ్ ఎందుకే అట్టా భయపడతావు. ఏముందక్కడ. అయ్యే తగ్గిపోతయ్యిలే. నాకేం లేదు. నువ్వెందుకు ఏడుస్తావు. ఊరుకో" అంటుండగానే చుట్టపక్కల వాళ్లం దరూ వచ్చి మూగారు.

"అయ్యో జూడు, మొకాన గూడా బొబ్బలొ చ్చాయ్. ఇవి మానేతలికి ఎన్ని రోజులు పట్టుద్దో! అయినా నీకెందుకు ఈ పనులన్నీ అంటుంటే ఇనకపోతివి. మేము ఇంత మందిమి ఉండాం కదా ఈ పనులన్నీ మేం జేస్తాం అంటుంటే ఇనకుండా పొయ్యి దగ్గర కూచుంటావు. ఏదన్నా జరిగితే మమ్మల్ని మాట అనిపించాలనేగా" పెద్ద కోడలు పుల్లవి రుపుగా నిష్టూరమాడింది.

"ఇంక సాల్లే నోరు ముయ్యవే! ఏం జరిగిం దంట. ఆ రామ్మూర్తిని కాస్త పిలవనంపండి. మీరు జేసే పనులు తరవాత చేద్దురుగానీ" మందలించినట్టుగా కసిరింది.

"ఏం సుబ్బులప్పా! ఇంకా ఈ గాడిద చాకిరీ నీకెందుకు చెప్పు. కోడళ్ళు అంతమంది ఉంటిరే! వాళ్ళు చూసుకోరా" అంటూ వచ్చింది రత్తాయి.

"ఏముందే ఎన్ని సంవత్సరాల నుండి చేస్త న్నాను. ఇయ్యాలేందో అందరూ వొచ్చి సోద్దెం లాగా చెబుతుండారు గదే! ఎప్పుడన్నా ఒక్క చుక్క వొంటిమీద పడిందా! ఇయ్యాలేందో పరధ్యానంగా ఉండాను. వొచ్చిపడ్డయ్యి. ఏముందిలే వారం రోజులకి అయ్యే చితికి పోతయ్యి. అబ్బా మంటగా ఉంది" అంటూ మంచం మీద పడుకోబోయి వీలుగాక కూర్చుండిపోయింది.

మరుసటి రోజున బొబ్బలు చితికి రసికారు తుండడంతో, ఆ గాయాలకి ఏదన్నా తగిలిన ప్పుడల్లా మంటపుట్టి పెద్దగా అరవసాగింది. "ఒళ్ళంతా నిప్పుల్లో పొర్లిచ్చినట్టు ఉందయ్యో" అంటూ ఉండగా బజారు నుంచి పెద్ద కొడుకు వచ్చాడు. ఆయన వెంట ఊరి పెద్ద రామిరెడ్డి రావడం వింతగా అనిపించింది సుబ్బులమ్మకు.

"ఏంది రామిరెడ్డి ఇట్టొచ్చావు" అనుమానం మనసులో తొలుస్తుండగా అడిగింది.

"ఆ ఏం లేదు. మీవోడు ఏదో మాట్టాడా లంటే వచ్చాను" అన్నాడు పై చూపులు చూస్తూ.

"ఏందంట ఆయన మాట్టాడేదీ, నువ్వు మాట్టాడేదీ" అరిచినట్టుగా అంది. "ఎందు కయ్యా! పక్కన పసిరిక పాములాగా జేరి పచ్చగా ఉండే కుటుంబాన్ని బుగ్గిపాలు జేస్తారు. కొందరి కళ్ళు పడితేనే పచ్చగడ్డి కూడా భగ్గుమంటదంట. అయినా ఎంత మందిని యిడదీసి పుణ్యం కట్టుకుంటారు. పోయినేడు తూర్పు బజారున ఒక కుటుం బంతో ఏరు కాపురాలు పెట్టించారు. మళ్ళీ కాలం తిరిగొచ్చిందో లేదో మా కొంపకి ఎసరు బెట్టారు" కడుపుకోత తగ్గించుకోవడా నికి నోటి కొచ్చినట్టుగా మాట్లాడింది రామి

రెడ్డిని చూస్తూ.

"ఇదుగో అమ్మా. ఆయన్ని తీసుకొచ్చింది నేను. ఎందుకు నోటికి వచ్చినట్టుగా మాట్లాడతావు" గదిమాడు కొడుకు.

"ఇప్పుడు నేనేమన్నారా. ఉమ్మడిగా ఉండే సంసారాన్ని నాశనం చెయ్యొద్దు అన్నాను. అది తప్పొచ్చిందా"

"ఇదుగో సుబ్బులమ్మా! మీ కొడుకు మాట్టాడదాం రమ్మంటే వచ్చానుగానీ, నాకేం పన్లేక రాలేదు. మిమ్మల్ని విడదీస్తే నాకేమొచ్చుద్ది" అంటూ భుజాన కండువా తీసి విదిలించి మళ్ళీ భుజాన వేసుకుని పంచె సవరించుకుంటూ వెళ్ళబోయాడు.

ఎట్టుంది నీకు? మంటలు తగ్గినయ్యా" అంటూ పక్కన కూర్చున్నాడు.

"నాకేం రోగం లేదుగానీ రామిరెడ్డి బాబాయి వొచ్చాడేందో చూడు. ఏందో మాట్టాడటానికి వొచ్చాడంట"

"ఏందంట బాబాయ్! ఏంది అమ్మ కోపంగా ఉంది" రామిరెడ్డి వైపు తిరిగి అడిగాడు సుధాకర్.

"ఏముందిరా, మీ అన్న ఇంక ఉమ్మడిగా ఉండలేనంటన్నాడు. యిడిపోవాలంటున్నాడు"

"ఆయనకంత కోరికగా ఉంటే నేను మాత్రం చేసేదేముంది. ఇంతకీ అంత



"నువ్వుండన్నా. వాళ్ల మాటలకు ఏంగానీ తీసుకొచ్చింది నేను. ఆయన్నంటే నన్నన్నట్టే ఊరుకోన్నేను" ఖరాఖండిగా చెప్పాడు తల్లితో.

"అంతదాకా వచ్చిందా! ఇంక మేం జేసేదేముంది. కానియ్యండి! జరిగేదాన్ని ఎవడు చేతులు బెట్టి ఆపగలుగుతాడు" అంటుండగా బడినుంచి సుధాకర్ కూడా వచ్చాడు.

చేతిలోని సంచీ లోపల పెట్టొచ్చి "ఏందమ్మా. ఏం జరిగింది? ఏందీ గోల.

అగత్యం ఏమొచ్చిందంటా? " సుబ్బులమ్మ వైపు చూస్తూ రామిరెడ్డిని అడిగాడు

"ఎవురి బాధలు వాళ్ళయ్యి. ఎవడి సోల వాడు కాసుకుంటే ఏ పేచీ లేదుగా! ఎవురి బాగోగులు వాళ్ళు చూసుకుంటున్నప్పుడు ఇవతలవాళ్ళు కూడా మేలుకోవొద్దా"! సూటీపోటిగా అన్నాడు అన్న శివరామయ్య.

"ఇప్పుడెవురంట అంత బాగోగులు జూసుకుని నిన్ను కాదని బావుకుని తింటోంది?

నేనేగా ఉంది. అదేదో నన్నే నేరుగా అడగొచ్చుగా!"

"ఇప్పుడు నిన్నెవురు అన్నార్రా! ఆ తూరుపు పొలం చేపల చెరువు చేద్దామంటే ఎవురికీ ఇష్టంలేదు. అప్పటికి నేను ఏ పని చేసినా మీకు ఇబ్బందిగా ఉన్నట్టేగా. నా ఆలోచన సక్రమంగా లేనప్పుడు కలిసి మాత్రం ఎంత కాలం ఉంటాం. అందుకే నా మాట నేను చెబుతున్నా ఆ తరవాత మీ ఇష్టం."

ఇష్టం వొచ్చినట్టు వాళ్ళు చేసుకోవొచ్చు"

"ఒరేయ్ ఎందుకురా మీరు మాటామాటా అనుకోవటమూ. చూసినోళ్ళకి అసహ్యంగా ఉండడమూ. అసలంటూ రాకుండా ఉండాలే గానీ పొరపొచ్చాలు వచ్చినాక ఎవడూ ఏమీ చెయ్యలేడు. చేప్పిల్లలకు ఈత నేర్పేదెవురు? ఎవడి చారెడు వాడు పంచుకోండి" తెగేసి చెప్పింది సుబ్బులమ్మ.

మిగిలిన ఇద్దర్నీ కూడా పిలిచి అడిగారు -



"కాస్త ఎనకా ముందూ ఆలోచించమనే నేను జెప్పేది. ఎవడో పెద్ద పెద్దోళ్ళు దూకుతున్నారని మనం గూడా దూకితే ఎట్ట అన్నాను. అది తప్పా. వాళ్ళకేం లక్షాధికారులు. ఒక దెబ్బ తగిల్నా తట్టుకోగలరు. మనమేడ తెస్తాం" తన వాదనను కొనసాగించబోయాడు సుధాకర్.

"పైకి పోయేవాళ్ళని జూసి నేర్చుకుంటే, మనల్ని జూసి యెనకోళ్ళు కూడా వొస్తారు గానీ, ఇట్ట ఇంట్లోవాళ్ళే ఎనక్కి లాగుతుంటే ఇంక మా పెత్తనం యేం యాడవటానికా! అందుకే ఎవరిది వాళ్ళం పంచుకుంటే, ఎవరి ఏర్లు బోతారా, కూడా ఉంటారా అని.

"మాకేం తెలుసు మా అన్నలుండారుగా. వాళ్ళెట్ట చెబితే అట్టనే. అయినా ఏర్లు పోవలసినంత అగత్యమేమొచ్చిందంట. అందరు కలిసున్నా రాత్రింబగుళ్ళు మేమిద్దరమేగా వొళ్ళరగదీసుకుంటోంది. ఇప్పుడు ఎవురికంట బాధ" ముక్తకంఠంతో ఇద్దరూ అన్నారు.

"అనంద్రా ఇంకా మీరే మిగిలుంది. నేనేగా పని జెయ్యకుండా పైపైన తిరుగుతోంది. మనుసులో లేకపోతే ఎందుకంటారు మీరైనా. ఇదయ్యా సంగతి. ఎవురికీ ఇష్టం లేదని

తెల్లంగా తెల్లారినట్టు కనిపిస్తుంది కదా! ఇంక కలిసుండడానికి నాకే కారణమూ కనిపించ లేదు" బల్ల గుద్దినట్టు చెప్పేశాడు శివరామయ్య.

రెండో కొడుకు కూడా "సరే" అన్నాడు.

సుబ్బులమ్మ ఉమ్మడి కుటుంబం కూడా ముక్కలు చెక్కలు కావడానికి సిద్ధమై పోయిందని ఊళ్లో వాళ్ళందరికీ తెలిసిపోయింది. అంతకు ముందే వేరు పడిపోయిన ఉమ్మడి కుటుంబాల వాళ్లు ఆహా వీళ్ళు కూడా మాలోకి వస్తున్నారని సంతోషంగా ఉన్నారు. ఇంకా ఉమ్మడి కుటుంబాలగానే కలిసి ఉన్న వాళ్లు, 'ఎంతో ఒద్దికగా కలిసుండేవాళ్లే విడిపోతుంటే ఆ సెగ మాదాకా తాకుద్దేమోనని' భయపడ్డారు.

సుబ్బులమ్మ భర్త కోటయ్య గొడ్ల చావిడి దగ్గర నుంచి వచ్చేసరికి వేరుపడి పోవడానికి కూడా ఒక శుభ ముహూర్తం నిర్ణయించారని తెలిసి హతాశుడైపోయాడు.

సుబ్బులమ్మ, ఆమె భర్తా ఒకరికి ఎదురుగా ఒకరు కూర్చోని మౌనంగా రోదించారు.

ఇంతకాలం ఒంటిచేత్తో లాక్కొచ్చిన సంసారం ఇయ్యాల ముక్కలు చెక్కలు కాబోతోందని సుబ్బులమ్మ ఎంత విలపిస్తోందో అంతకంటే నూరు రెట్లు లోపల్లోపల కుమిలిపోతోందని కోటయ్యకు తెలుసు.

వేరుపడడం కంటే భార్య ఆ విషయాన్ని అంత తొందరగా జీర్ణించుకోలేదనీ, అందరి మధ్యా పెత్తనం జేసిన ఆమె వేరుపడి ఎలా జీవించగలదో అర్థం గాకుండా ఉంది కోటయ్యకు.

సుబ్బులమ్మ మొహం చూసి మౌనంగా రోదిస్తున్న ఆమె మనసులోని భావాలు చదవాలని ప్రయత్నించాడు. ఆమెను పలకరించడానికి కూడా భయమేసింది.

ఆ రోజు రాత్రి ఊరి పెద్దలందరూ సుబ్బులమ్మ ఇంటి ముంగిట సమావేశమయ్యారు. బయట అరుగుల మీద జనం గుంపులుగా గుమికూడారు.

ఉన్న ఆస్తిపాస్తులన్నీ లెక్క కట్టారు. ఏ సంవత్సరం ఆదాయం ఎంతో, ఎంత ఖర్చయిందో, దేనికెంత పెట్టాడో, ఎక్కడెక్కడ బాకీ లున్నాయో మొత్తం అందరి ముందూ ఉంచాడు పెద్ద కొడుకు.

మొత్తం మీద తేలిందేమంటే డబ్బు పరంగా అప్పులు తేలాయి. దాంతో రెండో కొడుకు సుధాకర్‌కి కోపం వచ్చింది.

"ఇంతమందిమి పడి చేస్తుంటిమి. నెలనెలా జీతం తెచ్చి ఇంట్లోనే ఇస్తుంటిని. అప్పులెందు కయినియ్యంటా" తన అనుమానాన్ని ప్రకటించాడు.

"ఆ ఇచ్చేవులే జీతం. ప్రతి నెలా అది కొనాల. ఇది కొనాల. దానికిగ్గావాల దీనిగ్గావాల అంటూ అమ్మకి చెప్పి ఒడుపుగా నువ్వు తీసుకున్నదంతా లెక్క తేలిస్తే అప్పుడు తెలుసుద్ది అప్పులెందుకయ్యిందీ"

"ఇంత ఉమ్మడి కుటుంబం మీద అందరి జరుగుబాట్లూ చూడాలా! మధ్య మధ్యలో యెద్దులు సచ్చిపోవడం, బర్రెల్ని కొనడం, కొష్టాలు యేయించడం ఉండనే ఉండే. పైగా ఇప్పుడు పంటల మీద ఎంత పురుగు మందులు కొడుతోందీ తెలవడంలా. యాడేడ డబ్బంతా వాటికే తగలేస్తుంటిమే. ఆదాయం ఏటికేడాదీ తగ్గిపోతోందా. ఎన్ని తిప్పలు? నువ్వు పెత్తనం జేసుంటే తెలిసేది. అందరికీ పెళ్లిళ్ళు పురుళ్ళు ఇయ్యన్నీ లెక్కలోకి రావుగా" అన్నాడు శివరామయ్య విసురుగా.

"ఆ నేను జేసుంటే ఏమీ పంచియ్యకపోయినా అప్పు మాత్రం చూయించేవాణ్ణి కాదు" సుధాకర్ వెటకారంగా అన్నాడు.

"అయితే ఏందిరా నువ్వనేది? నేనే మింగానంటావు. సరేపో, అట్నే అనుకో పో. ఇన్ని సంవత్సరాలు కష్టపడి సంసారాన్ని నెట్టుకొచ్చినందుకు ఎవరెట్టా పోయినా, యాడ తిరిగినా కుటుంబాన్ని చూసినందుకు మంచి బిరుదే ఇచ్చార్లే. ఆ మాత్రం శాస్తి జరగాల్సిందే" పెద్ద కొడుకు బాధ పడడం చూసి సుబ్బులమ్మ తట్టుకోలేకపోయింది.

ఎవరు తప్పు జేసినా ఊళ్ళో అందరి

ముందూ ఈ విధంగా రచ్చకెక్కడం, నిన్నటి దాకా కలిసి మెలిసి ఉన్నవాళ్లు ఇప్పుడు పోట్లాడుకోవడం ఏం బాగా లేదు.

"అసలు అప్పు ఎందుకయిందో ముందు అది తేల్చండి. ఆ లెక్కలన్నీ సరిగా చూడండి. అప్పటిదాకా భాగాలు పంచడానికి లేదు" అంటూ సుధాకర్ అడ్డం తిరిగాడు.

"ఏహే అరవబాకండే. ఎవడు తిన్నది వాడు తిన్నాడు. వాములు తినే స్వాములకి పచ్చిగడ్డి పలారమా. ఇంకూరుకోండి. ఎవడి భాగాలు వాడికియ్యండి" మూడో కొడుకు మాలకొండయ్య కోపంగా అన్నాడు.

"వాడు చెప్పినట్టే కానియ్యండయ్యా. అయిపోయిందేదో అయిపోయింది. ఇంత కాలం ఎవుడెట్టా చేశాడో చేశాడు. అయిపోయిన పెళ్ళికి మేళాలెందుకు. ఏదో జరపాల్సినవన్నీ జరిపాడు. చెయ్యాల్సినియ్యి ఏయో చేశాడు" సుబ్బులమ్మ అంది.

"ఆ జరిపేళ్ళే. వాళ్ళకి కావాల్సినియ్యి మంచి మంచియ్యి తెచ్చుకోని మా మొకాన ఏదో ముష్టి పార్నాకినట్టు పార్నాకాడు" సుధాకర్ కసిగా అన్నాడు.

"ఇదుగో, ఎవడు చెప్పాడో ఆడోళ్ళలాగా దెప్పి పొడవమని. ఇంక మాట్టాడితే బాగుండదు."

"ఏం జేస్తావంట బాగుండకపోతే!"

"ఏం జేసేది చూపిస్తా. ఏదన్నా ఉంటే ఆనాడే అడిగి ఉండాల్సింది, బుద్ధుండోళ్లెవురూ ఇట్లా మాట్లాడరు"

"ఆనాడే అడిగితే సరిపోయేది. ఆనాడే పీడా వొదిలిపోయేది" శివరామయ్య, సుధాకర్ మాటకి మాట విసురుకుంటూనే ఉన్నారు.

"ఎవుర్రా పీడ! మర్యాదగా మాట్లాడు" అంటూ తమ్ముడి పైకి దూకాడు శివరామయ్య.

సుధాకర్ కూడా ఏమాత్రం తగ్గకుండా ముందుకు రెండు అడుగులు వేశాడు. ఒక్క క్షణం ఎవరూ కల్పించుకోకపోతే చేతులు చేతులు కలిసేయే.

అయితే కోటయ్య మధ్యలోకొచ్చి "అయ్యా మీకు దణ్ణం పెడతాం. ఇప్పటికే సగం సచ్చిపోయుండాం. సచ్చిన పాముల్ని ఇంకా ఏం సంపుతారు "వేరుపడతన్నామంటేనే ఊళ్ళో తలెత్తుకోలేకుండా ఉన్నాం. ఇంకా కలెబడి కొట్టుకుంటే మేము బోయి ఆ ఉప్పునీళ్ళ బాయిలో దూకితే మీ కళ్ళు సల్లబడతయ్. మా మానాన మమ్మల్ని వొదిలేసి, మీది మీరు పంచుకోని పోండ్రా నాయన్లారా" అంటూ చేతులెత్తి దణ్ణం పెట్టాడు.

సుబ్బులమ్మకు గాయాల సలపరింత కంటే కొడుకులు గొడవ పడటం మరింత బాధగా అనిపించింది. కడుపులో ఎవరో చెయ్యిబెట్టి దేవినట్టు అనిపించింది

మధ్యలో పెద్ద మనుషులు కూడా, "మమ్ముల్ని ఇక్కడ కూర్చోబెట్టి మీరు పోట్లాడుకునే పనైతే మేమెందుకు ఇంక వెళతాం" అనడంతో ఇద్దరూ తగ్గారు.

సుబ్బులమ్మకు గాయాల సలపరింత కంటే కొడుకులు గొడవ పడటం మరింత బాధగా అనిపించింది. కడుపులో ఎవరో చెయ్యిబెట్టి దేవినట్టు అనిపించింది.

ఇంతకాలం నా కుటుంబం, నా కొడుకులు, నా కోడళ్ళు ఎంత బుద్ధిమంతులో, ఏది చెబితే అది వింటారనీ, నా మాట జవదాటరని డబ్బా కొట్టుకుని చెప్పుకున్నాను. ఇప్పుడు నా మాటకే తలవొంపులు తెచ్చారని అనుకునేసరికి కళ్ళనుండి కన్నీళ్ళు ధారాపాతంగా కారి చెక్కిళ్ళు మీద నుండి పైట చెంగుమీద పడి తడిసిపోసాగింది.

అది చూసిన చివరి కొడుకు నారాయణ

తల్లి దగ్గర కొచ్చి మంచం మీద కూర్చొని "ఏడవబాకమ్మ, వాళ్ళు పోయినా మేమెక్కడికి పోం. మేమిద్దరం మీతోటే ఉంటాం" అంటూ ఓదార్చాడు.

ఆస్తులు అన్నీ పంచిన తరువాత "ఇల్లు కూడా నాలుగు వాటాలు వెయ్యాలి గదా" అన్నారు పెద్ద మనుషులు.

శివరామయ్య నాకు ఇంటితో పనిలేదు. ఇంటి బదులు పొలం తీసుకుంటానన్నాడు.

"నాకు గూడా వద్దు. ఉజ్జోగం చేసే దగ్గిరే కాపరం ఉంటాను. నాకు మాత్రం ఎందుకు? " అన్నాడు సుధాకర్.

"సరే అయితే. ఇల్లు వాల్యుయేషన్ యేద్దాం. చిన్నోళ్ళిద్దరూ ఇల్లు తీసుకుంటారు. పెద్దోళ్ళు ఆ వాల్యుయేషన్ ప్రకారం పొలం దీసుకుంటారు. ఏమయ్యా" అంటూ చిన్న వాళ్లిద్దర్ని అడిగారు పెద్దమనుషులు.

"అట్టనే కానియ్యండి. వాళ్ళిష్ట మెచ్చినట్టు కానిచ్చి తొందరగా నిప్పు పెట్టండి. ఈ తంతు చూస్తంటేనే తలకాయ బద్దలైపోతోంది" సుబ్బులమ్మ కొడుకులవైపు చూసింది.

పెద్ద మనుషులు పొలం ఇల్లు వాటాలేసి ఎవరికి రావలసినవి వాళ్ళకి పంచిచ్చారు.

పొలం వాటాల ప్రకారం పెద్దోళ్ళు పై నుండాల అనే సిద్ధాంతం మీద మొదటి వాళ్ళిద్దరికీ మంచి వాటాలు వచ్చాయి. తాము కోరుకున్నదీ అదే, అయ్యవారూ పెట్టిందీ అదే అన్నట్టుగా లోలోన తెగ సంబరపడి పోయారు వాళ్లిద్దరు.

'పెద్దోళ్ళిద్దరూ ఎవురికి వాళ్ళు బాగానే మిగిలిచ్చుకుని మూటలుకట్టుకోవడమే గాకుండా వాటాలు కూడా వాళ్ళకు కలిసివచ్చినై. ఎటొచ్చీ చిన్నవాళ్ళిద్దరికీ వాళ్ళ అమాయకత్వానికి తోడు వాళ్ళకొచ్చిన వాటాలు కూడా అట్టనే వచ్చాయని' ఊళ్ళో వాళ్ళందరూ వాపోయారు. అయినా చిన్న వాళ్ళిద్దరూ దాన్ని లక్ష్యపెట్టలేదు. 'భూమి పండాల, మనం తినాలగానీ ఇట్టాంటియ్యి ఒకలెక్కా. మా అన్నలే తిన్నారు కానీ ఊళ్ళో వాళ్ళు ఎవురూ తినలేదుగా' అన్నారు.

వాళ్ళ మాటలు విన్న సుబ్బులమ్మ, కోటయ్య ఎంతో పొంగిపోయారు. ఇద్దరు కొడుకులు అట్టైనా, ఇటు ఇద్దరు కొడుకుల కొండంత ఔదార్యానికి ఆకాశానికి ఎగిరినంత సంతోషపడిపోయారు. చేతివేళ్ళు ఐదూ ఒకే రకంగా ఉండవు కదా. అట్టాగే బిడ్డలు కూడా అనుకున్నారు.

"ఇంతకీ ముసలోళ్ళ సంగతేంది? " అన్నారు పెద్దలు కొడుకుల వంక జూసి. పెద్ద కొడుకులిద్దరూ ఏం మాట్లాడకుండా మౌనంగా ఉన్నారు. చిన్నోళ్ళు మాత్రం "వాళ్ళు ఈ ఇంట్లో నుండి ఎక్కడికీ పోరు. ఎవురికి అవసరమున్నా లేకపోయినా వాళ్ళిద్దరూ లేకుండా మేం బతకలేం" అన్నారు.

అందరూ వాళ్ళిద్దర్నీ అభినందన పూర్వకంగా చూశారు.

పెద్దవాళ్ళిద్దరికీ అందరి ఆస్తిలో నుండి తలా కాస్త వేసి ఒక వాటా ఇవ్వాలన్నారు.

"వాళ్ళేమన్నా పంచుకోడానికి అన్నదమ్ములేం గాదులే. ఎవురి వాటాలూ అక్కర్లేదు. వాళ్ళని పోషించుకోవడం గూడా పెద్దపని లాగ వాటాలేస్తారా ఏం అక్కర్లేదు" మూడో కొడుకు మాలకొండయ్య గయ్‌మన్నాడు. సుబ్బులమ్మకు గుండెలమీద తొలకరి చినుకులు పడినంత ఆనందంగా అనిపించాయా మాటలు.

"మీరు వాళ్ళకి చెయ్యండి. వాళ్ళచేత మీరు చేయించుకోండి. మీరు మీరు ఎట్టన్నా జేసుకోండి. ఏం సుబ్బులమ్మా సరేనా" అన్నారు పెద్దలు.

"ఈ కట్టె ఈడ బూడిద కావాల్సిందే. పుట్టినూరు వొదిలి యాడకన్నా పోవాల్సొస్తే పేణం వొదిలిపెట్టి వొట్టి కట్టె పోవాల్సిందే" బాధగా చెప్పింది సుబ్బులమ్మ.

అలా ఊరందరి సమక్షంలో ఊరి పెద్దల చేతుల మీదుగా ఇంకో ఉమ్మడి కుటుంబం ముక్కలు చెక్కలయ్యింది.



ఇద్దరు కొడుకులూ ఆస్తులు పంచుకుని వెళ్ళిపోయిన తరువాత సుబ్బులమ్మ పెత్తనం చెయ్యాల్సొచ్చింది. పంపకాలయిపోయాక చిన్న కొడుకులిద్దరినీ ఒకే ఇంట్లోనే ఉంచి వాళ్ళచేత వ్యవసాయం చేయించడం మొదలు బెట్టింది.

మూడో కొడుకు మాలకొండయ్య అంతకు ముందూ వ్యవసాయం చేసేవాడు. అయితే పెద్దన్న చెబుతుంటే తూచా తప్పకుండా పాటించేవాడు.

ఎక్కడ ఎరువు వెయ్యాలో, ఏ విత్తనాలు వాడాలో, ఏ పురుగు మందులు ఎప్పుడు కొట్టాలో, ఎప్పుడు కలుపులు తియ్యాలో చేలో ఎప్పుడు తేమగా ఉండాలో, ఏ అదునులో పని ఆ అదునులో దగ్గరుండి చేయించేవాడు. కష్టపడి గొడ్డుచాకిరీ చేసేవాడు మాలకొండయ్య.

విత్తు వేసింది మొదలు పైరు పెరగడం, పంట రావడం పండిన పంట కల్లానికి చేరడం, అక్కడ నుండి ఇంటికి రావడం, అందరికంటే ఎక్కువ ధరకు అమ్మడంలో పెద్దన్న తెలివితేటలు, అనుభవం కలగలిసి ఉండేవి. ఆ విధంగా మార్గం చూపించు కుంటూ పోవడం వల్ల వ్యవసాయంలో మాల కొండయ్య మొనగాడనిపించుకున్నాడు.

వేరుబడ్డ మొదటి సంవత్సరం స్వంతంగా పెద్దన్న లేకుండా మాలకొండయ్య నారాయణ ఆసరాతో వ్యవసాయం మొదలుపెట్టాడు.

అన్ని సంవత్సరాల నుండీ వ్యవసాయం చేస్తున్నప్పటికీ ఏదో అప్పుడే కొత్తగా వ్యవ సాయం మొదలుబెట్టిన వాడిలాగా తడబ డ్డాడు.

సేద్యాలు మొదలయ్యాయి. అందరికీ ఇంత కుముందు తను సలహాలు చెప్పేవాడు. ఇప్పుడు పరిస్థితి తారుమారయ్యింది. ప్రతి చిన్న విషయమూ ఇతరులని సలహా అడగ కుండా చెయ్యలేకపోతున్నాడు.

"అమ్మా! అన్న లేకుండా నేను వ్యవసాయం చెయ్యలేనేమోననిపిస్తోందే!" అన్నాడు తల్లితో.

"పిరికితనంగా ఉండగూడదయ్యా మాల కొండా! అన్న ఉన్నప్పుడైనా అన్ని పనులూ చేసింది మీరిద్దరే. ఇప్పుడు కూడా తమ్ముణ్ణి వెంటబెట్టుకుని వ్యవసాయం చెయ్యాల. నేనుపోతే వీళ్ళకు జరగదు అన్నట్టుగా వెళ్ళి పోయిన వాళ్ళకు తలకొట్టేసినట్టుగా వ్యవ సాయం చెయ్యాల"ని ఎంతగానో హితబోధ చేసింది సుబ్బులమ్మ.

అవసరాన్ని బట్టి ధైర్యం తెచ్చుకున్నాడు మాలకొండయ్య. అన్నీ తెలిసిన పనులే అయినా కొత్తగా అనిపిస్తున్నాయి.

స్వంతంగా చెయ్యాల్సి వచ్చేసరికి ఒకటికి పదిసార్లు ఆలోచించాల్సి వస్తోంది. ఎప్పుడూ ఏ నిర్ణయమూ తీసుకోని మాలకొండయ్య ప్రతి విషయమూ తల్లిని అడుగుతున్నాడు. ఆమె సలహాతో సంప్రదింపులతోనే ఆ సంవ త్సరం వ్యవసాయమంతా చేశాడు.

అయితే అందరికీ బాగా దిగుబడి వచ్చినా పంటలన్నిట్లో తనకు దిగుబడి తగ్గిపోయింది.

అందరికీ పొగాకులో మంచి లాభాలొస్తే తనకు నష్టం వచ్చింది. ఇట్టాంటి వ్యవ సాయం చేస్తే ఏం? చెయ్యకపోతే ఏం? అందరూ అంత లాభాలొచ్చి సంతోషిస్తుంటే, తను ఏడుస్తూ కూర్చోవడమేంటి? అని తల్లితో చెప్పి తెగ బాధపడిపోయాడు.

"అప్పుడే చెప్పానురా నీకు. అన్న చెప్పేట ప్పుడే అన్నీ నేర్చుకో అని. ఆనాడేమన్నావు నాకెందుకులేమ్మా అన్న ఉన్నాడన్నావు. నా మాట విని అన్నీ నేర్చుకుంటే ఇయ్యాల ఇట్టా జరిగేదా!" తల్లి చివాట్లు.

"ఆయన చెబుతున్నాడు. నువ్వు చేస్తు న్నావు. అంతేగానీ మంచీ సెడ్డరలు ఎప్పు

డైనా ఆలోచించావా! ముందుచూపు లేకపోతే ఇదుగో ఇట్టనే కూలబడుతుంది" భార్య దెప్పి పొడుపు.

దాంతో మాలకొండయ్యకు ఎక్కడలేని రోషం పొడుచుకొచ్చింది. "చేసే కష్టమేదో చేశాం. వచ్చిన నష్టానికి నాదా బాధ్యత. ఎట్టంటే అట్ట అడ్డంగా మాట్లాడితే ఊరుకునేది లేదు" భార్యమీద వంటికాలితో లేశాడు.

"నువ్వే నెట్టా? మేం గూడా చేశాం. అందరం జేస్తేనే ఈడ ఇంతకాలం అందరూ తైతక్కలాడింది. ఎవురూ తినకుండా బువ్వాడ బెట్ట బుగ్గలాడించలా. అందరూ చేస్తున్నారు. అందరూ పడి తింటున్నారు" మాటకు మాట సమాధానమిచ్చింది భార్య.

అసలే అవమానంతోనూ, బాధతోనూ, ఉక్రోషంతోనూ ఉండడంతో, ఆమె పుల్లవిరుపు మాటలకి కోపం నషాళానికి అంటింది. మళ్ళీ మాట్లాడేవంటే మొహం పగిలిపోతుందని కొట్టడానికి మీదకెళ్ళాడు.

ఇప్పుడు నేనేమన్నానని అంత లావున నా మీద కలియబడడం. అందరూ చూడు వ్యవసాయాల్జేసి లాభా లెట్టా తీశారో! అంతా తెలిసి మనకెందుకీ గాశారం

"ఇప్పుడు నేనేమన్నానని అంత లావున నా మీద కలియబడడం? అందరూ చూడు వ్యవసాయాల్జేసి లాభా లెట్టా తీశారో! అంతా తెలిసి మనకెందుకీ గాశారం. అందరి సంసారాలూ ఇలాగే ఉన్నాయా? మీ అన్నలిద్దరూ వాళ్ళపాటికి వాళ్ళు పోయి వాళ్ళ దారేదో వాళ్ళు జూసుకున్నారు. ఎటు తిరిగీ అప్పుల్లో మునిగిపోయింది మనమేగా" ముక్కు ఎగబీలుస్తూ వెక్కివెక్కి ఏడుస్తూ ఆరుబయట మంచమ్మీద పడుకుంది.

మాలకొండయ్య కూడా అలిగి ఇంకో మంచమ్మీద పడుకున్నాడు.

ఈ విషయం గమనించిన సుబ్బులమ్మ కోడలి దగ్గరికొచ్చి "ఎందుకమ్మా మనం తగువులు పడితే ఎదుటోళ్ళకి చులకన కామా! ఇప్పటికే మనల్ని జూసి నవ్వుకుంటున్నారు. లేవండి లేసి నీళ్ళు బోసుకొని కూళ్ళు తినండి. జరిగిపోయిందానికి ఏం జేస్తాం" అని కోడలికి సర్దిచెప్పింది.

అయినా ఆమె లేవలేదు.

"అమ్మాయ్, లే నువ్వు లేస్తే గదా వాడూ లేసేది" కేక వేసింది.

"ఒకపూట తినకపోతే చావంలే" అంటూ అటు పక్కకు తిరిగి పడుకుంది కోడలు.

"నువ్వు లేవరా! రంగమ్మా! బావకి నీళ్ళు తోడమ్మా, పోసుకుంటాడు" అనడంతో రంగమ్మ నీళ్ళు తోడి దొడ్లో బెట్టి వచ్చింది.

మాలకొండయ్య స్నానం చేసి వచ్చాడు. సుబ్బులమ్మ దగ్గర కూర్చుని అన్నం పెడుతూ, "అట్టా కసురుకుంటే ఎట్టారా? ఎవర్కైనా బాధే కదా!" అంటూ సర్దిచెప్పింది.

అప్పటి నుండీ సుబ్బులమ్మకు ఆలోచన ఎక్కువైంది. వచ్చిన నష్టం ఎలాగూ వచ్చింది. అందుకు కొడుకు చాలా బాధపడుతున్నాడు. దీనికి తోడికోడలు కాస్త దురుసు మడిసి. ఆమె ఎప్పుడూ ఏదో ఒక వంక పెట్టుకుని సతాయిస్తూనే ఉంటుంది.

ఈ సమస్య ఎటువైపు నుంచి ఎటు వస్తుందో అర్థం గాకుండా ఉంది. వీళ్ళే ఇలా ఉంటే కడగొట్టోడూ, వాడి పెళ్ళాం ఇంకెంత బెంబేలు పడిపోతారోనని ఆందోళన చెందింది సుబ్బులమ్మ.

అసలే కొడుకులు అప్పులు మోపిపోయె. ఉన్నవాటికి తోడు వ్యవసాయంలో కూడా నష్టమొచ్చి కొత్త అప్పులు తెచ్చి పెట్టింది అనుకుంటూ బెంబేలు పడింది. రెండో సంవత్సరం మొదట్లో పెద్ద కొడుకు తన పొలాన్ని అమ్మకానికి పెట్టాడు.

తమ్ముళ్ళేమన్నా తీసుకుంటారేమో కనుక్కుని రమ్మని మధ్యవర్తుల్ని పంపించాడు.

ఆ మాటే మధ్యవర్తి సుబ్బులమ్మలకు చెప్పాడు.

"చేలో చేను కలుపు కోవడం బాగానే ఉంటుంది. కానీ ఇప్పుడున్న పరిస్థితుల్లో ఆ

పొలం కొనాలన్నా అప్పు చెయ్యాల్సిందే! ఉన్న అప్పులకి అవి కూడా కలిస్తే తడిసి మోపెడ వుతుంది. వడ్డీతోటి వడికాళ్ళ గుర్రం కూడా పరిగెత్తదు. మళ్ళీ ఈ సంవత్సరం పెట్టుబడికి చేయి చాచాల్సిందే. ఈ సంవత్సరం పంటొచ్చిందాకా ఆగుతాడేమో కనుక్కోమని" మధ్యవర్తికి చెప్పి పంపింది.

"ఆయన ఈ సంవత్సరం చేపల చెరువు తీస్తే లాభాలొచ్చినియ్యంట. ఈ సంవత్సరం కొత్త చెరువులు కూడా కొని టైగర్ రొయ్యలు వెయ్యాలనుకుంటన్నాడంట, మీరు తీసుకుంటే తీసుకోండి. లేకుంటే కుంచాలోళ్ళు తీసుకుంటారంట" అని కబురు మోసుకొచ్చాడు మధ్యవర్తి.

"సరే ఇంక మేమేం జేస్తాం అమ్ముకుంటే అమ్ముకోమని" చెప్పింది సుబ్బులమ్మ.

ఆ సంవత్సరమే శివరామయ్య పొలాన్ని అమ్మేశాడు. తమ చేలోకి ఇంకొకరు రావడం కూడా మాలకొండయ్యకు తల కొట్టేసినట్ట య్యింది.

మరుసటి సంవత్సరం ఈ మార్పులన్నీ దిగమింగుకొని తొలకరి ప్రారంభమయ్యింది. రైతులు బ్యాంకుల్లోనూ, వడ్డీ వ్యాపారస్థుల దగ్గర అప్పులు తెచ్చుకోవడం మొదలు బెట్టారు.

ఆదిలోనే హంసపాదు ఎదురైనట్టు వెంట వెంటనే రెండు సంఘటనలు జరిగాయి. కోటయ్య చనిపోయాడు. బంగారం వంటి ఎలపటెద్దు చచ్చిపోయింది. మాలకొండయ్య మరింతగా కుంగిపోయాడు. ఇంటిల్లిపాదీ పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టుకోలేదు. ఎప్పుడూ వెన్నుదన్నుగా ఉండే పెనిమిటి చనిపోవడం ఇంట్లో పెద్ద లోటుగా అనిపించింది సుబ్బులమ్మకి.

అప్పటికే వ్యవసాయానికని బోల్డన్ని అప్పులు చేయడంతో మాలకొండయ్యకు, సుబ్బులమ్మకూ ఏ దిక్కు దరీ తోచలేదు. అమ్మ దగ్గర కూర్చుని చిన్న పిల్లాడులాగా రోదించాడు మాల కొండయ్య సుబ్బులమ్మ కూడా ఆ ఊహించని పరిణామానికి ఉక్కిరిబిక్కిరి అయిపోయింది.

మళ్ళీ ఎద్దును కొనకుండా సేద్యం ముందుకు సాగే పరిస్థితి కనిపించలేదు. దానికి కూడా మళ్ళీ అప్పు తేవాల్సి వచ్చింది.

ఆ సంవత్సరం సేద్యాలు పూర్తయి పొలాల్లో పైర్లు పడేసరికి అంతకు ముందువీ, ఈ సంవత్సరానివీ అన్నీ కలిసి అప్పులన్నీ తడిసి మోపెడయ్యాయి.

దురదృష్టం వెన్నంటే ఉందేమో ఆ సంవత్సరం వచ్చిన పంట దిగుబడి కూడా నష్టాల్నే తెచ్చింది. మాల కొండయ్యకు సహనం చచ్చిపోయింది. తనమీద తనకే రోజు రోజుకి అపనమ్మకం పెరిగిపోతోంది.

ఇవన్నీ గమనిస్తున్న అతడి భార్యకు కూడా చాలా బాధగా, అందరి దృష్టిలో తక్కువ కావడంతో నామోషీగా అనిపిస్తోంది. అందరికీ లాభాలొచ్చినా తమకు నష్టాలు వస్తుండడంతో మొగుడి మీద చిన్నచూపు ఏర్పడింది. చుట్టూ అందరూ తమని చేతగాని వాళ్ళలాగా చూస్తూ నవ్వుతున్నట్టుగా అవమానంతో దహించుకుపోయింది.

ఆ ప్రభావం మాలకొండయ్య మీద పడింది. ఏ కాస్త సందు దొరికినా మాలకొండయ్యను చేతకాని వాడిలాగా సూటి పోటి మాటలతో వేధించడం ఎక్కువయింది. చుట్టుపక్కల ఇళ్ళ వాళ్లు, పొలాల వాళ్లు తమకు పండిన పంటల గురించి చెప్పుకుంటూ ఆనందంగా మురిసిపోతుంటే ఆమెకు పుండుమీద కారం చల్లినట్లుగా ఉండి ఉడుక్కునేది.

అచ్చిరాని వ్యవసాయం తోటీ, పెరుగుతున్న అప్పుల తోటీ వ్యవసాయం చెయ్యాలంటేనే భయం ఏర్పడిపోయింది మాలకొండయ్యకి.

ఆ సంవత్సరం పెద్దన్న శివరామయ్య ఎక్కడెక్కడ ఉన్నదంతా తెచ్చి రొయ్యల చెరువుల మీద పెట్టాడు. ఊళ్లో అందరూ ఆయన గురించే చెప్పుకుంటున్నారు. ఆయనకి ఈ సంవత్సరం అన్ని లక్షలు వస్తయ్యి ఇన్ని లక్షలు వస్తయ్యని చెప్పుకుంటుంటే తన అన్న తెలివి సామాన్యమైంది కాదని, అనవసరంగా

ఆయన చేసే పనిని రెండో అన్న చెడగొట్టా డని, లేకుంటే వ్యవసాయం దెబ్బ తినేది కాదని, రొయ్యల చెరువుల మీదా లాభాలొచ్చే వని అనుకుంటూ బాధపడ్డాడు మాలకొం డయ్య.

ఇప్పుడైనా అన్నకి లాభాలొస్తే ఆయన దగ్గర డబ్బులు తెచ్చుకునే స్వతంత్రం నాకు లేదా ఏంటి? ఈ సంవత్సరం పెట్టుబడికి ఆయన దగ్గరే తెచ్చుకోవచ్చని ఉత్సాహంగా అనుకున్నాడు.

**అయితే ఆ ఆశ కూడా తారుమారయ్యింది. శివరామయ్య, రొయ్య పంటేసిన రెండు నెల లకే సరైన టైములో మందులూ అవీ కొట్టక పోవడం వల్ల వైరస్ సోకి చెరువులు దెబ్బ తిన్నాయని విని మాలకొండయ్య జావ కారి పోయాడు.**

ఆ సంవత్సరం పత్తి పంటకు బాగా గిరాకీ పెరగడంతో అందరి దృష్టీ ఆ పంట మీదకు పోయింది.

ఊళ్లో అందరూ వేలం వెర్రిగా ఆ పంటే వెయ్యాలని నిర్ణయానికి వచ్చారు.

"ఏంరా మాలకొండయ్యా ఈ సంవత్సరం అందరూ పత్తి మీదకి పోయేరు. మీ సంగ తేంటి?" తూరుపు పక్క చేను వెంకటసు బ్బయ్య అడిగాడు.

"అదే బాబాయ్, ఆలోచిస్తున్నాను. సేద్యం ఎక్కడిదక్కడ వెనక్కి లాగుతోంది. మళ్లీ ఈ సంవత్సరం ఈ కుంపటి నెత్తిమీద పెట్టు కుంటే ఎట్టాగా అనిపిస్తోంది" అన్నాడు.

మాలకొండయ్యకు పత్తి వేసే ఉద్దేశం లేదని తెలుసుకున్న భార్య అగ్గిమీద గుగ్గిలం అయ్యింది.

"ఊరంతా ఒక దారైతే ఉలిపి కట్టెది ఒక దారని, దేశమంతా పత్తో పత్తో అని కలవరి స్తుంటే మనం వెయ్యకుండా ఏం జెయ్యా లని? కాలం కలిసొచ్చి ఆ భగవంతుడు కళ్లు తెరిచి పత్తి బాగా అయ్యిందంటే అంతకంటే కావాల్సిందేముంది. అప్పులన్నీ తీర్చుకోవొచ్చు" అని రుసరుసలాడడమే కాదు, గట్టిగా పట్టు పట్టింది. ఆమె చెప్పే ధైర్యం మాలకొండ య్యలో కొత్త ఆశల్ని చిగురింపజేశాయి.

ఏ లాభం లేకుండా దేశమంతా ఎందుకే స్తారు. ఒకవేళ తను వెయ్యకపోతే ఈసారి కూడా అందరూ లాభం పొంది తను నష్టపో తానేమో అనుకున్నాడు.

పత్తి పంటతోనైనా ఊబిలోనించి పైకి లేస్తామేమో అన్న గంపెడాశ అమితోత్సా హాన్ని కలిగించింది. దాంతో అందరితో పాటూ మాలకొండయ్య కూడా పత్తేశాడు.

అయితే ఆ సంవత్సరం ఎక్కడెక్కడి వాళ్లంతా కొత్తగా పత్తి వెయ్యడంతో మామూ లుగా మార్కెట్లో ఉన్న విత్తనాలు సరిపో లేదు. దాంతో అక్కడెక్కడినుండో కొత్త కొత్త రకాల పత్తి విత్తనాలు దిగుమతి అయ్యాయి. రకరకాల పురుగుమందులు మార్కెట్‌ని ముంచెత్తాయి. సమయానికి దొరికిన విత్త నాల్ని వెయ్యాల్సి వచ్చింది. మొక్కలు మొలిచి, ఎదిగేటప్పుడు మామూలు పంటల కంటే అధికంగా పురుగుమందులు వాడాల్సి రావడంతో ఎక్కడెక్కడి డబ్బులన్నీ తెచ్చి పత్తి పంటమీద పెట్టారు.

చెట్లు బాగా ఏపుగా పెరిగాయి. అయితే ఒక్క కాయ కాయకపోవడంతో రైతులంతా గగ్గోలు పెట్టారు. కాయ పుట్టినవాళ్లకేమో పురుగులు చావలేదు. రైతులు బెంబేలు పడి పోయారు.

అసలు కంటే నకిలీలు రాజ్యమేలడంతో



విపరీతంగా నష్టపోయామని తెలుసుకున్న రైతులు హతాశులయ్యారు.

ఏ ఊరిలో చూసినా మొక్కలు పెరగలేదనీ, పెరిగిన మొక్కలకు కాయలు లేవనీ, కాయలుంటే పురుగులు తొలిచి పంటను నాశనం చేశాయనీ, అలో లక్ష్మణా అంటూ అల్లాడిపోయారు.

ఎప్పుడూ అనుభవించని ఆ బాధలు ఎవరికీ చెప్పుకోవటానికే లేకుండాపోయింది. పండిన పత్తి కూడా మంచిది కాకపోవడంతో అది కూడా అమ్ముడుపోలేదు. ఊరంతా ఒక రకమైన నిరాశ నిస్పృహలు కమ్మేశాయి.

అప్పుడు మొదలైంది సరికొత్త విషాద పర్వం. మొదట ఎక్కడో మారుమూల గ్రామంలో ఒక రైతు పురుగుమందు తాగి ఆత్మహత్య చేసుకున్నాడు. ఆ విధంగా మొదలైన చావులు నిత్యకృత్యంగా మారాయి. ఆ ఊళ్ళో ఇంతమంది చచ్చిపోయారనీ, ఈ ఊళ్ళో అంతమంది చచ్చిపోయారనీ జనం గగ్గోలు పెడుతున్నారు. ప్రతిరోజూ ఆత్మహత్య వార్త లేకుండా పేపర్లు రావడం లేదు.

ఏ ఊరు చూసినా ఏ వాడ చూసినా, ఏ రైతు నోట విన్నా ఇదే మాట ఇదే పాట అయింది.

మాలకొండయ్యకు ఊపిరాడలేదు. ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. అటు అన్నలు దూరమైపోయినా కొంతకాలం బాధపడ్డాడు, మర్చిపోయాడు. ఇటు అప్పులపాలయినా ఏదోరకంగా తట్టుకున్నాడు. తమ్ముడు ఉన్నా ఆర్చేవాడూ తీర్చేవాడూ కాదు. అమ్మకి తెలిసింది చెప్తుంది. అయినా అక్కరకు రాలేదు. ఎన్నో ఆశలు పెట్టుకున్న పత్తిపంట సర్వానాశనం చేసేసింది. లేవలేనంతగా పాతాళానికి తొక్కేసింది.

భార్య ప్రతి మాటా నిర్లక్ష్యంగా మాట్లాడటం మొదలుపెట్టింది. లేస్తే తప్పు, కూర్చుంటే తప్పు. ఏమాట మాట్లాడబోయినా అడ్డం గొట్టడం అలవాటయింది. ఆమె మాట్లాడే ప్రతి మాటలో హేళన చేస్తోంది.

ఆ రోజు రాత్రి భార్య గట్టిగా ఎదురు తిరిగింది. "ఎంతకాలం ఇట్లా అప్పులోళ్ళతో నానా మాటలు అనిపించుకోవాలి. నువ్వు ఎందులో చెయ్యిపెట్టినా మసైపోతోంది. ఎవరన్నా వెనకమాల ఉండి



## నిద్రను మించింది లేదోచ్

"సుఖవంతమైన నిద్ర సగం రోగాన్ని తగ్గిస్తుంటారు"...

నిజమేనండీ! మరి నిద్ర తక్కువైతే... కలిగే అనర్థాలు ఇలా ఉంటాయంటున్నారు శాస్త్రవేత్తలు. ప్రతి రోజు రాత్రి ఐదు గంటలు నిద్రించే వాళ్ళలో 15% ఎక్కువగా "ఘెలిన్" ' (ఆకలిని పెంచే హార్మోను), 15% తక్కువగా "లెప్టిన్" (ఆకలిని తగ్గించే హార్మోను) విడుదలవుతాయట. వీటి ప్రభావం వలన శరీరం సన్నబడి, బలహీనంగా తయారవుతుందట. పన్నెండు గంటలు నిద్రించే వాళ్ళలో జ్ఞాపకశక్తి పెరుగుతుందంటున్నారు హార్వార్డ్ యూనివర్సిటీ శాస్త్రవేత్తలు. పియాన్, కీబోర్డు ప్లేయర్స్‌కి మంచి నిద్ర తర్వాత జ్ఞాపకశక్తి పెరిగి, అలవోకగా నోట్స్‌లు, స్కేల్స్ బాగా గుర్తొస్తాయట. సరిగా నిద్రపట్టని వృద్ధులు, డిప్రెషన్‌తో బాధపడే వాళ్ళలో తక్కువ వ్యాధి నిరోధక తెల్లకణాలున్నట్టు గుర్తించారు. మనం నిద్రించే సమయంలో "మెలాంటానిన్" అనే యాంటీ ఆక్సిజన్ శరీరంలో విడుదలౌతుంది. ఇది క్యాన్సర్ వ్యాధిని నియంత్రిస్తుందట. రాత్రి డ్యూటీలు చేసేవాళ్ళలో మెలకువగా ఉండే సమయం, నిద్రించే సమయాల్లో మార్పులు వస్తుంటాయి. ఇలా వేళల మార్పు వలన 70% బ్రెస్ట్ క్యాన్సర్లు వచ్చే అవకాశం ఉంటుదట. అంతేకాక కడుపు లోపలి గోడలు పాడయిపోయి, అవి స్రవించే రసాయనాల శాతం తగ్గి అల్సర్లు వచ్చే అవకాశం ఉందట.

మంచి నిద్ర మనిషి జీవన ప్రమాణాన్ని పెంచుతుందట. అంతేనా! బాల్యంలో తక్కువ నిద్రపోయే పిల్లలు యుక్త వయస్సు వచ్చాక డ్రగ్స్, ఆల్కహాల్‌లకి అడిక్ట్ అవుతున్నట్టు పరిశోధనల్లో తేలిందట.

కాబట్టి సమయానికి తగిన ఆహారంతో బాటు, శరీరానికి సరిపడా నిద్ర అంతే అవసరం అంటున్నారు.

ముల్లుగుర్రబెట్టి చోచో అంటుంటేనా ముందుకు పోయేది. నువ్వు సొంతంగా వ్యవసాయం చెయ్యలేవు. నీలా వెన్నెముక లేనోడి దగ్గర నేనుండలేను. మా పుట్టింటికి వెళతాను" అంటూ బెదిరించింది.

"అది కాదే, అన్ని ఊళ్ళల్లోనూ పత్తిపంట పండక నానా చావులూ చస్తుండడం చూస్తూనే ఉన్నావు! ఇంకా ఎందుకే నన్ను సతాయిస్తావు. అసలు పత్తి వెయ్యటానికి నువ్వే గదంటే కారణం. నేను వెయ్యనన్నా నాచేత బలవంతంగా వేయించింది నువ్వు కాదా!" అంటూ కయ్‌మన్నాడు.

"ఆహా అంతకు ముందంతా తెగ పండిచ్చి లాభాలు తెచ్చావా! వేరుబడ్డప్పటి నుంచి అన్నీ నష్టాలే గదా! అంతకుముందున్న అప్పులు తీరకపోగా ఇంకా కొత్త అప్పులు చేసి పెడితివే. ఊళ్ళో ఉండేటట్టుందా! వేరుబడిన వాళ్లందరూ బతకడం లేదా! మనమెందుకింత అధోగతిపాలు గావాల్సి వచ్చింది. ఊళ్ళో అందరూ మనల్ని గురించే ఎందుకు చెవులు కొరుక్కుంటున్నారు. దేన్నయినా భరించొచ్చుగానీ చేతగానితనాన్ని భరించడం మాత్రం నావల్ల కాదు" అంటూ గట్టిగా అడ్డం తిరిగింది.

మొగుడూ పెళ్ళాలూ గుంజాటనపడటం సుబ్బులమ్మ గమనిస్తూనే ఉంది. ఏం చెయ్యాలో అర్థంకాక దిక్కుతోచని పరిస్థితుల్లో కొట్టుమిట్టాడుతోంది.

ఆరోజు రాత్రి మాలకొండయ్యకు కన్నుమీద కునుకే రాలేదు. ఎటు మెసిలినా మింగుడు పడని ఓటమే కనిపిస్తోంది. ఒకవైపు వ్యవసాయం, చేతగాని అనామకుడుగా పేరు పడిపోవడం, అప్పులు పెరిగిపోవడం... తిన్నకూడు వంటబట్టకుండా పోవడం... రాత్రింబవళ్ళు ఒకటే ఆలోచనైపోయింది. 'అటు అమ్మకి మొఖం చూపలేకపోతున్నాను. ఇటు భార్యకు సమాధానం చెప్పలేకపోతున్నాను. ఏమిటి దారి? ఏం చెయ్యాలి? ' అనుకుంటూ అయోమయంలో పడిపోయాడు.

* * *

ఆ రోజు తెల్లవారేసరికి అన్నిరకాల సమస్యలకీ పరిష్కారం దొరికిపోయింది.

పురుగుల్ని చంపలేకపోయినా, ఎందరో పత్తి రైతుల్ని చంపిన పురుగుమందులు మాలకొండయ్య సమస్యనూ పరిష్కరించేశాయి.

పొలంలో శవమై తేలిన మాలకొండయ్యను చూసిన సుబ్బులమ్మకు నోట మాట రాలేదు. "ఎంత అన్యాయం జేసిపోయావురా! కష్టపడి సంసారాన్ని గట్టెక్కిస్తావనుకుంటే తెల్లార్చుకుపోయావా!" అంటూ కుమిలిపోయింది. కడుపుశోకంతో అల్లాడిపోయిన ఆమెని చూసి ఆమె ఏమైపోతుందోనని అందరూ భయపడ్డారు.

ఆయనే పోయిన తరవాత ఇంక నేనిక్కడుండి ఏం చెయ్యాలంటూ భార్య పుట్టింటికి వెళ్ళిపోయింది.

మాలకొండయ్య కర్మకాండలు అయ్యాయో లేదో అప్పులవాళ్ళు నెమ్మదిగా ఇంటి గడప తొక్కడం ప్రారంభం అయ్యింది. సుబ్బులమ్మకు ఎటూ పాలుపోలేదు. "ఎప్పుడూ ఒకరికి పెట్టినదాన్నే గానీ, ఒకరిచేత అనిపించుకున్న దాన్ని కాదు. అలాంటిది ఇవ్వాళ నా గడప తొక్కి నన్నే దబాయిస్తున్నారు. ఎంత కానికాలం వచ్చింది. వెనకాముందు ఏదైనా అండ ఉంటే ఎంత కొండైనా దాటొచ్చు. ఎటు జూసినా ఆదుకునేవాళ్ళే లేరు" అనుకుని మధనపడింది.

అప్పుల వాళ్ళతోటీ చెప్పుల్లేని వాళ్ళతోటీ నడవకూడదనే సామెత అక్షరాలా వాస్తవమై కళ్ళముందు నిలిచింది.

ఎటూ పాలుపోక పొలాన్ని అమ్మకానికి పెట్టింది సుబ్బులమ్మ. చిన్నకొడుకు నారాయణ కూడా ఆ నిర్ణయాన్ని సమర్థించాడు.

ఊళ్ళో వాళ్ళు బేరసారాలకు దిగారు. అప్పుడొచ్చింది మాలకొండయ్య భార్య.

"నేనే వద్దామనుకుంటన్నాను. సమయానికి నువ్వే వచ్చావు" అంటూ సాదరంగా ఆహ్వానించింది సుబ్బులమ్మ కోడలిని.

వచ్చీ రావడంతోనే అసలు విషయానికి వచ్చేసింది మాలకొండయ్య భార్య. "పొలాన్ని అమ్మకానికి పెట్టారంటగా"

"అప్పులోళ్ళు ఇంటిచుట్టూ తిరుగుతున్నారు. ఇంకేం చేద్దాం. ఇంతకంటే గత్యంతరం లేదుగా" అంది సుబ్బులమ్మ. "మా వాటా పొలం మాత్రం అమ్మటానికి లేదు" తెగేసినట్లు చెప్పింది కోడలు. "అదేందమ్మాయ్ అట్టంటావు. ఇద్దరు అన్నదమ్ములు కలిసి ఉన్నప్పుడు చేసినవే అప్పులు. అంతా అమ్మినా అప్పులకి సరిపోయేటట్టు లేదు. ఇప్పుడు నువ్వొచ్చి అడ్డం తిరిగితే ఎట్టా" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది సుబ్బులమ్మ.

తల్లి ఇంతగా ఎప్పుడూ బాధ పళ్ళేదు. ఎందుకు వదినింత మొండిగా అడ్డం తిరుగుతోంది. అప్పులు కట్టకుండా ఊళ్ళో తల ఎత్తుకుని ఎలా తిరగాలి అనుకుంటూ నారాయణ రంగమ్మతో చెప్పి ఎంతో బాధపడ్డాడు.

వదినకి ఎన్నో రకాలుగా నచ్చజెప్పాలని చూశాడు. "ఎవరెట్టయినా చావండి. ఇంత కాలం ఏదెలా చేసినా ఎవర్నీ అడగలేదు. అంతా సర్వనాశనం చేసేశారు. ఈ పొలం గూడా లేకపోతే నా పిల్లల్ని ఎట్టా సాక్కోవాలి" అంటూ శోకాలు పెట్టి రభస చేసింది, మాల కొండయ్య భార్య.

ఊహించని ఆ పరిణామానికి సుబ్బులమ్మకి నోటమాట రాలేదు. ఎంత వాదులాడినా, ఎంతగా నచ్చచెప్పినా ఆమె మాత్రం తన పట్టు వీడలేదు. దాంతో ఆమె వాటా వదిలేసి చిన్నకొడుకు వాటావరకు అమ్మకానికి పెట్టారు.

అప్పులవాళ్ళూ, ఊరి పెద్దలూ కూడా సమావేశమయ్యారు. సుబ్బులమ్మ తలమీద పవిట చెంగు కప్పుకుని విషాదంగా కూర్చుంది. నారాయణ, రంగమ్మలు ఆమె పక్కనే బిక్కుబిక్కుమంటూ కూర్చున్నారు.

పెద్దమనుషులు ఒకరికొకరు మాట్లాడుకున్నారు. అప్పులవాళ్ళు గుసగుసలాడుకుంటున్నారు.

"చూడండి" వెంకటసుబ్బయ్య గొంతు ఖంగున మోగింది. "వీళ్ళ కుటుంబం పరిస్థితి

అందరికీ తెలిసిందే! ఒకప్పుడు ఈ ఊళ్ళో పేరుమోగిన కుటుంబం. అలాంటిది వేరుపడ్డాక సుబ్బులమ్మకీ పెద్ద కొడుకులు ఇద్దరికీ సంబంధాలు తెగిపోయాయి.

వాళ్ళిద్దరు కూడా ఉమ్మడి కుటుంబం నుండి విడిపోయిన తరువాత ఏదో సంపాయించుకుందామని తాపత్రయపడ్డారు కానీ, చతికిలపడిపోయారని వింటూ ఉన్నాం. ఉన్న పొలాలు అమ్ముకుని చేపల చెరువుల్లో ఒకడూ, గ్రానైట్ రాళ్ళ వ్యాపారంలో ఒకడూ ధుమామసి అయిపోయారు. దీన్నిబట్టి ఉమ్మడి కుటుంబాలు వేరుబడితే ఏమవుతుందో మనం తెలుసుకోవాలి.

ఇకపోతే రెండో విషయం. బాగా బతికి నన్నాళ్ళూ ఎవురికీ లేదనకుండా పెట్టిన సుబ్బులమ్మకి ఇయ్యాల ఇంత నికృష్టపు స్థితిలో ఉండాల్సొస్తుందని ఎవరూ ఊహించలేదు. వేరుబడ్డవాళ్ళు ఏరుదాటి తెప్ప తగలేసినా ఉన్న కొడుకులతోటి సతపోరింది. అప్పులపాలయ్యింది. ఒక కొడుకుని కూడా పోగొట్టుకుంది.

సరే ఇక మిగిలిన పొలం అమ్ముదామనుకుంటే మాలకొండడి పెళ్ళాం అడ్డం తిరిగి నా వాటా అమ్మటానికి లేదంది. అది మీ అందరికీ తెలిసిందే! నా మొగుడు చేసిన అప్పులు నా మొగుడుతోనే పోయినియ్యి నాకు సంబంధంలేదు అంది. సరే, అదీ ఆలోచిస్తే సబబుగానే తోస్తోంది.

ఇప్పుడు మొత్తం మీద నేను చెప్పే మాట మీరు వింటానంటే చెబుతాను. లేదా ఎవరిదోవ వాళ్ళం చూసుకుందాం" కాసేపు ఆగాడు వెంకటసుబ్బయ్య.

"చెప్పండి. మీ మాట కాదనేదేముంది" గుంపులో నుండి ఎవరో అన్నారు.

"ఇంక ఎవరిమైనా చెయ్యగలిగింది ఏమీ లేదు. ఉన్న పొలమంతా అమ్మకానికి పెట్టింది. మేం అంతిచ్చాం ఇంతిచ్చాం. వడ్డీలు చాలా అయ్యుంటయ్యి. నాకంత రావాలి! ఇంత రావాలి! అని ప్రయోజనం లేదు. వచ్చిన పావలా బేడా తలా కాస్త తీసుకొని వాళ్ల కుటుంబ పరిస్థితి చూసి గమ్మునపోవడం మంచిది.

లేదూ, గోల జేస్తామంటారా చేసుకోండి. ఒకవేళ చేసినా వాళ్ళ దగ్గర్నించి మనం తీసుకునేది ఏమైనా ఉంటుందేమో ఒక్కసారి ఆలోచించండి.

ఇక ముసలమ్మకి ఇంకేం మిగిలింది. చిన్న కొడుకు అమాయకుడు. వాడేం జేస్తాడు? ఏం చెయ్యలేడు. ఎంత తెలివికల పిల్లయినా రంగమ్ముందంటే ఆ అమ్మాయి మాత్రం ఏం చేస్తుంది? అత్తమాట జవదాటకుండా సుబ్బులమ్మ ఏమి చెబితే అది తలకాయ ఊపుతూ చేస్తుందేకానీ అంతకంటే ఒక గొర్రె పేగును కూడా తెంచలేదు. అందుకే మాలకొండయ్య పెళ్ళాం లాగా కాకుండా ఈ అమ్మాయి మంచితనంతో ఉండబట్టి ఈ పొలమైనా అమ్మనిచ్చింది.

ఇంక వీళ్ల మంచితనానికి మనం చేసే సాయమేందయ్యా అంటే, వాళ్ళ కొంపాకటి. ఊరన్న తరవాత ఉంటానికొక ఇల్లు ఉండాలి కాబట్టి దాని జోలికి పోకుండా ఉంటే ఊర్లో కాస్తన్నా న్యాయం బతికుందనీ, ఊరేం గొడ్డు బోలేదనీ, మనం మనుషులమేననీ అనిపించుకుంటాం.

మనల్ని పిల్చి అంతా మనముందే పెట్టినందుకు ఈ కాడికి పోతే మనకే వ్రతం చెడ్డా ఫలం దక్కినట్టు సొమ్ము పోయినా కాస్త మంచితనమన్నా మిగులుతుంది" అని ఇంక చెప్పేదేమీ లేదన్నట్టు వెంకటసుబ్బయ్య కూర్చున్నాడు.

కాసేపు అందరూ గుసగుసలాడుకున్నారు. తలా ఒకమాట మాట్లాడుకున్నారు.

సుబ్బులమ్మ మనసు ఉగ్గబట్టుకుని జరిగే తంతును గుడ్లప్పగించి చూస్తోంది.

"సరే అట్నే కానియ్యి. ఇంక నువ్వు చెప్పిన తరవాత కాదనేదేమి ఉంది. అంతా కళ్ళ ముందు కనపడతానే ఉందిగా" అన్నారందరూ మూకుమ్మడిగా.

పొలం అమ్మి వచ్చిన కాడికి తలా పావలా తీసుకుందాం అనుకుని ఎవరి దారిన వాళ్ళు

పోయారు.

ఎంతో భరోసాగా లాక్కొచ్చిన కుటుంబం ఇవాళ ముక్కలు చెక్కలైపోయింది. ప్రతి క్షణం సుబ్బులమ్మకు ఇదే ఆలోచనైపోయింది. ఆ మనోవ్యథతో ఆమె తిండి తినటమే మానే సింది. రోజురోజుకీ లంకణాలు చేసిన దాని లాగా అయిపోయింది. అప్పట్నుంచి ఇంట్లో నుంచి బైటికి రావడం మానేసింది.

కొడుకు నారాయణ, కోడలు రంగమ్మా కూలిపనులకి పోయి తెచ్చిపెడితే ఒక ముద్ద తింటుంది. లేకపోతే ముసుగు కప్పుకుని పడుకుంటుంది. ఎవరేం జెప్పినా ఉలకదు, పలకదు. తలూపుతుందంతే.

ఒకరోజు పెద్దకొడుకు చేపల చెరువుల దగ్గర పనిజేసే మల్లయ్య ఇంటికొచ్చి సుబ్బులమ్మని కదిలిచ్చాడు.

"ఏంది మల్లయ్యా ఎట్టుం డావు" ఒక్క మాట మాట్లా డింది.

"నా మాట కేం లేమ్మా. నేను ఎట్టుంటే ఎవురికేందిగానీ, పెద్దయ్య గారిని చూడాల. ఈ ఊళ్ళో ఉండప్పుడు ఎట్టుండేవాడు. ఆయన్న జూస్తే ఎవర్కికైనా ఎంత భయం భక్తీ ఉండేది. అట్టాంటి గంభీర మైన మణిసి ఇయ్యాల చూడాలమ్మా. అబ్బో మన కళ్ళతో మనం చూళ్ళేమమ్మా. రొయ్యల చెరువులు మనలాంటోళ్ళకి ఎందు కమ్మా? ఎవురో కోటీసొరులు చెయ్యాల్సిన పనులు. కమ్మని వరి పంట పండే పొలాలు నాశనం చేసి పారేశారు. అయినా దాంట్లో బావుకుందేమీ లేదు. ఉన్నదంతా ఊడిసి పెట్టిడా! ఎంత అప్పుజేసేడో లెక్కే లేదు. ఇయ్యాల అందరూ ఇంటి చుట్టూ తిరిగేవాళ్ళే. ఎవరికని సమాధానం చెబుతాడు. ఊళ్ళో ఉండంగా ఎప్పుడైనా తలదించుకోవడం చూశామా. అక్కడ నేను ఎన్నోసార్లు చూశా నమ్మా.

ఎవురో పెద్దపెద్దోళ్ళు చెయ్యాల్సిన పనులు మనం చేస్తే ఇట్టనే ఉంటదమ్మా. ఒక తట్టు తగిలినా వాళ్ళయితే తట్టుకుంటారు గానీ, ఇంకెవ్వరైనా ఇట్టా బోర్లపడాల్సిందే గదా! ఇంతకీ నేనొచ్చిన సంగతి చెప్పడం మర్చిపో యానమ్మా. అయ్యగారికి యాక్సిడెంటయ్యి తలకి దెబ్బ తగిలింది. కాలేమో ఇరిగింది" చెప్పాల్సిన అసలు విషయం చెప్పాడు.

ఆమె నోటి వెంట మళ్ళీ ఇంకొక మాట వినలేకపోయాడు మల్లయ్య. పుణ్యాత్మురాలు ఎట్టుండాల్సింది ఎట్టయిపోయింది. ఏరు బోవడం తోటే ఈ ఇంటి వైభవమంతా కొండె క్కింది. హూ. గోడలు యాడదాడ పెచ్చు లూడిపోయాయి. సరైన నాదుడు లేకపోతే 'ఏదైనా ఇట్టనే ఉంటది' అనుకుంటూ వెళ్ళి పోయాడు మల్లయ్య.

> రొయ్యల చెరువులు మన లాంటోళ్ళకి ఎందు కమ్మా? ఎవురో కోటీసొరులు చెయ్యాల్సిన పనులు. కమ్మని వరి పంట పండే పొలాలు నాశనం చేసి పారేశారు

పొలం పనులు ముమ్మరంగా ఉండడంతో కూలికిపోతున్న నారాయణ, అన్నని చూడ డానికి వెళ్ళలేకపోతు న్నానే అని బాధపడి పోయాడు. చాలాసార్లు రంగమ్మతో కూడా అన్నాడు. పనులైపోయాక వెళ్ళి చూసొద్దాం లే అనుకుంటూ వాయిదా వేసుకుం టూ వచ్చింది రంగమ్మ. చివరికి ఒకరోజు వెళ్ళి చూసి వచ్చారు. కానీ అన్నదమ్ములు, తోడికోడళ్ల మధ్య ఇదివరకటి ఆప్యాయ తలూ లేవు, ఆ ఆదరణ లేదు. వాళ్ల పరి స్థితి చూసి వీళ్లు, వీళ్ల పరిస్థితి విని వాళ్లు 'ప్చ్' అనుకున్నారు. అంతే. ఎవరికెవరు అండగా నిలవలేని పరిస్థితి.

కాకపోతే నారాయణా, రంగమ్మ వచ్చి శివ రామయ్య గతాన్ని తల్చుకొని పశ్చాత్తాప పడే టట్టు చేసి వెళ్లారు.

అక్కడికి వెళ్ళిరావటంతో 'వాళ్ళకంటే మన మే నయం. కనీసం కూలీ నాలైనా చేసుకుని పొట్ట పోసుకోగలుగుతున్నాం. వాళ్లాపని కూడా చెయ్యలేక నానా గడ్డి తింటున్నట్టున్నారు' అనుకుని తృప్తిపడ్డారు నారాయణ, రంగమ్మ.

## 12

చింత చెట్ల సందుల్లోంచి వెలుతురు క్రమ క్రమంగా దూరమౌతూ మసకచీకటి నిండు తోంది. పక్షులు గోలగోలగా అరుస్తూ గూళ్ళల్లో పిల్లలతో మాట్లాడుకుంటున్నాయి.

రంగమ్మ టీ కోసం ఎదురు చూస్తున్న ఇద్దరు ముగ్గురుకి గ్లాసుల్లో టీ పోసి అందిం చింది.

మోటార్ సైకిలొకటి శబ్దం చేసుకుంటూ వచ్చి కొట్టు ముందు ఆగింది. ఎవరో టీ తాగ డానికి వస్తున్నారేమో అనుకొని అటువైపుగా చూపు సారించింది. ఆ మనిషి దగ్గరకు వచ్చే కొద్దీ ఎవరో తెలిసిన మొహంలాగుందే అను కుంటూ ఉండగా కొట్టు దగ్గరకు వచ్చాడు.

"ఓ నువ్వా రమేషా, ఎవరో అనుకుం టున్నా. ఒక్కడివే వొచ్చావే, మా పుణ్యాత్ముడు ఏడీ?" అంటూ వెనకా చుట్టు పక్కలా చూసింది.

అతడు చాలా ఆతృతగా, మొఖం నిండా చెమటతో రావడంతో కంగారుగా ఉన్న అతడి వాలకం చూసి, రంగమ్మకు కూడా ఏదో అను మానం వచ్చింది.

"ఏంది రమేషా! ఏందో హడావుడిగా వచ్చావే? ఏందట్టుండావు? ఇంతకీ మావోడు రాకుండా ఒక్కడివే వచ్చావంటే పలకవేంది? " ఏం జరిగిందోనన్న ఆతృతతో అడిగింది.

"ఆంటీ..." అని రమేష్ ఎలా చెప్పాలా అన్న సందిగ్ధంలో ఆగిపోయాడు.

రంగమ్మకు కొడుక్కేదో జరిగిందన్న విషయం అర్థమయింది. "ఆంటీ! మీ అబ్బాయి హాస్పిటల్లో ఉన్నాడు" చెప్పాలనుకు న్నదాంట్లో ఒక్కమాట చాలా కష్టంగా చెప్పాడు.

రంగమ్మకు ముచ్చెమటలు పోశాయి. ఎప్పు డొస్తాడో, ఎప్పుడు పోతాడో, ఎక్కడుంటాడో, ఏం చేస్తాడో వాడికే తెలియదు. అందుకే తను వాడి గురించి పట్టించుకోవడమే మానే సింది. ఎప్పుడన్నా ఇంటికొచ్చి ఒక ముద్ద



కూడు తింటానంటే పెట్టడం, నాలుగు రూపా యలిస్తే తీసుకోవడం. ఈ మధ్య అదీ పోయి వచ్చినప్పుడు తన దగ్గరే తీసుకుంటుంటే, తన కొడుకు మీద తనకే అసహ్యమేసింది.

అయితే ఎప్పుడో ఒకప్పుడు కొడుక్కే ఎదురు చెయ్యాల్సి వస్తుందని తెలుసు. అయితే ఆ ఘడియ ఇప్పుడే వచ్చిందా అని రంగమ్మ నిలువెల్లా ఒణికిపోయింది. భూమి కంపించినట్టనిపించి, "ఏమైంది రమేషా? ఎందుకుండాడు హాస్పిటల్లో? " ఆత్రంగా అడిగింది.

"ఏమీ లేదాంటీ, కంగారేం లేదు. బండి మీద పోతుంటే చిన్న యాక్సిడెంట్ అయింది" మామూలుగా ఉండాలని ప్రయత్నిస్తున్నట్టున్నా రమేష్ ముఖంలో ఆందోళన స్పష్టంగా కనిపిస్తోంది.

"ఏం జరిగిందో నిజం జెప్పు. నీ కంగారు జూస్తుంటే నాకెందుకో చాలా భయంగా ఉంది. అష్ట దరిద్రాలూ మా ఇంటి చుట్టూ తిరుగుతున్నట్టే ఉన్నయ్యి" అంటూ ఇంటి పక్కన ఉండే సుశీలని పిలిచింది.

ఆమె వచ్చిన తరువాత "అమ్మా కాస్త కొట్టుని చూస్తుండు. పిల్లోడికేదో దెబ్బలు తగిలినియ్యంట. చిన్నపిల్ల వచ్చే వేళయింది. ఆ పిల్ల వచ్చిందాకా కూర్చోమ్మా" అంటూ బతిమాలి, డబ్బాల్లో ఉన్న డబ్బులు తీసుకుని బొడ్లో దోపుకున్న సంచీ తీసి, దాంట్లో వేసుకుని మూతి కట్టేసి మళ్ళీ బొడ్లో దోపుకుని, ఇంట్లోకొచ్చి ట్రంకు పెట్టెలో ఉన్న డబ్బులు కూడా తీసుకుని ముసలమ్మకు ఆస్పత్రికి పోతున్నానని చెప్పి హడావిడిగా బయటకొచ్చింది.

అప్పటికే రమేష్ బండి స్టార్ట్ చేసి ఎదురు చూస్తూ ఉన్నాడు.

వెంటనే బండి ఎక్కి జాగ్రత్తగా రాడ్ పట్టుకుని కూర్చుంది.

"ఎక్కావా ఆంటీ" అని అడిగి బండి ముందుకు పోనిచ్చాడు రమేష్.

హాస్పిటల్ వార్డులో కొడుకు బెడ్ దగ్గర ఇద్దరు ముగ్గురు స్నేహితులు కనిపించారు రంగమ్మకు. ఆమె బెడ్ దగ్గరకు రాగానే స్నేహితుల్లో ఒకడు డాక్టర్ రాసిచ్చిన చీటీ చూపించాడు.

అది కనిపించలేదామె కంటికి. మంచం మీద పడున్న కొడుకు అసలు తన కొడుకో కాదో అన్న అనుమానం వచ్చింది. దాదాపు ఇంటికొచ్చి ఏ నెలో, నెలాపదిహేను రోజులో అయింది. పోల్చుకోలేనంతగా మారిపోయాడు.

తల చుట్టూ పెద్ద కట్టు ఉంది. దాదాపుగా స్పృహలో లేనట్టే ఉన్నాడు. పక్కనే స్టాండుకి సెలైన్ బాటిల్ ఉంది.

"ఏందయ్యా ఏమైంది? అసలే జబ్బు మణిసివి. దానికితోడు ఈ అగాయిత్యమేందిరా!" ఏడుపు ముఖంతో మంచం మీద కూర్చుని పైనుండి కిందదాకా తేరిపార చూసింది.

"రాంకోటయ్యా రాంకోటయ్యా" అంటూ పిల్చినా రెప్పలు కదిలిస్తున్నాడు కానీ కళ్ళు తెరవడం లేదు.

రాంకోటయ్యకు తల్లి వచ్చిందని, తనతో మాట్లాడుతోందని తెలుస్తూనే ఉంది. కానీ కళ్ళు పూర్తిగా తెరుపుడు పడడం లేదు. నోటిలో నుంచి మాట పెగిలి రావడం లేదు.

తల వంచి ముఖంలో ముఖం పెట్టి చూస్తూ "ఏమైందయ్యా!" అంటూ స్నేహితుల్ని అడిగింది.

"లారీ మీదనుంచి పడ్డాడాంటీ, తలకి గూడా దెబ్బ తగిలింది. కాలి ఎముక కొద్దిగా చిట్లిందని చెప్పాడు డాక్టర్. ఆ మందులు తొందరగా తెచ్చియ్యాలంట" అంటూ రంగమ్మ చేతిలో ఉన్న మందులు చీటీ వైపు చూపించాడొకతను.

ఆ చీటీ తీసుకుని హడావుడిగా మందుల షాపెక్కడ అని అందర్నీ అడుగుతూ షాపు దగ్గరికి వచ్చింది. అక్కడ మందులు తీసుకొని హడావుడిగా వార్డులోకి వచ్చింది.

కాంపౌండర్ని పిలిపించి ఇంజెక్షన్లు చేయించారు. స్పృహలోకి వచ్చిన తరువాత వెయ్యాల్సిన మందులు చూపించి కాంపౌండర్ వెళ్ళిపోయాడు.



మృతసముద్రం ఉపరితలంలో కనిపించే అందమైన దృశ్యమిది. చిత్రంలో సముద్రపు నీటిమీద తేలుతున్నటు కనిపించేవి లైఫ్ బోట్లుగానీ, మంచు ఖండాలుగానీ కావు. భారీఉప్పు కంభాల ఉపరితలాలవి. సముద్రాంతర్భాగంలో ఈఉప్పు కంభాలు దాదాపు 20లక్షల సంవత్సరాల క్రితమే ఏర్పడటం మొదలయింది. ఏర్పడ్డాయి. జోర్డాన్ వ్యాలీ దిగువ ప్రాంతం నుంచి ప్రారంభమయ్యే ఈ మృతసముద్రంలో మిగిలిన సముద్రాలకంటే ఉప్పుశాతం ఆరు రెట్లుఎక్కువ ఉండటంతో ఏవో కొన్ని ఏకకణ జీవసముదాయం తప్ప మరే జీవజాలం కనుపించదు. ఈ సముద్రంలో పుష్కలంగా ఉండే కొన్ని ఖనిజాల వల్ల అందులో స్నానం చేసే వారికి చర్మవ్యాధులు, కీళ్ల నొప్పులు, శ్వాస సంబంధమైన సమస్యలు వంటి వివిధ వ్యాధుల నుంచి ఉపశమనం లభిస్తుంది. అక్కడి నల్లని మట్టి చర్మాన్ని కళాకాంతులీనేటట్లు చేస్తుంది.

## మీ చేతుల్లోనే ఉంది

అంటున్నారు...అమెరికన్ శాస్త్రవేత్తలు. ఏంటండీ... తలా తోకా లేకుండా 'మీ చేతుల్లో ఉంది' అంటున్నారని సందేహ పడుతున్నారా?

విషయం ఏమిటంటే, గుండె జబ్బులకి కారణమైన కొలెస్ట్రాల్ పరీక్ష చేయించుకో వాలంటే పరగడుపుతో రక్తం ఇచ్చి టెస్టు చేయించుకోవాలి గదా! ఇపుడు ఆ అవ సరం లేదంటున్నారు శాస్త్రవేత్తలు. పైగా అంతా మీ చేతుల్లోనే ఉందంటున్నారు.

అరచేతిలో ఓ ఫోమ్ ప్యాడ్ ఉంచుతా రట. దానిపై పరీక్షకు సంబంధించి ద్రవం పోస్తారుట. తర్వాత ఫోమ్ ప్యాడ్



రంగులో కలిగే మార్పుని ఎలక్ట్రానిక్ పరి కరం ద్వారా రీడింగ్ తీస్తారట. ఈ పరీక్ష చర్మంలో ఉండే స్టిరాల్ విలువల్ని ఐదు నిమిషాల్లో తెలుపుతుందట. ఈ స్టిరాల్ విలువల్ని, కొలెస్ట్రాల్ విలువలతో... పోల్చి చూస్తారట. దీనివల్ల అతి త్వరగా వ్యాధి నిర్ధారణకి, ట్రీట్‌మెంట్‌కి అవకాశం ఉందంటున్నారు శాస్త్రవేత్తలు. గుండె పోటుతో సహా ఇతర హృద్రోగాలను అథి రోస్క్లీరోసిస్ వంటి వ్యాధుల్ని త్వరగా గుర్తించడంలో ఈ టెస్టు చాలా ఉపయు క్తంగా ఉంటుందని డాక్టర్లకి తోడ్పడుతుం దంటున్నారు.

దాదాపు తెచ్చిన డబ్బులో సగం ఆ ఒక్క సారి మందులకే అయిపోయాయి.

'చిన్నప్పుడు వీణ్ణి చూసి ఇద్దరు ఆడపిల్లల మధ్య ఈడొక్కడు. ఉద్ధరిస్తాడు. నన్ను జూసే దిక్కు ఈడే అవుతాడనుకున్నా. కానీ ఈడు ఎందుకూ పనికిరాకుండా పోయాడు.

వద్దురా వద్దురా. ఇనప వస్తువులు మనకి అచ్చిరావురా అంటే విన్నాడా! ఆ జబ్బు తగిలిచ్చుకున్నప్పట్నుండీ మద్రాసు బోయి మందు తెచ్చుకుంటన్నాళ్ళే, ఇంటికి రాకపో యినా యాడో ఒకచోట బతికే ఉన్నాళ్ళే అని సరిపెట్టుకునేదాన్ని. ఇప్పుడిట్టా అయింది. నిండా మునిగినోళ్ళకి చలేముంది" అను కుంటూ కొడుకు వైపే చూస్తూండిపోయింది.

"అసలెట్ట జరిగిందయ్యా ఇది" స్నేహితుల్ని అడిగింది.

"రెండు నెల్లనుండీ పనే చెయ్యలేదాంటీ! తాగి తిరుగుతున్నాడని పనిలోనించి తీసే శారు. కానీ అసలు కారణమేంటంటే, బలం లేక వాడు లారీ నడపలేక పోతుండటమే. అప్పట్నుండీ పిచ్చెక్కిపోయి తిరుగుతున్నాడు. మేము లోడు తీసుకుని వెళ్తుంటే మాతో పాటుగా వచ్చాడు. రాత్రిపూట బాగా నిద్రొ స్తోంది. పైకిపోయి పడుకుంటానన్నాడు. బాగా నిద్ర పట్టినట్టుంది. దొర్లి కిందపడ్డాడు. ఇంకా నయం టైం బాగుండి అంత స్పీడుగా పోవడం లేదు. పైగా యెనకా ముందూ ఏ లారీలూ రాలేదు కాబట్టి సరిపోయింది. లేకుంటే నుజ్జునుజ్జయిపోయేవాడు" చెప్పాడు వారిలో ఒకడు.

"ఏమోరా నాయనా, మీరందరే కదంట్రా వాణ్ణి గతికి తెచ్చింది. లేకపోతే ఎట్టుం డాల్సినోడు ఎట్టా అయిపోయాడ్రా" కళ్ళ నీళ్ళు పెట్టుకుంది.

వాతావరణం మారుతోందని గ్రహించిన మిత్రులు "సరే మేం వెళ్ళొస్తాం ఆంటీ" అంటూ చల్లగా జారుకోబోయారు.

"ఒకరన్నా ఉండండయ్యా. ఇంటికన్నా పోయొస్తాను. తెచ్చిన డబ్బు ఏ మూలకీ సరి పోయేటట్టు లేదు" అనడంతో సరేనంటూ

ఒకరు ఉండి మిగిలినవాళ్ళు వెళ్ళిపోయారు.

రంగమ్మ కొడుకుని చూసుకుంటూ బాధప డుతూనే ఇంటికి బయలుదేరింది. 'దరిద్రుడు తల కడగబోతే వడగళ్ళ వాన కురిసిందంట. వాడి సంపాదనతో వాడు పొట్ట పోసుకుంటా డనుకున్నాను గానీ, ఇట్ట నా యెదాన పడ్డాడు. అసలే దినదినగండం నూరేళ్ళాయు ష్షుగా బతుకుతున్న నా మెడకు పెద్ద గుది బండై పోయాడు' అనుకుంటూ ఇంటికి వచ్చింది.

సుజాత కొట్టు దగ్గర ఉంది. "ఏంటమ్మా ఎక్కడికి బోయావు. పొద్దుట్నుంచీ అక్కడ షాపులో నుంచునీ నుంచునీ వస్తే మళ్ళీ ఇక్కడ కూడ ఏంటమ్మా ఇది? అప్పటికీ ఆంటీని ఉండమంటే నాకు పనుందమ్మా అని వెళ్ళిపోయింది" అంటూ తల్లిని చూసి ఏడుపు ముఖం పెట్టింది.

"ఎట్టమ్మా అట్టంటే. ఎప్పుడన్నా ఇరుకూ ఇబ్బంది అయినప్పుడు తప్పదు గదమ్మా. అట్టాంటప్పుడు విసుక్కుంటే ఎట్టా అన్నయ్యా యాక్సిడెంటయి దెబ్బలు తగిలి హాస్పిటల్లో ఉన్నాడమ్మా" అంటూ ఇంట్లోకి వెళ్ళింది.

"ఛీ, వాడి పేరు ఎత్తబాకమ్మా నా దగ్గిర. అన్నయ్యంట అన్నయ్య. వాడు అన్నయ్యని చెప్పుకోవటానికే సిగ్గేస్తుంది. వాడు షాపుకొచ్చాడంటే గోల జెయ్యకుండా పోడుగా. వాడు తిరుగుబోతైతే మమ్మల్ని కూడా అట్టాగే లెక్కేస్తన్నాడు. షాపుకొచ్చినప్పుడల్లా నిన్నెం దుకు ఆడుండావు. ఇక్కడేం చేస్తున్నావు అని తెగ నిలదీస్తాడు, మేమేదో తప్పు జేసినట్టు. మొన్నొకరోజు అక్క దగ్గరికి కూడా వెళ్ళి గోల జేసాడంట. ఎవరికన్నా అన్నయ్య లుంటే సంతోషపడతారు. మేము భయపడాల్సొ స్తోంది వాణ్ణి చూసి" అంటూ అతడిమీదున్న కసిని కోపాన్ని వెళ్ళగక్కింది సుజాత.

"ఎవురెట్టున్నా నాకు తప్పేదేముందమ్మా. ఆర్చేవాళ్ళు తీర్చేవాళ్ళు లేకపోయినా, కిందబ డితే లేవదీసేవాళ్ళు లేకపోయినా నా తిప్పలు నేను పడాల్సిందే కదా!" అంటూ పొయ్యిమీద అన్నం బెట్టి, తెలిసినవాళ్ళ దగ్గర అప్పు తేవ డానికి వెళ్ళింది.

పెద్దమ్మాయి రావడంతోటే అన్న మంచాన పడ్డాడన్న సంగతి తెలిసింది. "చావకుండా ఇంకా బతికే ఉన్నాడా! చస్తే ఒకరోజుతో పీడా వదిలిపోయేదిగా. మాకెవరూ అండలే రనే బతుకుతున్నాం. ఇప్పుడొచ్చి మళ్ళీ మన పాలిట పడకపోతే ఎక్కడున్నా పడి చావగూ డుదా" అంటూ ఈసడించుకుంది సుధారాణి.

"పోనియ్యిలేవే. మీ తోడబుట్టిన వాడే కదా! ఎందుకు వాణ్ణట్టా ఆడిపోసుకుంటావు" రంగమ్మ పాప భీతితో కూతురుకి సర్దిచెప్పబో యింది. "ఊరుకోమ్మా అందర్నీ జాలి తలు స్తావు. ఇంత పాపభీతితో ఉన్నావు కాబట్టే ఇట్టాంటి దిక్కుమాలిన చావు చస్తున్నాం" అంటూ తల్లిని కోప్పడింది.

రాంకోటయ్య కోలుకుని హాస్పిటల్ నుండి ఇంటికి చేరేసరికి అతడికి ఖర్చయిన దానితో కలిపి రంగమ్మ అప్పులు తడిసి మోపెడయ్యా యి. నిండా మునిగి నోళ్లకు చలేముందిలే అ నుకుంటూ తనకు తానే ధైర్యం చెప్పుకుంది.

ఇంటినిండా దుకాణానికి కావలసిన సరు కులు, బర్రెలకి రావలసిన మేత మోపులు, ఒకపక్క ముసలమ్మ... అసలే ఇరికిరుకుగా ఉన్న ఇంట్లో మధ్యలో ఒక కర్టెన్ కట్టుకుని లోపల మరుగు జేసుకుంటిమి. ఇంకా ఈడినె క్కడ పండెయ్యాలా అనుకుంటూ ఆలోచించి పాతరేకు బోర్డుల్ని, విరిగిపోయిన రేకుల్ని సంపాయించింది.

ఇంటికి వెనకగా దక్షిణం పక్క ఒక పందిరిలాగా వేసి దానిమీద ఈ రేకులూ, బోర్డులూ వేసింది. చుట్టూ ఎండ రాకుండా టార్పాలిన్ పట్టాలు చుట్టింది. లోపల మంచ మేసి అక్కడ పడుకోబెట్టింది.

"ముసిలమ్మకు చేసేసరికే ప్రాణాలు పోతు న్నాయి. ఇంకిప్పుడు వీణ్ణి కూడ సాకాల. ఇంతకాలం యాడ తిన్నా యాడ తిరిగినా నా జోలి లేకుండా ఉండేది. ఇప్పుడు యెకా యెకీన నా మీదొచ్చిపడ్డాడు. అందరూ నా మీద పంతం పట్టినట్టు ఉండారు. ఆ, కానియ్యి ఈతకు మించిన లోతూ లేదు.

గోచికి మించిన దరిద్రమూ లేదు. ఈదినంత దూరం ఈత్తాను" అనుకుంది.

గాజు కళ్ళతో జీవం లేని కొడుకుని చూస్తుంటే ఒకవైపు కోపం, మరొక వైపు దుఃఖం ముంచుకొస్తున్నా అన్నింటినీ ముని పంట బిగపట్టి భరిస్తోంది. 'వాడి గుళ్ళో నిప్పులు బొయ్యి అన్ని పరీక్షలూ నాకే బెట్టి నా దుంప తెంచి పారేస్తున్నాడు. ఏం చేస్తాను. కానీయ్' అనుకుని ఉన్న బాధలకి తోడు కొత్తగా చేరిన బాధ కూడా భరించడా నికి సిద్ధమై పోయింది.

✶ ✶ ✶

"అమ్మా నాకు ఈ మజ్జ గుండెల్లో నెప్పొ స్తోందే! గుండె దడదడగా ఉంటోందెందుకో" భయం భయంగా చెప్పింది చిన్నమ్మాయి సుజాత.

"అమ్మా, ఇప్పుడు పడేయి చాలక మళ్ళీ కొత్త కొత్తయ్యి తెచ్చి పెట్టకండమ్మా" గుండెభా రంతో కూతురుతో అంది రంగమ్మ.

"కాస్త జాగర్తగా ఉండమని చెప్పమ్మా. నెప్పులూ గిప్పులూ ఏమీ రాకుండా ఉంటాయి" పెద్దమ్మాయి సుధారాణి చురక అంటించింది.

"ఏంటే జాగర్తంటన్నావు ఏం జేసింది" ఆరాగా అడిగింది పెద్ద కూతుర్ని.

"అది ఎవరి బండి మీదంటే వాళ్ళ బండి మీద ఎక్కి తిరుగుతోంది. రెండు మూడు సార్లు కనపడింది నాకు. నన్ను చూసి కూడా చూడనట్టే ముఖం తిప్పుకొని పోయింది"

ఆ మాటకు చర్రున తోక తొక్కిన తాచులా లేచింది సుజాత. "అమ్మో, నీలాగా కారుల్లో తిరగడం అందరికీ ఎట్టా కుదురు తుంది? నాలుగైదు రోజులు కేంపులుకి వెళ్ళటం ఎట్టా వీలవుతుంది? పెద్ద గురిగిం జలాగా మాట్లాడకు. పాలు తాగుతూ పిల్లి ఎవరూ చూడలేదనుకుంటదంట. ఎవరి కన్నా చెప్పేముందు మన సంగతేంటో ఆలో చించుకోవాల. కాస్త నోరు మూసుకుంటే మంచిది" ఒక మాటకు నాలుగు మాటలు వడ్డించింది సుజాత.

"చూడమ్మా చిన్నంతరం పెద్దంతరం లేకుండా ఎంత మాటంటే అంత మాటం టోంది. నా జీవితంలాగే ఉండాలా దాని జీవితం కూడా. దానికి కాస్త జాగర్త చెప్పమ్మా" బాధగా అంది సుధారాణి.

"చూడమ్మాయ్. అక్కను పట్టుకుని అట్టా మాట్లాడొచ్చా దాని ఉజ్జోగం అట్టాంటిద యింది. దాన్ని జూసి నువ్వు సూటిపోటి మాటలంటే ఎట్టా చెప్పు. నీ మంచి కోసమే కదా చెబుతోంది. ఆడదాని బతుకు అరిటాకు లాంటిదమ్మా. మన జాగర్తలో మనముం డాలి. అట్టా తిరిగితే ఎట్ట చెప్పు" రంగమ్మ నెమ్మదిగా మందలించింది చిన్నకూతుర్ని.

"ఎవర్ని జూసి ఎవరనుకుందో! నన్నంటే నేను ఊరుకుంటానా ఏంటి? కాస్త కళ్ళ సరిగా పెట్టుకుని చూడమని చెప్పు" బుకా యించింది.

"ఏంటే ఇంటికొచ్చిన దగ్గరనుంచి ఇద్దరిదీ ఒకటే గోల. అప్పజెల్లెళ్ళు లాగా ఉండరేంటే. తిత్తిలో కొడవళ్ళు లాగా తన్నులాటేనా" ముస లమ్మ విసుక్కుంది.

"ఇదుగో ముసిలీ, నీకెందుకే? అన్నిటికీ నేనున్నానని అందుకుంటావు. గమ్మున పడు కోలేవా!" అంటూ సుబ్బులమ్మను ఈసడించు కుంది సుజాత.

"నాకెందుకులేమ్మా. ఎట్టాగొట్టా సావండి" తనలో తనే గొణుక్కుంటూ బోసినోరు ఆడిం చుకుంటూ కుక్కి మంచంలో ముడుచుకుని పడుకుంది సుబ్బులమ్మ.

ఆ రోజు అందరి మనసులూ బరువె క్కాయి. ఎవరి ఆలోచనలు వాళ్ళచుట్టూ తేనె టీగల్లాగా ముసురుకున్నాయి.

రంగమ్మ మనసు మనసులో లేదు. ఇంకా ఆందోళన ఎక్కువై పోతోంది. చిన్నదాని సంగతి విన్న తరువాత ఎవరో బలవంతంగా పైనుండి పెద్ద బండ గుండెల మీద పెట్టి అదుముతున్నట్టుగా అనిపిస్తోంది.

'ఎప్పుడో ఒకసారి తప్పనిసరి పరిస్థితుల్లో గుండెల్ని బిగబట్టుకుని బలవంతంగా ఒక తప్పుని భరించినందుకు, తన ప్రమేయం

లేకుండా కాలు జారినందుకు పెనిమిటినే పోగొట్టుకోవాల్సి వచ్చింది. అప్పట్నుంచి ఇప్పటిదాకా ఎంత ఉండమారాజులు మాట్టాడినా కన్నెత్తి చూడన్నైనా చూళ్లేదు. నన్ను నిలబెట్టుకుని పిల్లల్ని నరకకూపంలోకి తోసేసేనా అనిపిస్తోంది. పెద్ద పిల్ల బతుకు ఎట్టాగూ దాని చెయ్యిజారిపోయింది. చిన్న పిల్ల కావాలని కోరి కష్టాలు తెచ్చుకుంటున్నట్టుంది. ఏం జేసేటట్టు? ఎవరికని చెప్పేటట్టు? తల్చుకుంటే గుండెలవిసిపోతున్నాయి! ఆలోచిస్తూ పడుకుంది రంగమ్మ.



తెల్లగా తెల్లారింది. కొట్టు దగ్గర అన్నీ సర్దుకుని ముందు బెంచీ వేసింది రంగమ్మ బెంచీ మీద పేపర్ పెట్టింది.

పేపర్ చూడడానికి వచ్చిన ఒకరిద్దరు టీ తాగుతూ పేపర్ చూస్తున్నారు.

"ఎవరు తాగుతార్రా, పొద్దున్నే కల్లుకుండలు రడీగా పెట్టుకుని కూర్చుంది కొండమ్మ" పక్కనున్నాయనతో అన్నాడు ఇంకొకాయన.

"భలేవాడివి మామా అటు జూడు నువ్వంటున్నావు. మాటల్లోనే మొదట బకరా వచ్చేసింది. మనం పాచిమొకాన్నే టీ తాగటంలా. అట్నే వాళ్లు కూడా. దేనోళ్లు దానికే ఉంటారు" అంటూ మొదటాయన పేపర్లో తలకాయ దూర్చేడు.

అటునైపుగా ఆడోళ్లు గుంపులు గుంపులుగా గోలచేసుకుంటూ వెళుతుండడం జూసింది రంగమ్మ.

"యాడకే అందరూ ఎగబట్టుకుని పోతుండారు"" గుంపులో బాగా తెలిసిన ఒకావిడిని అడిగింది.

"రా నువ్వు గూడా. నీగ్గూడా ఛాన్సుంది రా!" అంటూ అసలు విషయం చెప్పకుండా గుంపులో కలిసిపోయింది ఆవిడ.

"ఆ! నువ్వు గూడా పోమ్మా. తెగమరిగారు. అవసరమున్నోళ్లు, లేనోళ్లు అందరిదీ ఒకటే యేలంయెర్రి" కోపంగా అంటూ స్టీలు టిఫిన్ పట్టుకుని వచ్చింది మునెమ్మ.

"ఏందంటనే అది. అంతా యెనక్కి జూడకుండా పరిగెత్తుతున్నారు" రంగమ్మ మునెమ్మను కదిలించింది.

"నన్ను కదిలిచ్చబాక, నా నోటికి మంచి మాటలు కూడా రావు. ఒక్కతైనా ఒక్క రూపాయి సంపాదించేది ఉందంటే. ఎక్కడైనా ఊరకొచ్చుద్దా తేరగా కూసుని తిందామని చూసేదే గానీ, కష్టపడి చెమటోడ్చి సంపాయిద్దామన్న రంది ఒక్కదానికన్నా ఉందంటే. అసలు వీళ్లకి బుద్ధీ జ్ఞానం ఉండక్కర్లేదంటే!" తన అక్కసునంతా వెళ్లగక్కుతూనే ఉంది మునెమ్మ.

"ఇంతకీ యాడకెల్తున్నారో చెప్పకుండా ఎందుకు వాళ్లనట్టా ఆడిపోసుకుంటున్నావు" రంగమ్మ నవ్వుతూ అడిగింది.

"మొన్న సామ్రాజ్యం చచ్చినా వీళ్లకి బుద్ధి రాలేదు. వాడెవుడో ఊరక ఇస్తాడంట. వీళ్లంతా ఎగబట్టుకుని పోతుండారు. ఆ షేరు బ్యాంకోడి దెబ్బకి కదంటే సామ్రాజ్యం ఉరేసుకుంది. వీళ్లంతా వాడిదగ్గర అప్పు తీసుకున్నోళ్లే. మళ్లీ ఇయ్యాలెవుడో వచ్చాడంట. 'ఉండ మ్మా బొట్టు బెడతా" అంట. ఇరవై వేలిస్తాడంట. నెలనెలా కట్టాలంట. వీళ్లందరూ, ఆహా, ఊరకే ఇళ్లకొచ్చి ఇస్తున్నారు అనుకుంటున్నారు. వాడేమన్నా పిచ్చోడా? వడ్డీలకి వడ్డీలు యేసుకుని కానీ వాళ్లూరుకోరన్న సంగతి వీళ్లకి తెలిస్తేగా! ఊరకొచ్చిందని కూచుని తింటారు. కట్టబోయే సరికి కాలూ చేయాడక నువ్వమ్మా నువ్వమ్మా అంటూ అడుక్కుంటారు. మొన్నెవుడో 'పుట్టింటి పట్టుచీరంట'. అంతకుముందు 'మా ఇంటికి రా చెల్లీ' ఎన్ని స్కీములొస్తే అన్నిట్లోనూ రాయించుకోవడం. తెచ్చు

కోవడమే.

"ఇయ్యన్నీ తీసుకుని ఏం చేస్తున్నారే ఈళ్లంతా. నేను ఒకసారి తీసుకునే కట్టలేక చస్తున్నాను" రంగమ్మ అయోమయంగా అడిగింది.

"ఆ ఏముందిగ ఎంతమంది ఇచ్చినా తీసుకుంటారు. వాడిది ఈడికి, ఈడిది వాడికి మారుస్తూ ఉంటారు. ఏమీ లేకపోతే ఇంట్లో చెంబులు, సెరవలు, కమ్మలు, పట్టీలు, చివరికి కట్టుకునే కోకలు తాకట్టు పెడతారు. చివరికి కుండలో కూడుగూడా అమ్ముకునే రకాలే ఇవి. డబ్బుంటే కోడి మాంసం, యేట మాంసం, చేపలు దేనికీ తక్కువగాదు. లేని రోజు ఈగలు తోలుకుంటా కూచుంటారు.

అప్పుడు ఫైనాన్సోళ్ల దెబ్బకి మొగోళ్లు ఉరిబెట్టుకున్నట్టు, ఇప్పుడు ఈ స్కీముల దెబ్బకి ఆడోళ్లు కూడా టపటపా రాలిపోతన్నారు చూడు. మొన్నా సామ్రాజ్యం పాపం జరక్క తెచ్చుకుంది. వీళ్లు అట్టా గాదే, కడుపుకి తింటానికి రకరకాలు గావాలి. కడుపే కైలాసం, ఇల్లే ఇలాసం. కాలు కదపకుండా కడుపునిండాల. యాడేడ గుంపంతా వచ్చి ఈడ జేరారు. యాడ ఊరకొచ్చుద్దా, ఎవుణ్ణి పడదామా అని గాలాలేసుకుని కూచున్నారు... టీ పొయ్యవే... వీళ్లని చూస్తే కడుపు మండిపోతాంది" అంటూ కాడ టిఫిన్ అందించింది.

"ఊరుకోవే. మేం గూడా ఒకూర్నించి అడుక్కుతింటానికి ఇక్కడికి వచ్చినోళ్లమే! మా రాతలు బాగలేక ఈడొచ్చి పడ్డాం" రంగమ్మా తను ఊర్నుంచి వచ్చిన గతాన్ని గుర్తుచేసుకుంటూ అంది.

"నిన్నెవురంటార్లే రంగమ్మా. ఒకరి జోలికి పోయేదానివా. ఒకరి ప్రస్తావనకి పోయేదానివా. నువ్వేందో! నీ పనేందో! పాపం కాలం తీసుకొచ్చి నిన్నక్కడ నెట్టింది గానీ లేకుంటే మారాణిలాగా బతకాల్సిన దానివి గదంటమ్మా! ఏంజేస్తాం. ఆ మొకాన రాసిన రాతని ఎవురూ తప్పియ్యలేరు. టీ కోసం ముసిలోడు ఎదురుజూస్తుంటాడు వస్తా" అంటూ వెళ్లిపోయింది మునెమ్మ.

లోపల ముసలమ్మ వాంతి చేసుకుంటుండంతో హడావుడిగా లోపలికెళ్లి మంచం కింద ఉన్న బొచ్చెదీసి నోటిదగ్గర పెట్టింది రంగమ్మ. తర్వాత అదంతా బయట పారబోసి నీళ్లతో కడిగి మళ్లీ మంచంకింద పెట్టి, బట్టలమీద పడిన దాన్ని నీళ్లతో శుభ్రంగా తుడిచింది.

"ఏంటోనమ్మా వారం రోజుల్నుంచీ తిన్నది సరిగా అరగడం లేదు. ఒకటే పులితేపులు వస్తున్నాయి. ఆ ప్రసాదు కాడ ఒక బిళ్లన్నా తెచ్చియ్యమ్మా" సుబ్బులమ్మ ఆపసోపాలు పడుతూ చెప్పింది.

"సరేలే" అంటూ మళ్లీ బంకు దగ్గరకు వెళ్లింది రంగమ్మ.

"అమ్మాయ్. ఆ మూలన పిండుంది. తీసుకురామ్మా" అంటూ వచ్చిన వాళ్ళకి టిఫిన్ పెడుతూ కూతుర్ని కేకేసింది.

సుజాత పిండిగిన్నె తేవడంతో "పొద్దెక్కింది కదే! ఇంకా ఏంది అట్నే ఉండావు" అనడిగింది.

"అక్క స్నానానికి వెళ్ళిందమ్మా! ఎప్పటికో గదా బైటికొచ్చేది. ఆమె వస్తేనేగా, నేను పోయేది" చెప్పి లోపలికి వెళ్ళింది.

పెనమ్మీద పిండి వేసి గంటెతో తిప్పుతూ కొట్టుముందు లారీ ఆగడంతో తలెత్తి రోడ్డు వైపు, లారీవైపు చూసింది రంగమ్మ.

లారీలోంచి ఒక మనిషి దిగడం గమనించింది. దూరం నుంచి చూస్తే ఎక్కడో తెలిసిన మనిషి లాగుందే అనుకుంది.

అతను రోడ్డు దాటి కొట్టువైపుకే వస్తుండడంతో అతడి వైపు పరీక్షగా చూసింది.

గడ్డం బాగా పెరిగి, మొఖం పీక్కుపోయి కళ్ళు గుంటలుపడి నీరసంగా నేలచూపులు చూస్తూ వస్తున్న అతణ్ణి పోల్చుకుంది.

'ఓ, సుధాకర్ బావ. టీచ్చరు ఉజ్యోగం జేసేవోడు. ఏంది ఇట్టయిపోయాడు. ఎన్నో లంకణాలు చేసినట్టు ఉండాడు' అనుకుంది.

"ఏంటి బావా! యాణ్ణించి రావడంగ ఏంటి మడిసివి అట్టుండావు. చూసి చాలా రోజు

లైంది" అని పలకరించింది.

"ఏం లేదులే" ముక్తసరిగా సమాధానం చెప్పాడు.

"ఇట్రా, ఇటు కూచో" ముందు వైపున్న కుర్చీ ఒకటి తీసి బంకు వెనకగా వేసింది "కూర్చో ఈ జనాలని పంపించి వస్తా. ఈలోగా మీ అమ్మతో మాట్లాడతావా? "

"ఆమెకేం ముఖం చూపించను? మేము చేసిందానికి ఆమె నాతో మాట్లాడుతుందని ఎట్టనుకుంటాను. ఆ రోజు నుంచి ఈ రోజుకి ఎన్ని సార్లు ఎదురుపడ్డా ఒక్క మాటంటే ఒక్క మాట మాట్టాడలేదు. మళ్లీ ఎందుకు ఆమె ఎదురుగా బోయి కాదనిపించుకోవాల" అంటూ కదలకుండా అక్కడే కూర్చున్నాడు.

"అయితే ఇట్రా, ఇటొచ్చి కూర్చో" పడక కుర్చీని చూరు నీడన వేస్తూ అంది రంగమ్మ.

సుధాకర్ లేచి వెళ్ళి పడక కుర్చీలో కూర్చొని తల్లిని, మరదలుని మార్చి మార్చి చూశాడు.

ఎట్టాంటి మనిషి ఎట్టా అయిపోయింది అనుకుంటూ తన మొండితనం, అన్నగారి స్వార్థం కలగలసి రంగమ్మని ఈ స్థితికి తేవడానికి ఎంతవరకు కారణమో బేరీజు వేసుకోసాగాడు.

తన వరకు ఆలోచిస్తే, అమ్మా, నాన్న, భార్య, అత్తా మామ, ఎవ్వరి మాటా వినకుండా అందర్నీ పెడచెవిన బెట్టి తాను మాత్రం బావుకున్నదేమిటి? అనుకుంటూ పడక కుర్చీకి ఆనుకొని కళ్ళు మూసుకున్నాడు.

అన్నతో సమానంగా, మూర్ఖంగా వ్యవహరించి, ఇద్దరూ కలిసి ఉమ్మడి కుటుంబాన్ని విడగొట్టడం లీలగా కనుసన్నల్లో కదలాడింది.

అదే ఆ రోజు అన్న ఆలోచనలకు ఊతమివ్వకుండా ఉంటే తన బతుకు ఇలా అయిపోకుండా ఉండేదేమో!

ఉద్యోగం ఉండి కూడా తననీ గతికి లాక్కొచ్చిన భూతమేదీ? ఎంత దివిటీ వేసి వెతికినా ఇదే ప్రత్యేక కారణం అని తేలడంలేదు. తన మొండితనం, అభిమానం, అంతకుమించిన తెలియనితనం, డబ్బుంటే లెక్కలేనితనం అన్నీ కలగలసి తన ముందు తిష్ట వేసుకుని కూర్చున్నాయి.

'అసలు పతనం ఎక్కడి నుండి ప్రారంభమైంది' తనని తాను ప్రశ్నించుకున్నాడు.



డబ్బుంటే ఎవడైనా తన కాళ్ళ దగ్గరకొస్తారని, సులభంగా ఎవర్నైనా కొనెయ్యొచ్చనీ, ఎవరికీ స్వంత వ్యక్తిత్వం అంటూ ఉండదని అహంకారంగా ప్రవర్తించే సుబ్బారెడ్డి గుర్తొచ్చాడు సుధాకర్‌కి.

ఒక పక్క ఆశయాలు, ఆదర్శాలు వల్లిస్తూ; మరోపక్క తను గొప్ప మేధావిననీ, తన చాకచక్యంతో ఎవర్నైనా బుట్టలో వేసుకోవచ్చనీ, తన స్వార్థం కోసం తల్లినీ, చెల్లినీ, స్నేహితుల్నీ ఎవర్నైనా బలి చెయ్యొచ్చనే రీతిలో ప్రవర్తించే నయవంచకుడుగా రవిగాడూ గుర్తొచ్చాడు.

నమ్మించి గొంతులు కోసే అనేకమంది మిత్రులు ముందు లీలగా మెదిలారు. వాళ్లకి చేరువ కాకుండా ఉంటేనన్నా జీవితం ప్రశాంతంగా ఉండేదేమో. ఇలా మాయని మచ్చగా మిగిలి ఉండేవాణ్ణి కాదేమో...

కానీ స్నేహమన్నా, స్నేహితులన్నా అప్పటి మోజు అలాంటిది. కళ్లు తెరిస్తేనే నిజం తెలిసొచ్చేది. ఎన్నెన్నిసార్లు వాళ్లని ఆదుకున్నాను. ఎంతెంత డబ్బిచ్చాను. భార్య వారిస్తున్నా వినక ఆమెతో గొడవ పెట్టుకుని ఆమె తాలూకు డబ్బులు కూడ బ్యాంకులో నుంచి తీసి వాళ్లకిచ్చాను. వాళ్ల సమస్యలు నా సమస్యల్లాగా భావించాను. నమ్మిన స్నేహితులే

అవసరాలకు వాడుకుని ఇలా ముంచడం... వాళ్ల వల్లేగా నా దశ ఇలా మారిపోయింది. ప్రతివాడు ముఖం చాటేసిన వాడే; ఎగ్గొట్టినవాడే.

ఆ తర్వాతైనా మేలుకుని ఉండాల్సింది. అదే జరిగితే ఈ ఏడుపెందుకు? శని నెత్తిన తాండవిస్తే ఇలాగే జరుగుతుందేమో. గ్రానైట్ రాయి పట్టుకుంటేనే బంగారమని రెడ్డి, శ్రీను గాడు ఊదరగొడితే అమాంతం సంపాయించాలనే యావలో ఉండి నిజమేననుకున్నాను. డబ్బు చాలక భాగస్తుల్ని కలుపుకుంటే వాళ్లూ దగుల్బాజీలని తర్వాతే గదా తెలిసింది. ఉన్న పొలం అమ్మేసి, తెలిసినవాళ్లందరి దగ్గర అప్పులు చేసి అందులో పెట్టడమెంత బుద్ధి తక్కువ. మొండి నిర్ణయం ఎంత కన్నూ మిన్నూ గానక దూకేలా చేసింది.

వ్యాపారంలో భాగస్తులు పన్నే ఎత్తులు, జిత్తులు, ఆ వ్యాపారంలో ఏం ఉండాలో, ఏం ఉండకూడదో తెలిసేసరికే జరగాల్సిన నష్టం జరిగిపోయింది కదా!

పెట్టుబడులు చాల్లేదంటూ ఆ పార్టనర్ ముండాకొడుకులు తెచ్చే ఒత్తిడికి, ఎట్టయినా పోగొట్టుకున్నచోటే వెతుక్కోవాలన్న సూత్రాన్ని నమ్మడంతో ఎక్కడ అప్పు పుడితే అక్కడ లాక్కొచ్చి వాళ్ళ మొహాన పోశాను.

కనీసం ఆ ఫైనాన్సుల్లో కాలు బెట్టకుండా నన్నా ఉంటే మర్యాద దక్కేదేమో. ఫైనాన్సుల్లో తెచ్చినప్పట్నుండి ఇళ్ళమీద దాడులు ఎక్కువైపోయి ఇల్లు పట్టకుండా తిరగాల్సొచ్చింది. ఇన్ని తిప్పలు పడ్డా ఆ గ్రానైట్ మిల్లు ఆగిపోకుండా ఉంటే బాగుండేది. అదీ జరగలేదు. పీకల్లోతు అప్పుల్లోకి కూరుకుపోయాక ఏడిస్తే ఏం లాభం. ఆ అప్పులోళ్ళ బాధ తట్టుకోలేకేగా కొడుకూ భార్యా కూడా దూరమైపోయారు. చివరికి మళ్లీ ఉద్యోగంలో చేరక తప్పింది కాదు. అప్పటి నుండీ అప్పులోళ్ళ వేధింపులు మరీ ఎక్కువైపోయాయి. ఎక్కడ తప్పించుకు తిరిగినా ఇక్కడ మాత్రం దొరుకుతానని అక్కడికే వస్తున్నారు.

ఇప్పుడా సీతాపతి గాడికి పదివేలు అర్జంటుగా కట్టకపోతే పరువు దక్కేటట్టు లేదు.

ఉన్న పరపతంతా పోగొట్టుకున్న తరువాత ఎవడి దగ్గరకు పోతే ఎవడిస్తాడు.

నా వల్ల బాగుపడ్డ స్నేహితులే మొహం చాటేస్తే ఇంకెవరిస్తారు. ఏ దరీ తోచక మరదలు దగ్గర దొరుకుతాయేమోనని ఆశ చావక మనసు చంపుకొని అడగడానికి వచ్చాను గానీ, అసలు ఏ ముఖం పెట్టుకు, ఇక్కడకు రావాలో అర్థమే గాకపోయెనే! పరిస్థితులే ఎవర్నయినా ఎక్కడికయినా ఈడ్చుకొని పోతాయేమో!

ఎదురుగా తల్లి ఉండి కూడా తనతో నోరు విప్పి మాట్లాడదు. మరదలు లోపల ఏమనుకుంటుందో కానీ పైకి మాత్రం బాగానే పలకరించింది అనుకుంటూ అలా కళ్ళు మూసుకుని ఎన్నో రోజుల తరువాత అయినవాళ్ళు దగ్గరున్నారన్న తృప్తితో గతమంతా వాస్తవంలాగా, వాస్తవంగా జరిగిందంతా గతంలాగా దగా అంతా కలలాగా కళ్ళముందు తిరుగుతూ ఉండగా ఆ అవలో కనంలోనే మగత కమ్మి అలాగే నిద్రలోకి జారుకున్నాడు సుధాకర్.

రంగమ్మ టిఫిన్ సెక్షన్ అయిపోయిన తరువాత వచ్చి చూసి సుధాకర్ నిదురపోతుండడంతో అంట్లగిన్నెలు ముందేసుకుని కూర్చుంది. అతడు లేవడం జూసి చేతులు కడుక్కుని పైట చెంగుకు తుడుచుకుంటూ దగ్గరగా వచ్చింది.

"అక్కడ ఎండగా ఉంది. నీడన యేస్తాలే" అనడంతో సుధాకర్ లేచాడు. కుర్చీతీసి నీడన వేసి, ఎదురుగా ఒక రేకు కుర్చీ వేసుకుని తను కూర్చుంది.

తల వంచుకొని గోళ్ళు గిల్లుకుంటూ ఉన్న సుధాకర్‌ను చూస్తుంటే రంగమ్మకు ఎలాంటి భావమూ కలగడం లేదు. అతడు వచ్చాడన్న ఆనందమూ లేదు. అలాగని ఎందుకొచ్చాడన్న నిరసనా లేదు.

"అక్క బాగుందా! కొడుకేం జేస్తున్నాడు" అప్పటివరకూ ఇద్దరి మధ్యా ఉన్న మౌనాన్ని ఛేదిస్తూ అడిగింది.

ఈమె తెలిసే కావాలని అడుగుతోందా, లేక నిజంగా తెలియదా ఇద్దరి మధ్యా ఏదో పెద్ద అగాధం ఉందని అనుకుంటున్నాడు. నన్ను వెక్కిరించడానికి అడగలేదు కదా! చెబుదామా, వద్దా అన్న తర్కం తరువాత "బాగుంది" అన్నాడు ఏదైతే అది అవుతుందని.

ప్రశ్నలు వింటుంటే.

గతాన్నంతా పెళ్ళగించి, మళ్ళీ ఒక్కొక్క ఓటమే గుర్తుకు తెచ్చి నువ్వొట్టి వెధవ్వి. జీవితంలో ఏ కోశానా నువ్వు ఒక మనిషివిగా బతకలేదు అన్నట్టుంది, ఆమె ముందు కూర్చుంటే.

"కొడుకు సంగతి చెప్ప



"కొడుకేం జేస్తున్నాడు? " మళ్ళీ ఆమె నోటి నుండి మరో ప్రశ్న.

వెటకారమేనా! ఏమో! నిండా మునిగిన వాడికి చలేముంది. ఏం మిగిలిందని జీవితంలో పరాజయం ఏవైపునుండీ నన్ను విడిచిపెట్టలేదు కదా!

ఎవరో వచ్చి టీ అడగడంతో రంగమ్మ లేచి బంకు దగ్గరకు వెళ్ళింది.

తరచి తరచి లోతులను శోధిస్తోందా అన్నట్టుంది సుధాకర్‌కు ఆమెను చూస్తుంటే, ఆ

లేదేం బావా!" వచ్చి మళ్ళీ ఎదురుగా కూర్చొని అడిగింది రంగమ్మ.

అతడివంక శోధిస్తున్నట్టుగా ఉన్నాయి ఆమె చూపులు.

"ఏదో ప్రైవేటు కంపెనీలో పనిచేస్తున్నాడు" యోగక్షేమాలు చెప్పే స్థితిలో లేడు. అడిగే స్థితిలో కూడా లేడు. అందుకే వచ్చినప్పటినుండీ ఒక్కమాట కూడా మాట్లాడకుండా మౌనంగా పోగొట్టుకున్న దాన్నంతా శూన్యం లో వెతుక్కుంటూ ఆమె అడిగే ప్రశ్న

లకే సమాధానం చెబుతూ కూర్చున్నాడు.

రంగమ్మ ముందు కూర్చున్న సుధాకర్‌లో పరాభవ భావం తొణికిసలాడటం ఆమె చూస్తూనే ఉంది.

అందుకే ఏ కోశానా ఆయన్ను అవమానించే ఉద్దేశం ఆమెలో కలగడం లేదు. ఇప్పుడు తను ఈ విధంగా ఉండడానికి అతనూ ఒక కారణమైనా ఆ కారణాలను ఆమె గుర్తు తెచ్చుకొని ఆయనపై నిప్పులు కక్కాలనీ గానీ లేదా వెటకారంగా మాట్లాడాలని గానీ ఆమెకు లేదు.

పడేవన్నీ కష్టాలనే విషయం ఎప్పుడో మరిచిపోయింది. భగ్గుమన్న కుంపటి చుట్టూ వస్తున్న వేడిసెగలు తట్టుకుంటూ కూడా ఖచ్చితంగా బతకాలనే ఆమె ఎప్పుడో నిర్ణయించేసుకుంది. ఖచ్చితంగా ఇదే జీవితం. ఇలాగే జీవించాలి అనే భావన పోయి, సముద్రపు ఒడ్డున వచ్చే ప్రతి అలనూ తట్టుకునే ఒడ్డులా నిలబడింది.

గత జీవితం నాది కాదు. ఇదే నా జీవితం. ఇలాగ జీవించాలని ముఖాన గీత గీసుంది. ఎవరు మాత్రం తప్పించగలరు. నా చేతగానితనం నన్నింతకు దిగజార్చింది అన్న భావంతో సుధాకర్ ఉన్నాడు.

పరాజయ భారంతో భూమిలోకి కుంగిపోకుండా నిలదొక్కుకుని వాళ్ళు ఉన్నారంటే ఏదో దృఢమైన బలం వాళ్ళని ఆవహించి ఉంది.

ఒక్కొక్క మాటకూ, సమాధానానికీ, ప్రశ్నకూ మధ్య ఎంతో శూన్యం చోటు చేసుకుంటోంది.

మనసుల నిండా విప్పదియ్యలేని పీట ముళ్ళు, ఏనుగు మెలికలు. ఆప్యాయంగా మాట్లాడటానికి వాళ్ళిద్దరి మధ్యా ఏ సందర్భాలూ కనిపించడం లేదు.

"అమ్మా మేం వెళ్లొస్తాం. కూతుళ్ళిద్దరూ బ్యాగులు తగిలించుకొని బయటికొచ్చి అమ్మ వైపూ, ఎదురుగా కూర్చున్న పెదనాన్నవైపూ చూశారు.

ఆయన వాళ్ళని పలకరించలేదు. వాళ్ళూ ఆయన వైపు చూశారేగానీ, ఎందుకు మాట్లాడలేకపోయారో వాళ్ళకూ తెలియలేదు.

నడుచుకుంటూ వెళుతున్న ఆ ఇద్దరి వైపు ఈ ఇద్దరూ చూస్తుండిపోయారు. వాళ్ళమధ్య చుట్టరికాలు తెగిపోయి మధ్యలో పెద్ద పెద్ద అగాధాలు చోటుచేసుకుని చాలా కాలమైంది. ఆ అగాధాలు దాటడానికి ఎవరికీ ఓపికా, సహనం, తీరికా లేవు. అంతకుమించిన ఉత్సాహమూ లేదు. అందుకే ఆ పిల్లలిద్దరూ నిర్లిప్తంగా రోడ్డుమీదకు వెళ్లిపోయారు.

సుధాకర్‌కూ అంతకంటే గాఢమైన అనుబంధం మనసులో నుండి పొడుచుకొని రాలేదు. వాళ్ళవంక జూస్తూ "ఎక్కడ పని చేస్తున్నారు? " అడిగాడు.

"ఎక్కడో ప్రైవేటుగానే చేస్తున్నారు. వాళ్ళేమన్నా బాగా చదివారా మంచి ఉద్యోగాలు చెయ్యడానికి"

ఆ సమాధానం వెనుక ఉన్న గూఢార్థాన్ని శోధించడానికి ప్రయత్నించాడు.

"అమ్మాయ్ ఇట్రామ్మా" ఇంట్లో నుండి ముసలమ్మ పిలుపు విని ఇంట్లోకి వెళ్లింది రంగమ్మ.

ఎంతో దూరాన ఉన్నప్పుడు కూడా ఎంత అనురాగంగా ఉండేది అమ్మ. ఇప్పుడు నాలుగడుగుల దగ్గరుండీ కూడా, చావు పల్లకీ ఎక్కబోయే దశలో ఉన్నా ఒక్క మాట మాట్లాడలేనంత దూరంలో ఉండిపోవాల్సొచ్చింది.

ఒకవేళ వెళ్లి పలకరించినా ఆమె కళ్ళనిండా తొంగిచూసే చీత్కారాలు తట్టుకునే శక్తీ, ఓపికా నాకు లేవు. ఏ గాయాల్లోకో ఈడ్చుకెళ్ళే ఆమె చూపులు తట్టుకునే ధైర్యమూ లేదు.

అయినా ఒక్కసారి లేచి బయటనుంచె ఆమెను తొంగి చూశాడు.

సుధాకర్ తొంగి చూడటంతో ఆమె తలెత్తి అతడి వంక చూసింది. నిరసనగా వంచుకుందో, కనపడి కనపడీ వంచుకుందో కానీ చూపు మరల్చి తల వంచుకుంది.

గతం తాలూకు విషాదం తల్లి ముఖాన్ని పూర్తిగా కమ్మేసింది. ఆమె మొఖంలో కనిపించే ఒక్కో ముడతా ఒక్కో మలుపుగా అని

పించింది సుధాకర్‌కి.

రంగమ్మ మంచినీళ్ళు తీసుకెళ్ళి కొడుకు తల దగ్గరే ఉన్న బిళ్ళలు తీసిచ్చింది. అతడవి వేసుకున్న తరువాత మంచినీళ్ళు ఇచ్చి తాగిన తరువాత గ్లాసు తీసుకొని వచ్చింది.

ఈయన ఎందుకొచ్చాడో తొందరగా పోతే బాగుండు. పనంతా అక్కడే ఉండిపోయింది అనుకుంది రంగమ్మ.

ఎట్టా అడగాలి. ఒకవైపు వీళ్ళ పరిస్థితి చూస్తూనే ఉన్నాను. అయినా ఎండమావి లాంటి ఆశ. ఒకమాట అడిగితేనో! గొంతులో ఎన్నెన్ని అవాంతరాలు పట్టి ఆపుతున్నాయో!

దగ్గరి చుట్టరికం. అయినా మధ్యలో ఎన్నెన్ని సముద్రాలు. ఎంతో చనువుగా, స్వంతంత్రంగా ఉండాల్సిన ఇద్దరు ఎదురెదురుగా కూర్చున్నా వారి మధ్య కనిపించని పర్వతాలు, లోయలు.

చల్లకొచ్చి ముంత దాచడమెందుకు. ఎవరో బలవంతంగా ముందుకు నెట్టినట్టుగా "నీ దగ్గరకు ఒక పనిమీదొచ్చాను." ఎవరో దూరపు బంధువుతోనో, అపరిచిత వ్యక్తితోనో మాట్లాడుతున్నట్టు భయం భయంగా పెదాలు వణుకుతుండగా అడిగాడు.

ఏమిటన్నట్లు అతడి ముఖం వంక జూసింది.

"నాకు కాస్త డబ్బు కావాలి" ఆ మాట పెగిలిరావడానికి లోపల ఎన్నో అగ్నిపర్వతాలు బద్దలయ్యాయి.

ఆమె మౌనంగా, ఇదే నా సమాధానం అన్నట్టు అతనివంక చూసింది. "ఫైనాన్స్ వాళ్ళు స్కూలు దగ్గరకొస్తున్నారు. రేపు డబ్బు కట్టకపోతే తంతామన్నారు. ఆదుకునేవాళ్ల ఇంకెవరూ కనపళ్ళేదు. నువ్విస్తే మళ్ళీ ఎప్పుడు ఇస్తానో కూడా చెప్పలేను" నిజాయితీగా చెప్పాడు.

అతనిలో ఏ కోశానా కాపట్యం మిగలలేదనిపించింది రంగమ్మకు - ఆ మాటలు విన్న తరువాత.

"నువ్వియ్యటానికైనా, ఇయ్యకపోవటానికైనా నా దగ్గరుంటే గదా! వచ్చినప్పటి నుండీ చూస్తూనే ఉన్నావు కదా! గడియైన తీరిక లేకుండా వళ్ళరగ తీసుకుంటానే ఉండాను. పిల్లలిద్దరూ కూడా కష్టపడుతూనే ఉన్నారు. కొడుకుండి కూడా ప్రయోజనం లేదు. ఇంతమంది కొడుకులుండీ మీ అమ్మనూ నేనే భరిస్తున్నాను. ఇయ్యన్నీ ఇట్టున్నా, నా బాకీలు నన్ను ఎంతకీ వదిలి పెట్టడంలేదు. నిద్దట్లో కూడా భూతాల్లా భయపెడుతూనే ఉన్నాయి. అయినా నన్నెట్టా అడుగుదామని వచ్చావు. ఇన్ని బాదరబందీలు చూసి కూడా ఎట్టా అడగాలనిపించింది" కాస్తంత బాధను పంచుకోవాలని ఏ మూలనో అనిపించగా ఆ నాలుగు మాటలు మాట్లాడింది.

"నిజమే అన్నీ తెలిసే ఇక్కడికి వచ్చానంటే ఏ గత్యంతరమూ లేకనే కదా లేకుంటే ఎందుకు వస్తాను" తలవంచుకునే సమాధానం చెప్పాడు.

పరిస్థితులు ఆమెకూ చూచాయగా తెలుస్తూనే ఉన్నాయి. అయినా ఇప్పుడు తను చెయ్యగలిగే సహాయమేమీ లేదు. ఆ విషయం ఆయనకూ అర్థమౌతూనే ఉంది.

ఇప్పుడెలా! ఎలా...

మళ్ళీ పయనమే... గమ్యం లేని పయనమే. తూరుపుగా ఎంత దూరం వెళ్ళాలో... ఇప్పుడేమిటి? ఉన్నట్టుండి ఇక్కడి నుండి మాయమైపోవాలని ఉంది. ఎలా? శూన్యం

**దగ్గరి చుట్టరికం. అయినా మధ్యలో ఎన్నెన్ని సముద్రాలు. ఎంతో చనువుగా, స్వంతంత్రంగా ఉండాల్సిన ఇద్దరు ఎదురెదురుగా కూర్చున్నా వారి మధ్య కనిపించని పర్వతాలు, లోయలు**

లోకి చూపులు సారించాడు. అక్కడ గడుస్తున్న ప్రతి క్షణం ముళ్ళమీద కూర్చున్నట్టే ఉంది. ఎప్పుడెప్పుడు లేచి వెళ్ళిపోదామా అనిపిస్తోంది సుధాకర్‌కు.

"సరే వస్తానయితే" మరదలు ఏమన్నా అనుకుంటుందేమో అనుకున్నాడు.

ఆమెకు కావలసిందీ అదే కావటం మూలాన లోలోన సంతోషపడి "భోంచేసి వెళుదువుగానీ ఉండు" మాటవరసకి అంది.

వాళ్ళిద్దరి మధ్యా ఉన్న బంధుత్వం మాత్రమే ఇప్పటిదాకా రంగమ్మను అక్కడ కూర్చోబెట్టింది. ఇంకెవరన్నా అయితే అంత సమయం కేటాయించే తీరిక ఆమెకు లేదు.

ఆయన మనసులోనూ, ఆమె ఆలోచనల్లోనూ ఒకటే భావన ఊగిసలాడుతోంది.

కాలం విలువ తెలియడం కంటే ప్రతీక్షణం వెన్నంటి ఉండే పనులే ఆమెను బరబరా ఈడ్చుకుపోతాయి.

"వెళ్ళొస్తాను" లేచి నిలబడ్డాడు.

ఆమె నుంచి ఎలాంటి సమాధానమూ రాలేదు.

నాలుగు అడుగులు వేసి మళ్ళీ వెనక్కు తిరిగి చూశాడు. కొంతదూరం పోయి ఆగాడు. మళ్ళీ రోడ్డు మీద ముందుకే నడక సాగించాడు.

అన్నం కూడా తినకుండా వెళ్ళిన బావను చూస్తే ఒకప్పుడైతే అయ్యో అని చాలా బాధపడేది. ఇప్పుడు అంత తీరికా, ఓపికా, ప్రేమానుబంధాలను వలకపోసుకునే అవసరమూ ఆమెకు లేవు.

రాత్రీ పగలూ ఎంత సహజంగా వస్తున్నాయో సూర్యుడు, చంద్రుడు ఎలా కనిపిస్తున్నారో, ఆమె కూడా లేచినప్పటి నుండి పడుకోబోయేంత వరకూ కష్టపడడం అంత మామూలుగానే జరిగిపోతూ ఉంది.

పెద్దోళ్ళిద్దరూ వాళ్ళ స్వార్థం చూసుకోకుండా ఉమ్మడిగా ఉంటే ఎంత బాగుండేది! ఈ ఒంటరిపోరాటం చెయ్యాల్సిన పనుండేదా! ఈపాటికి మనమలూ, మనుమరాళ్ళతో ఎంతో సుఖంగా హాయిగా ఏ వేపచెట్టు కిందనో, ఏ చావిడి దగ్గరో ఆడుకుంటూ, ఆనందంగా గడిపేసేదాన్నేమో!

వెళ్ళిపోయి వాళ్ళు ఇయ్యాల బావుకున్నదీ లేదు. ఎవరయినా ఉద్ధరించిందీ లేదు. అందర్నీ కష్టనష్టాల ఊబిలోకి నెట్టి, వాళ్ళూ ఆ లోతు తాలూకు ఫలితాన్ని అనుభవిస్తున్నారు.

ఎప్పుడన్నా ఎవ్వరైనా కొత్తవాళ్ళకు జరిగిన సంగతులూ, ఊళ్ళో విషయాలూ చెబితే పిచ్చిదాన్ని చూసినట్టు చూసి నిజమేనా అన్నట్టు అయోమయంగా చూసేవాళ్ళు.

ఎంత మంచి రోజులవి అనుకుంటూ నిట్టూర్చింది.




"అమ్మాయ్! సుజాతా! ఇట్రామ్మా! కొట్టు దగ్గర చూస్తుండు. పక్క బజార్లోని శంకరమ్మ డబ్బులివ్వాలి అడిగొస్తాను" రంగమ్మ చీర సరిచేసుకుని కుచ్చిళ్ళు దోపుకుంటూ కూతుర్ని పిలిచింది.

"ఇప్పుడే కదంటమ్మా వచ్చింది నేను. రాగానే కొట్టు చూడమంటే ఎలా? ఒళ్ళంతా నెప్పిగా ఉంది నేను రాను" అంది సుజాత లోపలినుంచే.

"ఎట్టమ్మ, అట్టయితే. రోజూ పిలుస్తున్నానా! పనుందనే కదా పిలిచింది. ఆ శంకరమ్మ రోజూ టిఫిను తీసుకుపోతుంది. అప్పు పెరిగిపోయింది గానీ డబ్బులు మాత్రం ఇయ్యటంలా. ఇక్కడ ఎవరన్నా ఉంటే కానీ నేను కదలడానికి లేదుగా, రామ్మా" అనడంతో అయిష్టంగానే ఎన్ని రోజులు పడాలో ఈ

బాధ అనుకుంటూ కొట్టు ముందుకి వచ్చింది.

రంగమ్మ పక్కింటి కాంతమ్మని పిలిచి తనకు తోడుగా రమ్మని అడిగింది. ఆవిడ సరేననడంతో ఇద్దరూ కలిసి బయలుదేరారు.

ఇద్దరూ నడుస్తూండగా దారిలో కాంతమ్మ "అవునే కూతురుకి సంబంధం వచ్చిందంటగా ఏమైంది? " అనడిగింది కాంతమ్మ.

"ఏం జెప్పమంటావే! నాకు సంబంధించింది ఏదైనా మూడడుగులు ముందుకి పోతే నాలు గడుగులు యెనక్కి పోతోంది. నా మొకాన రాసినట్టే వాళ్ళమొకాన కూడా ఆ దేవుడు దరి ద్రపు రాతలే రాశాడే!"

"పీకల్లోతు అప్పుల్లో కూరుకుపోయు న్నామా! అప్పులో అప్పు. ఎలా అయితే అలా అవుతుంది. ఎంతకాలం పిల్లనిట్లా ఇంట్లో బెట్టుకుని దానిచేత చేయించుకుంటాం. పిల్ల పేరు మీద ఉన్నయి కాసిని, ఇంకాసిని ఎక్క డన్నా తెచ్చి ఎవరో ఒకళ్లు గంతకు తగ్గ బొంతను ముడిపెట్టేద్దామనుకుంటే ఆ గీత ముందుకి రాకపోతే ఎవరెన్ని చేసినా లాభ మేముంది? పిల్లాడు అదేదో ప్రైవేటు కంపె నీలో ఉజ్జోగం చేస్తాడట. వచ్చి చూసిపో యాడు. పిల్ల పిల్లోడికి నచ్చింది. ఇద్దరూ మాట్టాడుకున్నారు. ఎల్లిపోయాడు. ఆ తర్వాత ఏమైందో మళ్లీ మాటా లేదు, కబురూ లేదు" అని చెప్పింది.

సందు మలుపు తిరిగి నాలుగడుగులు ముందుకేశారో లేదో, అల్లంత దూరాన కన బడుతున్న దృశ్యాన్ని చూపిస్తూ, కాంతమ్మ రంగమ్మ చేయితట్టి అటు చూడు అన్నట్లు సైగ చేసింది.

"నీకు డబ్బులియ్యాల్సిన శంకరమ్మ ఎవరి మీదో కలియబడుతోంది చూడు"

కాంతమ్మ సైగ, మాటలతో అటుచూసిన రంగమ్మకు శంకరమ్మ పెద్దగా అరుస్తూ ఎవ రిమీదో విరుచుకుపడడం కనిపించింది. 'ఇప్పుడు పోయి దాన్ని డబ్బులు అడిగితే పైన పడి పీకేటట్టుంది. ఏం చేయాలి' అను కుంటూ నిలబడిపోయింది రంగమ్మ.

అంతలోనే, రెండిళ్ల ముందు నుంచుని శంకరమ్మ ఇంటి ముందు గొడవ చూస్తున్నా విడ దగ్గరకెళ్లి "ఏంటి, అరుణమ్మా ఏమిటా గొడవ? " అనడిగింది.

ఆవిడ తలతిప్పి చూసి పలకరింపుగా నవ్వి "ఏమిటి దారి తప్పి ఇటొచ్చారు" అంది.

"అదిగో గొంతంతా చించుకుని అరుస్తూ రణం చేస్తాందే దానికోసమే వచ్చా. తినేట ప్పుడు బాగా మెక్కింది. డబ్బులడిగితే మొహం చాటేసింది" రంగమ్మ చెప్పింది.

"దాని బుద్ధే అంత. నా దగ్గర చీర కొని డబ్బులు ఎగ్గొట్టింది. సంవత్సరం దాటిపో యినా రూపాయి ఇవ్వదు. గట్టిగా అడిగితే తగాదా పెట్టుకుంటది. చూడు పాపం! ఆ పిల్లాడిమీద అమ్మా, కొడుకు, కోడలు ఎలా ఇరుచుకుపడుతున్నారో. వాడు పళ్లమ్ముకునే వాడు. బాకీపెట్టి తిన్నారు. డబ్బుల్లేక బండి పక్కన పడేసి బాకీల వసూళ్ల కోసం తిరు గుతున్నాడు. ఆ ముసల్దాన్ని గట్టిగా డబ్బు లడిగాడు. దాంతో వాడిమీద తగాదా వేసు కోని ఇంట్లో వాళ్ళందరూ కలియబడి ఎట్టా కొట్లాతున్నారో చూడండి" అంటూ అక్కడి దృశ్యాన్ని చూస్తూ చెప్పింది అరుణ.

"మేమొచ్చింది కూడా అందుకేగా! అయినా ఇప్పుడు పోయి దాన్ని అడగడం అంత నామర్దా ఇంకోటి లేదులే" భయం భయంగా అంది రంగమ్మ.

"ఇక్కడదాకా వచ్చింది కూడా దండగే! ఎలాగైనా ఇవ్వాళ డబ్బులు వసూలు జేద్దా మని వచ్చాను. అసలు శకునమే బాగోలే దులే ఇవ్వాళ. ఇంకో రోజొద్దాం కాంతమ్మా. వస్తాం అరుణమ్మా" అంటూ రంగమ్మ వెను దిరిగింది. కాంతమ్మ అనుసరించింది.

ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి కొడుకు 'అమ్మో, అయ్యో' అంటూ కేకలు పెడుతు న్నాడు. దూరాన్నించే ఆ కేకలు విని "కాంతమ్మా! మావోడేంటో కేకలు వేస్తు న్నాడే వస్తాను" అంటూ పరుగెత్తుకుంటూ రాంకోటయ్య దగ్గరకు వెళ్ళింది రంగమ్మ.

మనిషి మెలికలు తిరిగిపోతున్నాడు. కిందబెట్టిన నీళ్ళ చెంబు దొర్లిపడిపోయింది.

మంచమ్మీద దుప్పటి కుప్పయిపోయింది.

"ఎందుకొచ్చిన గ్రాచారంరా నాయనా! ఉన్న రోగం జాలక కాళ్ళూ చేతులూ ఇరగ్గొట్టుకుంటివి. ఈ రోగమ్మీద అవి తొందరగా కట్టుకుంటయ్యా. ఏంటి? ఏమైంది? ఎందు కట్టా చెవికోసిన మేకలాగా అరుస్తున్నావు" కసురుకుంది.

రాంకోటయ్య తల్లివైపు బాధగా చూశాడు. కానీ ఏం మాట్లాడలేదు.

"ఏందిరా ఏమైందంటే చెప్పవే" వాడిని చూసి కడుపు తరుక్కుపోతోంది రంగమ్మకు.

"కడుపులో నొప్పమ్మా. భరించలేకపోతు న్నాను. విపరీతమైన నొప్పి. చచ్చిపోవాలనిపిస్తోంది. ఏదన్నా మందుంటే ఇయ్యమ్మా తాగి చస్తాను" అంటూ ఏడుపు మొదలెట్టాడు.

"ఆ మాటెందుకులే ఉండు. ప్రసాదుని పిల్చుకొస్తాను" అంటూ పరుగు పరుగున వెళ్ళి డాక్టర్ ప్రసాదుని పిల్చుకుని వచ్చింది.

"ఎలా ఉందిరా? " పొట్ట నొక్కి చూస్తూ అడిగాడు డాక్టర్.

"భయంకరమైన నొప్పిగా ఉంది. కడుపు ఉబ్బరంగా ఉంది. తిన్నది అస్సలు అరగడం లేదు" ఏడుస్తూనే చెప్పాడు రాంకోటయ్య.

ప్రసాదు అర్థమైనట్టుగా తలూపాడు. వీడికి కామెర్లు రంగమ్మా" అంటూ సిరంజీ తీసి ఒక ఇంజక్షన్ చేశాడు. "ఇంటికి రా టాబ్లెట్లు ఇచ్చి పంపుతా" అన్నాడు.

ప్రసాదు వెనకే వెళ్లింది రంగమ్మ.

"ఇదుగో రంగమ్మా, నువ్వు వాణ్ణి భరించ లేవు గానీ, వీళ్లకి గవర్నమెంటు హాస్పిటళ్ళు ప్రత్యేకంగా ఉన్నాయి. అక్కడ జేర్చు అన్నీ వాళ్ళే చూసుకుంటారు" సలహా చెప్పాడు.

"అక్కడ మన పిల్లోణ్ణి మనం చూసుకున్నట్టు జూసుకుంటారయ్యా. ఇక్కడంటే దగ్గిరుండి అన్నీ మేం చూసుకుంటున్నాం. అక్కడొదిలేస్తే నాకు బాగ లేకపోతే చూడకుండా ఎక్కడో పారేసింది మామ్మని నన్నాడిపోసు కోడా వాడు" అంటూ తన సందేహాన్ని వ్యక్తం చేసింది.

"లేదు రంగమ్మా. ఇక్కడ నువ్వేం చూస్తున్నావు. అక్కడ కావలసినంతమంది జనం ఉంటారు. నర్సులుంటారు-ప్రత్యేకంగా వీళ్లని చూడడానికి. మనకంటే బ్రహ్మాండంగా చూస్తారు. ఇక్కడ ఈ నరకం అనుభవించే కంటే అక్కడ నలుగుర్లో ఉన్నాడనుకో ఆ బాధే తెలియకుండ గడిచిపోతుంది. వాళ్లే మందులిస్తారు. ఒకసారి నేను వెళ్ళి చూసొచ్చా. అందుకే చెబుతున్నా. డబ్బు లేనోళ్ళంతా అక్కడే చేరుస్తారు. నువ్వు గూడా ఆ పని చెయ్యి. ఎప్పుడన్నా పోయి చూసు కొని వస్తుండొచ్చు. అక్కడ అందరూ వాళ్లే కాబట్టి ఈ బాధలు గూడా మరిచిపోతాడు. అక్కడ చేర్చావంటే వాణ్ణి ఈ నరకం నుండి తప్పించిన దానివవుతావు" అని ప్రసాదు నచ్చజెప్పాడు.

డాక్టరు మాటలకు రంగమ్మకు చాలా ఊరట కలిగింది. ఒక బరువు తగ్గినా తగ్గినట్టే అనుకుంది. వాడి బాధ చూస్తుంటే కడుపు తరుక్కుపోతోంది. అటు ముసలమ్మ ఇటు ఈడికీ చెయ్యలేక పేణాలుడిగి పోతున్నాయి. కానీ అక్కడికి తీసికెళ్ళి ఎవురు జేరుస్తారు? ఒక్కపూట లేకపోయినా ఇక్కడ జరగదాయె అనుకుంది.

"బాబూ అదేదో కాస్త నువ్వే చూడయ్యా. నీకు ఎవరూ తెలియర్నైతిరి. దిక్కూ దివాణం లేని దాన్నయితిని. కాస్త ఆ సహాయం జేసి పుణ్యం కట్టుకో బాబ్బాబు... నీకు రుణపడి ఉంటాను. ఖర్చులకి నేను డబ్బులిస్తానయ్యా. వాణ్ణి కాస్త ఆదారి జెయ్యి" అంటూ ప్రాధేయపడింది.

"సరే కనుక్కుంటాలే" అంటూ డాక్టర్ ప్రసాద్ భరోసా ఇవ్వడంతో రంగమ్మ ఊపిరి పీల్చుకుంది.

ఆ రోజు నుండి ప్రతి నిత్యం ప్రసాదు 'దగ్గిరకు వెళ్ళి కనుక్కున్నావా లేదా! ఎప్పుడు చేరుస్తావు' అంటూ వాకబు చేస్తూనే ఉంది.

ప్రసాదు తెలిసిన వాళ్ళ ద్వారా కనుక్కుని రాంకోటయ్యను పునరావాస కేంద్రంలో చేర్చే వరకు రంగమ్మ వెంట పడుతూనే ఉంది.

చేర్పిన తరువాత అయ్యో కొడుకు దూరమైపోయాడే అనుకుని కొన్ని రోజులు బాధ పడింది. అయితే కళ్ళ ముందుంచుకుని ఆ నరకం చూసేకంటే అక్కడ చేర్చడమే మేలని, గుబులు మళ్ళినప్పుడు వెళ్ళి చూసి రావొచ్చు కదా అని సమాధానపడింది.

అయ్యప్ప స్వాముల సీజన్ కావడం వల్ల టిఫిన్‌కి ఎక్కువ గిరాకీగా ఉంటోంది. ఆ పని ఒత్తిడిలో పడి కొడుకు సంగతి నెమ్మదిగా మర్చిపోయింది.




ఆ రోజెందుకో విసుగ్గా ఉంది. పొద్దుటి నుండి చేసిన ప్రతి పనీ మళ్లీ చేసుకోవాల్సి వస్తోంది. కొట్టు ముందు అయ్యప్ప స్వాములు ఎక్కువగా ఉన్నారు. పిండి అయిపోవడంతో ఇంట్లోకి వెళ్ళి పిండి గిన్నె రెండు చేతుల్తో పట్టుకుని వస్తుంటే చెయ్యి జారి కింద పడిపోయింది. పిండంతా నేలమీద పడింది. పైపై పిండి గిన్నెలోకి ఎత్తుకుంటూ "ఛీ ఇవ్వాళ ఎవరి మొకం చూశానో" అని విసుక్కుంటూ గిన్నెలోకి ఎత్తిన పిండిని బల్ల దగ్గరకు తీసుకువచ్చి అప్పటికే ఎదురు చూస్తున్న వాళ్లకి దోసెలు వేస్తోంది.

పెనం మీద దోసె సరిగా రాకుండా విరిగిపోవడంతో," ఏంటివ్వాళ ఏం దరిద్రం నెత్తికెక్కిందో ఏ పనీ కావడం లేదు" అనుకుంటుంటే ఆలస్యమౌతోందని కొందరు స్వాములు ఎదురు కొట్టు దగ్గరికి వెళ్ళిపోయారు.

వెళ్లిపోయేవాళ్ళని చూస్తుంటే ఒక్కక్షణం కాలుచేయి ఆడలేదు. ఇంతకు ముందంతా ఎక్కడ తిన్నారు. చుట్టుపక్కల ఎక్కడా లేకపోతే ఎంతసేపైనా ఇక్కడే పడిగాపులుగాసేవోళ్ళు.

'ఇప్పుడు మంచి సీజన్ జూసి ఎదురుగానే దుకాణం పెట్టింది అదెవతో. ఇక్కడ నేనేదో సంపాయించి పోసుకుంటన్నానని ఎంత మంది కళ్ళల్లో నిప్పులు పోసుకుంటన్నారో! నా రాత బాగలేక ఈళ్ల పాలబడ్డాను గానీ లేకుంటే ఈళ్ళందరితో ఏంటి నాకు' అనుకుంటూ ఉన్నవాళ్ళకే దోసెలు పెట్టింది.

అప్పటికే చాలా పొద్దుపోయింది. పొద్దు గూకక ముందే చిన్నకూతురు ఇంకా రాలేదేమా అనుకుంది. అంతలో పెద్దకూతురు రావడంతో "ఇయ్యాల నువ్వు ముందొచ్చావు. అదేదీ, ఇంకా రాలేదు" అనడిగింది.

"ఇంకా రాలేదా! ఇవ్వాళేమన్నా ఎక్కువ పనుండి ఉండమన్నారేమో" బ్యాగ్ ఇంట్లో పెడుతూ అంది సుధారాణి.

"ఎంత పనున్నా ఈ జాముదాకా ఉండదే" అంట్లు తోముకుంటూ అనుమానం వెలిబుచ్చింది.

పనులన్నీ అయిపోయేదాకా రోడ్డువైపు చూస్తూనే ఉంది. అయినా కూతురు వస్తున్న జాడేమీ కనబళ్ళేదు.

"అమ్మాయ్ వెళ్లి ఫోనన్నా జేసి రామ్మా!" మనసులో ఏదో తెలీని భయం పీకుతుండగా అంది.

అలసటతో పడుకుని ఉన్న సుధారాణి "వస్తుందిలేమ్మా. ఇప్పుడు అక్కడదాకా ఎవరెళతారు" అంది కానీ లేవలేదు.

"చాలా పొద్దుపోయింది నేనన్నా పోయొస్తా" అంటూ టెలిఫోన్ బూత్ దగ్గరికి వెళ్లి సుజాత పని చేసే షాపుకి ఫోన్ చేసింది. రింగవుతోంది కానీ ఎవ్వరూ ఎత్తడం లేదు.

రంగమ్మకి ఇంకా గాభరా పెరిగిపోయింది. పరుగులాంటి నడకతో ఇంటికి చేరి "అయ్యో షాపు కూడా మూసేసినట్టున్నారే! రింగవుతోంది కానీ ఎవరూ ఫోన్ ఎత్తడం లేదు" కూతురుతో ఆందోళనగా చెప్పింది.

రంగమ్మ ఇంట్లోకీ బైటకీ కాలుగాలిన పిల్లిలా తిరుగుతుండటంతో "ఏందే అమ్మాయి ఇంకా రాలేదా! ఏంటి" అడిగింది ముసలమ్మ.

"ఇంకా రాలేదమ్మా. ఎటెల్లిందో ఏంటో" సమాధానమిచ్చిన రంగమ్మ గొంతులో గుంపెడంత ఆదుర్దా. ఇవ్వాళ జీతం ఇచ్చేరోజు కూడా డబ్బులు తీసుకుని ఎటుపోయిందో ఏమో. మనసు పరిపరి విధాలుగా ఆలోచిస్తోంది.

ఇంక లాభం లేదనుకొని సుధారాణిని లేపింది "లేమ్మా అదింకా రాలేదు. షాపులో కూడా లేకపోతే ఇంకెక్కడికి పోయిందో అర్థం కావడం లేదే" వణుకుతున్న స్వరంతో అంది.

"అమ్మా! ఎందుకంత కంగారుపడతావు. చెప్పా పెట్టకుండా సినిమాలకి వెళ్లడం దానికి అలవాటేగా. పైగా ఇవ్వాళ జీతాల రోజు కాబట్టి ఎవరితోనో సినిమాకి చెక్కేసి ఉంటుంది. నువ్వు స్నానంజేసి అన్నం తిని పడుకో. అదే వస్తుంది" ధైర్యం చెప్పింది సుధారాణి.

"పోయినసారి వెళ్లినప్పుడు గట్టిగా తిట్టానని అప్పటినుంచి చెప్పా పెట్టకుండా ఎక్కడికీ పోవటం లేదే" అంటూనే స్నానం చేసి, అన్నం తింటూ కూడా రోడ్డువైపే చూస్తూండిపోయింది.

చాలాసేపు బయటే పడక కుర్చీ వేసుకుని కూర్చుని ఎదురుచూస్తూ అలాగే నిద్రలోకి జారిపోయింది. మెలకువ వచ్చినప్పుడల్లా లేచి ఇంట్లోకి చూస్తూనే ఉంది. ఇంట్లో లైటు వెలుగుతూనే ఉంది. సుధారాణి నిద్రపోతూనే ఉంది. కానీ సుజాత రాలేదు.

మొదటి ఆట సినిమా వదిలారు, రెండో ఆట సినిమా వదిలారు. అయినా సుజాత ఇంటికి రాలేదు. ఈ ఝామున ఎవరి దగ్గరికని పోయేటట్టు అనుకుంటూ లేచి అయోమయంగా అటూ ఇటూ తిరిగింది. మళ్లీ పడక కుర్చీలో కూర్చుంది. అంతలోకే కన్నంటింది. కొంతసేపటికి మెలకువ రావడంతో మళ్లీ లేచి అటూ ఇటూ తచ్చాడింది. కంటిమీద కునుకు లేకుండా ఎంతో ఆతృత పడుతున్న రంగమ్మకు ఆ రాత్రి తెల్లవారడం గగనమైపోయింది.

ఇంకా వెలుగు రాకముందే, మసక చీకట్లో ఒక్కతే నడుచుకుంటూ షాపు దగ్గరికి వెళ్ళింది. రోడ్లన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. ఎవరో బిచ్చగాళ్ళు షాపు ముందరి అరుగు మీద పడుకొని నిద్ర పోతున్నారు. ఇక్కడ కెందుకొచ్చాను. ఈ టైమప్పుడు ఇక్కడ ఎవరుంటారు అనుకుంది. ఎక్కడికి పోవాలో, ఎవర్ని అడగాలో అర్థం కాలేదు.

ఓనర్ ఇంటికి వెళ్తే! ఆ ఇల్లెక్కడో. ఒక్కసారి వెళ్ళాను. సందులు గొందులు తిరుగుతూ పోవాలి అనుకుంటూ ముందుకు నడిచింది. అక్కడ సందులన్నీ ఒకే రకంగా ఉన్నాయి. ఒక సందులోకి వెళ్ళి ఇది కాదని ఇంకో సందులోకి వెళ్తోంది. అలా ఆ సందు గొందులన్నీ తిరిగిన తరువాత అసలు ఇల్లు కనుక్కుంది.

బయట ఇనప గేటుకి తాళం వేసి ఉంది. అక్కడి నుండి లోపలికి తొంగి చూసింది రంగమ్మ. లోపల ఇంకో తలుపు ఉంది. దానికి తాళం వేసి ఉంది. ఎంతసేపు తలుపు తట్టినా ఎవ్వరూ ఉలక లేదు, పలకలేదు.

ఎవరో దారిన పోయేవాళ్ళు బెల్లు నొక్కాలని పక్కనున్న బెల్లు చూపించారు.

బెల్లు నొక్కిన అరగంట తరువాత "ఎవర్రా పొద్దున్నే" అని విసుక్కుంటూ సేటు వచ్చాడు. ఒక చిన్న తలుపు తీసి ఎవరూ అంటూ లోపల్నుండే చూశాడు.

"నేనయ్యా రంగమ్మని" ఆందోళనతో, దుఃఖంతో వణుకుతున్న స్వరంతో అంది.

"రంగమ్మా! ఏ రంగమ్మా" నిదర కళ్లతో నిర్లక్ష్యంగా అడిగాడు.

"మీ షాపులో పనిజేసే సుజాత వాళ్ళ అమ్మని" అంటూ గుర్తు చెప్పింది.

"ఇంత పొద్దున్న వచ్చావేం? మీ అమ్మాయి జీతం నిన్ననే తీసుకుందిగా" అన్నాడు.

అర్జంటుగా డబ్బులు అవసరమైతే వచ్చి సేట్ నడిగి తీసుకుని పోవడం అలవాటు కావడం వల్ల ఆ సమాధానం చెప్పి ఉంటాడని ఊహించుకుంది.

"అది కాదయ్యా మా అమ్మాయి రాత్రి ఇంటికి రాలేదయ్యా" అంటూ ఏడుపు

మొఖంతో చెప్పింది.

"ఇంటికే రాలేదా"? ఆశ్చర్యంగా అడిగాడు. "నాకేదో పనుందని పెందలాడే బయలుదేరింది షాపు నుంచి. ఇంటికి రాకుండా ఎక్కడికి పోతుంది? మొన్నెప్పుడో ఆ పిల్లలు అనుకుంటుంటే విన్నాను. ఎవడోగానీ ఒక పిల్లోడితో తిరుగుతోందంట. ఇద్దరూ కలిసి యాడకన్నా పోయారేమో!"

పిల్ల పోయిందన్న బాధకంటే ఇంత చక్కటి పిల్ల షాపులో లేకపోతే రేపట్నుంచి **ఎవుర్ని వెతుక్కోవాలా అన్న ఆలోచనే ఆయన్ని ఎక్కువగా పీకింది.**

ఆయన చెప్పిన మాటలు వింటూనే రంగమ్మ గుండె గతుక్కుమంది. ఒక్కసారిగా రక్తం పైకెగజిమ్మింది. ఎక్కడ లేని భయం, నిస్సత్తువ ఆవరించాయి. మనిషి పూర్తిగా జావగారిపోయింది. 'ఆయనన్నట్టే ఎట్టైనా వెళ్ళిపోయిందా?' అనే ఆలోచన రాగానే గాభరాతో వణికిపోయింది. దుఃఖం పొంగుకొచ్చింది. "ఎక్కడికి పోయిందో ఏందో నయ్యా" ఏడుపు స్వరంతో అంది.

"మీరేమో పిల్లని వదిలిపెట్టి వాళ్ళు తెచ్చే జీతం తప్ప వాళ్ళేం చేస్తోందీ, ఎవరితో తిరుగుతోందీ పట్టించుకోరు. వాళ్ళు తెచ్చే డబ్బుల్ని చూసుకున్నంత ప్రేమగా, ఆప్యాయంగా పిల్లల్ని చూసుకోరు. పైగా మా షాపులో పనిచేసే పిల్ల పోయిందని మరొక చెడ్డపేరు" ఎత్తి పొడుపుగా అన్నాడు.

"అయ్యా, మా గ్రాచారం ఇట్టా కాలింది లేయ్యా. పిల్ల అట్టాంటిది కాదనుకున్నా. ఒకటి రెండుసార్లు పెద్ద పిల్ల చెబుతుంటే వినిపించుకోలేదు. ఇది నన్ను నట్టేట ముంచి పోయినట్టుందే" అనుకుంటూ వెనుదిరిగింది.

ఆ రోజంతా రంగమ్మ పిచ్చిది తిరిగినట్టే తిరిగింది. అయినా ఎక్కడా కూతురు జాడ తెలియలేదు. ఆ పిల్లతో పరిచయమున్న పిల్లల్నీ, షాపుల్లో పనిజేసే పిల్లల్నీ అడిగితే తెలిసిందేమంటే- సుజాత తరచుగా ఎవరితోనో తిరుగుతుందనీ, వాళ్ళిద్దరూ కలిసి నిన్న ఎవరికో రైల్వే స్టేషన్‌లో కనిపించారనీ, ఎట్టైనా

## నిద్రరాని నగరాలు

రాత్రిపూట సరిగా నిద్ర పట్టకపోతే ఒక పక్క మీద నుండి మరో పక్క మీదికి, ఒక గదినుండి మరోగదికి మారితే ఫలితం ఉంటుందని అనుకుంటుంటాం. ఏకంగా ఊరు మారితే, ఉనికి మారి మంచి ఫలితం ఉంటుందంటున్నారు అమెరికన్లు.

అమెరికాలో ఇటీవల జరిపిన ఓ సర్వేలో... ఈ సమస్య ఒక్క అమెరికన్లకే కాక విశ్వవ్యాప్తమైనదని చెబుతున్నారు. ఇది



మన భారతీయులకు కూడా వర్తిస్తుందట.

"డెట్రాయిట్"ని "ఇన్ సోమ్నియా"కి కేంద్రంగా పేర్కొంటారు. ఎందుకంటే, అక్కడ జన జీవితం యాంత్రికం. ఎక్కువ శారీరక, మానసిక ఒత్తిడులతో బాటు, నిరుద్యోగపు వత్తిడులు ఈ నిద్రలేమికి కారణం అంటున్నారు. "మిన్నియా పోలిస్" నగరంలో ఉండే ప్రజలు సుఖవంతమైన నిద్రతో హాయిగా జీవిస్తున్నారని సర్వేలో తేలిందట. ఎక్కువ ఆనందం, తక్కువ సమస్యలు, నిరుద్యోగుల శాతం తక్కువగా ఉండటమే ఇందు కు కారణం అంటున్నారు శాస్త్రజ్ఞులు. డెట్రా యిడ్, క్లీవ్‌ల్యాండ్, నాష్‌విల్లే, సిన్ సిన్నాటి, న్యూ ఆర్లీన్స్ మొదలయిన ఐదు నగరాల్లోని ప్రజలు ఎక్కువగా నిద్రలేమితో బాధపడ్తున్నారట. పోతే "సిటీ నెవర్ స్లీప్స్" నగరంగా పేరొందిన ఆరో నగరం న్యూయార్కుట.

విదేశాల్లో ఉద్యోగాల కోసం పరుగులెత్తే యువకులు "నిద్రబాబు"లైతే పై నగరాలు కాకుండా చూసుకుని వెళ్ళాలి మరి.

వెళ్ళి పెళ్ళి చేసుకోవాలనేది వాళ్ల ఆలోచననీ.

ఆ రోజు నుంచి హోటల్ మూసేసి చుట్టు పక్కల ఊళ్ళన్నీ తిరిగి వెతికింది. ఎన్ని ఊళ్ళు తిరిగినా, ఎక్కడ వెతికినా జాడే దొరకలేదు. పిచ్చి పట్టిన దానిలాగా అయిపోయింది రంగమ్మ.

కూడూ నీళ్లూ లేక, వేళకి నిద్ర లేక గుర్తుపట్టడానికి వీల్లేనంతగా ఆమె రూపు రేఖలు మారిపోయాయి. మనిషిలో అనంతమైన బాధ, ఆందోళన. అన్నం తినబోతే సయించదు. నిద్ర పట్టదు. ఎన్నో రోజులు లంఖణాలు చేసిన మనిషిలా తయారైంది. కూతురు గుర్తొచ్చినప్పుడల్లా ఏడుస్తూనే ఉంది. అయినా బతుకు బండి ఈడ్వక తప్పదు కాబట్టి లేచి తిరుగుతూ హోటలు తెరుస్తోంది కానీ మనసు మనసులో ఉండడం లేదు. కళ్ళ ముందు పిల్ల క్షణక్షణం మెదులుతోంది.

ఎంతకని, ఎక్కడని వెతుకుతుంది? అప్పటికీ కనపడ్డ వాళ్ళకల్లా, తెలిసిన వాళ్ళు ఏదైనా ఊరు వెళుతున్నా కూతురు జాడ కనుక్కునే యత్నం చేయమని చెబుతూనే ఉంది. ఎవరూ మాకు కనబళ్ళేదంటే మాకు కనబళ్ళేదని చెబుతూనే ఉన్నారు.

రంగమ్మలో మానసిక స్థైర్యం పూర్తిగా కొడిగట్టిపోయింది. ఏదో అయోమయంలో రోజులు నెట్టుకొస్తోంది. ఒకపని చెయ్యబోయి ఇంకోపని చేస్తోంది. ఒక చోటుకి వెళ్లబోయి ఇంకో చోటకు వెళుతోంది. సరిగ్గా అన్నం తినకపోయినా చాకిరీ మాత్రం తప్పక పోవడంతో మనిషి సగమైపోయింది. బాగా నీరసించిపోయింది. అంతకు ముందు రంగమ్మకు ఇప్పటి రంగమ్మకూ ఎక్కడా పోలిక లేకుండా పోయింది.

కొట్టుకొచ్చిన ప్రతివాళ్ళు కూతుర్ని గురించి అడిగినప్పుడల్లా శోక దేవతగా మారిపోతోంది. గుర్తు చేసినప్పుడల్లా గాయాన్ని రేపినట్టుగానే బాధపడిపోతోంది.

ఒక్కొక్కరి వెటకారం, మాట్లాడే తీరూ చూస్తుంటే ఒళ్ళు మండుతోంది. వాళ్లందర్నీ పీకి పెట్టాలనిపిస్తోంది. అయినా సహనంతో ఓర్పుతో భరిస్తోంది.

దూరపు కొండలు నునుపనుకొని ఉన్న ఊరుని వదులుకొని ఈ అడివిలోకి జేరితే బిడ్డల్ని కూడా పోగొట్టుకోవాల్సి వచ్చింది. ఊళ్లో ఉన్న ఆ రోజులు ఎంత మంచి రోజులు ఊరినొదిలేయాల్సిరావడం, ఒంగోలు కొచ్చిన తొలినాళ్ళు కందిరీగల తుట్టెలా కదిలి జ్ఞాపకాలు ఈగల్లా ఝుమ్మని ముసురుకున్నాయామెను.

17



'ఎవరూ కనబడరేంది. ఎక్కడికి పోయారు? ఇంటిముందు అంతంత పెద్ద పెద్ద పాతుర్లుండేయి. అవేమైపోయాయి? ప్రహరీ గోడ పడిపోయింది. అరుగులు మాయమైపోయాయి. ఇల్లంతా పాడుబడ్డ కొండలాగుంది. పందిరి లేకుండా ఏ రోజూ లేదు. అట్టాంటిది ఇంటిముందు ఇంత బోసిగా ఉందేంటి' అనుకుంటూ ఇంట్లోకి వెళ్లింది రమణమ్మ.

లోపల చీకటి చీకటిగా ఉంది. ఒక మూల గువ్వలా, చీకటిలో ఒదిగిపోయి ఎవరో మనిషి ఉన్నట్టు అనిపించింది. "ఎవరూ, అత్తా" అని కేకేసింది. పలకలేదు.

ఏంటీ పలకదు అనుకుంటూ దొడ్లోకి వెళ్లింది.

"ఎక్కడున్నారే రంగమ్మా" అంటూ వంట గదిలోకి తొంగి చూసింది.

పొయ్యిలో కట్టెలు ఎగదోస్తూ కుతకుతా ఉడుకుతున్న అన్నం వంకే చూస్తూ కూర్చుని ఉంది రంగమ్మ.

"ఎవరా మణిసి రంగమ్మేనా" అని కేకే

సింది. గుమ్మంలో నుంచుని చూస్తే గణగణా మండుతున్న పొయ్యిలో నుంచి వెలువడుతున్న కాంతి ఆమె మొఖంపై, కాళ్ళపై పడి ఎర్రగా మండుతున్నటుగా కని పించిందామె.

కేక విని తల పైకెత్తి చూసి "ఎవరూ" అంది, ఏదో లోకంలో నుండి ఈ లోకం లోకి వస్తున్నట్టుగా రంగమ్మ.

రంగమ్మే అని నిర్ధారించుకొని గడప దాటి లోపలికి వచ్చింది రమణమ్మ.

దగ్గరకొచ్చేదాకా తేరిపార చూస్తూనే "నువ్వంటే రమణాయ్! ఎప్పుడొచ్చావ్ ఒంగోల్నించి" అడిగింది రంగమ్మ.

"పొద్దున వచ్చానే. వచ్చినప్పట్నుండీ ఊరి మీద పడి తిరగనే సరిపోయింది" చెప్పింది రమణమ్మ.

"రావే, మంచమ్మీద కూర్చుందువు గానీ" అంటూ బయట మంచం వాల్చి "కూచ్చో అన్నం ఉడికింది. వంచి వస్తాను" అంటూ వంటగదిలోకి వెళ్ళి అన్నం వంచి, అటూ ఇటూ పొర్లిచ్చి పొయ్యి మీద పెట్టి, బయ టికి వచ్చింది రంగమ్మ.

"ఏమే నాలుగు చేతులా సంపాయిస్తున్నా వంటగా. నీ గురించి చాలా చాలా వింటు న్నాను" ఆమె జీవితాన్ని గురించి ఆసక్తిగా వింటున్న విషయాలు గుర్తొచ్చి అడిగింది.

"మా సంపాదన చెప్పమ్మా. పుట్టిన ఊరు కన్నతల్లి లాంటిది" అంటారు. అట్టాంటిది ఊరొదిలి పెట్టి అడక్కతింటం బాగుంది. నా సంగతి సరే. మీరేంటి ఇట్టయిపో యారు. పోయినసారి వచ్చినప్పుడు రావటా నికి కుదర్లేదే! ప్చ్ అయినా మీ పెద్ద బావలు చేసిన దానికి అందరూ బలైపో యారు. వాళ్లిద్దరూ సర్వనాశనమైపోయారం టగా! ఎవరు తీసుకున్న గోతిలో వాళ్లు పడ తారని ఊరక చెప్పారా పెద్దోళ్లు. పాపం వాళ్లిద్దరి వల్ల మీ చిన్నబావ బలైపోయాడు కదా. చాలా ఘోరమే మరీ" అంటూ రమ ణమ్మ ఆ కుటుంబం గురించి తను విన్న విషయాల్ని ప్రస్తావించి సానుభూతి చూపిం చింది.

"అంతా వరదకు కొట్టుకుపోయినట్టు ఊడ్చుకోని పోయిందిలేవే! ఇంకా ఆ పీడక లలు గుర్తుజేసుకుంటే... ఎందుకులేవే! నీ సంగతులు చెప్పవే!" అంది రంగమ్మ.

"ఏముందే మొన్నా మధ్యనే చిన్న ఇల్లొ కటి కొనుక్కున్నాను. రెండు పాడి బర్రెలు న్నాయి. వాటిని మేపుకుని పాలు పిండి పోస్తే పిల్లలే తీసుకుపోయి పోసొస్తారు. ఆయనేమో బండికి పోతాడు. ఏదో ఊరొ దిలి పెట్టిపోయినందుకు అట్ట జరిగిపోతా ఉంది" రమణమ్మ చెప్పింది.

"ఈ మధ్య చీట్లూ గీట్లూ చానా చేస్తున్నా వంటగదే! ఊళ్ళో గూడా చానా డబ్బు తీసు కుపోయి మారుస్తున్నావు అనుకుంటున్నారు నిజమేనా!" ఆరాగా అడిగింది రంగమ్మ.

రమణమ్మ నవ్వుతూ "నిజమేనే, అబ్బో అక్కడుంటే ఊరకుండాలనిపించదే! రకర కాలు చేస్తుంటారు. వాళ్ళని చూసి ఊరికే ఉండేకంటే మనం కూడ చేస్తే అనిపిం చింది. అవునే మాట వరసకి అంటున్నా గానీ, ఇక్కడ ఇంకేం ఆశ లేదు కదా! మీరు కూడ అక్కడకి రావొచ్చుగదే! ఇక్కడ పడే కష్టమేదో అక్కడ పడొచ్చుగా! ఇక్కడ జేసే చాకిరీ అక్కడ చేస్తే ఒక రూపాయికి బదులు నాలుగు రూపాయలు సంపాయిం చొచ్చు. ఆడ పిల్లలున్నారు. రేపు వాళ్ళని బైటకి పంపొద్దా! నాలుగు రూపాయలు ఇప్పుడు సంపాయించకపోతే ఇంకెప్పుడు సంపాయించేది" తన ఆలోచనల్ని చెప్పింది రమణమ్మ.

"ఎట్టా వస్తాం లేవే! ఇక్కడైపోయింది. మళ్ళీ అక్కడ కొస్తే గానీ నలుగురూ నోట్లో ఉయ్యరు. అయింది అయింది, పోయింది పోయింది అన్నట్టే ఉంటుందిలే" అని పైకి అంది కానీ, లోలోపల చిన్న ఆశ మిణుకు మిణుకుమంది రంగమ్మకు.

"ఇద్దరు బావలూ పోయింది టౌనుకేగా! వాళ్ళిద్దరూ ఏం బావుకతిన్నారు. ఇప్పుడు మేమొచ్చి తింటానికి" అంది మళ్ళీ తనే.

"వాళ్ళిద్దరూ కొండకి వెం(ట్రుక కట్టారు! కొండ రాలేదు గానీ వెం(ట్రుక తెగిపోయింది. చతికిల పడ్డారు. మన పద్ధతి అది కాదే. రెక్కలు ముక్కలు జేసుకుని పైసా పైసా కష్టపడి సంపాయించి కూడబెట్టుకోవడం. వాళ్ళకీ మనకీ పోలికే లేదు" విడమర్చి చెప్పింది రమణమ్మ.

"ఏందే ఆలోచిస్తున్నావు!" మాట్లాడకుండా ఆలోచిస్తున్న రంగమ్మను చూస్తూ అడిగింది రమణమ్మ.

"ఏం లేదు లేవే!" తన ఆలోచనల్ని బైట పెట్టడం రంగమ్మకి ఇష్టం లేకపోయింది.

"మీ అత్తేంటి ఆ చీకట్లో కూర్చుంది. పిల్చినా పలకలా. పాపం బాగా నలిగిపోయి నట్టుంది కదా! పైగా పెద్ద వయసైపోయే. ఈ కష్టాలూ బాధలూ ఏనాడూ పడింది కాకపోయే. ఒకదాని తరువాతొకటి దెబ్బ మీద దెబ్బ పడుతూనే వచ్చింది. అయినా మొండిది కాబట్టి అన్నీ తట్టుకుని నిలబడింది" రమణమ్మ సుబ్బులమ్మ మీద సానుభూతి చూపించింది.

"ఎవరమేం జేస్తాంలే. అంతా అయిపోయింది. మనుషులం మాత్రం మిగిలాం. చేతులు, కాళ్ళు ఆడితే పొట్ట నిండుతుంది. లేకుంటే లేదు" నిరామయంగా అంది రంగమ్మ.

"సరే, ఇక్కడేమీ ఆశ మిగల్లేదు. ఎక్కడైనా ఒకటే. మీరు అక్కడకి కానీ వచ్చారంటే నాలుగు రాళ్ళు సంపాయించుకునే అవకాశముంది. నేను మార్గం చూపిస్తాను. మీరు వొచ్చేపనైతే నేనుండానన్న సంగతి మాత్రం మర్చిపోవొద్దు ఆ...! నేనొస్తానైతే ఇంకా చానా పనుంది. మళ్లీ పొద్దున్నే పోవాల" అంటూ లేవబోయింది రమణమ్మ.

"కూచ్చోవే! ఎప్పుడో రాకరాక వచ్చేది. వచ్చావు వచ్చావు అనుకునేసరికే ఎల్లిపోతావు" అన్నా రమణమ్మ వెళతానే అంటూ బయలుదేరింది. రంగమ్మ కూడా రమణమ్మతో పాటే లేచి, ఆమెని బయటిదాకా సాగనంపి ఇంట్లో కొచ్చి పొయ్యి మీద అన్నం కుండ కిందకు దింపి అక్కడే కూర్చుండిపోయి ఆలోచనలో పడింది.

ఆ రాత్రంతా ఆమె ఆలోచనల్నిండా రమణమ్మ, ఆమె చెప్పిన మాటలే సుళ్ళు తిరుగుతున్నాయి. అది చెప్పింది కూడా నిజమే కదా! ఇక్కడ ఉండి బావుకుని తినేది మాత్రం ఏముంది? అక్కడికి పోయి కష్టపడొచ్చు గదా! చూద్దాం అత్తకదే చెబుదాం. ఏమంటుందో. అయినా ఇంత తొందరగా తేల్చుకునే విషయం కాదులే ఇది అనుకుంది.

అయితే రోజులు గడిచేకొద్దీ, టౌను సంగతులు తెలిసే కొద్దీ, రమణమ్మ చేస్తున్న పనులు, సంపాయిస్తున్న డబ్బు సంగతులు వినేకొద్దీ రంగమ్మలో ఆశ చిగురించి ఆకులు వేసి, కొమ్మలు రెమ్మలుగా పెరగనారంభించింది.

ఒకరోజు అత్తతో ఆ మాటే చెప్పింది.

"ఏమోనమ్మా ఏం జేసినా నువ్వే! నేనింక చెప్పడానికి నా దగ్గరేం మిగిలిందమ్మా. ఏ పని జేసినా ముందూ వెనకా ఆలోచించి మాత్రం చెయ్యి. ఆ టౌనంటే రకరకాల మణుసులు ఉంటారు. తట్టుకుని ఆడ ఉండగలుగుతామా! ఈడంటే ఉండూళ్ళో ఒక గుక్క తాగినా తాగకపోయినా ముడుచుకు పడుంటే అడిగేవోడు లేడు. అయినా ఏదైనా నీ ఇష్టమమ్మా" అని నిర్ణయాన్ని రంగమ్మకే వదిలిపెట్టింది సుబ్బులమ్మ.

అత్త చెప్పిన మాటలు కూడా సబబేననిపించాయి. అయితే అక్కడికి పోతే... అదే మంచిదనిపిస్తోంది. లేచినప్పటి నుండీ కూలీ నాలీ జేసుకోవడం, రోజూ జరిగినవన్నీ తలుచుకుని ఏడవడం బాధపడడం ఇయన్నీ ఎందుకు? ఆడకిపోతే కమ్మంగా కష్టపడొచ్చు పైగా చాటున ఉంటాం కాబట్టి ఎవరూ కదిలించేవాళ్లు కూడా ఉండరు. రమణమ్మ చెప్పిన ప్రకారం నాలుగు డబ్బులు కూడా సంపాయించుకోవచ్చు అనుకుంటూ మళ్ళీ అత్తతో ఈ విషయాన్ని

చర్చించింది.

"ఏమోనమ్మా నాదేం లేదని చెప్పానుగా. అన్నీ నువ్వే ఆలోచించుకో. వాడితో చెప్పావా! వాడితో కూడా ఒక మాట చెప్పి చూడు" అంది సుబ్బులమ్మ.

"ఆయనకి చెప్పానత్తా. సరేనన్నాడు" అంటూ సంతోషంగా చెప్పింది.

ఈ పిల్ల కళ్ళల్లో ఇంత సంతోషం ఎప్పుడూ చూళ్ళేదు. అయినా ఇంత సంతోషంగా ఉందంటే, ఇక్కణ్ణించి ఎల్లటం ఇష్టం లాగుం ది. ఇక్కడుండి మాత్రం బావుకుని తినేదేముందిలే! కాకపోతే పుట్టినూరు, సొంత ఇల్లు అంతేగదా! దాని మాట ప్రకారమే పోతే పోలా. భారం అంతా మోసేది అదేకదా అనుకుంది సుబ్బులమ్మ కోడల్ని చూస్తూ. "సరే నీ ఇష్టప్రకారమే కానియ్యి. ఆడకి పోయి అన్ని సంగతులూ తెలుసుకుని అన్నీ జాగర్తగా చూసుకుని రా. కష్టనష్టాలన్నీ భరించేదానివి నువ్వే కదా"! అంది.

రంగమ్మ ఒకరోజు వీలు చూసుకుని ఒంగోలొచ్చి రమణమ్మని కలిసింది. ఇల్లు వెతుక్కుంటూ వచ్చిన రంగమ్మని చూసి సంతోషపడింది రమణమ్మ. "ఇదేనమ్మా మా భవంతి" అంటూ సంతోషంగా ఇంటిని చూపించింది. తను చెప్పిన మాటలు బాగా నాటుకున్నాయని, ఆ మాటల ప్రభావంతోనే వచ్చిందని రమణమ్మ తెగ సంతోషపడిపోయింది.

"నీ భవంతికేమే ఇంత చక్కగా ఉంటేనూ! వస్తువులు కూడా బాగా కొన్నట్టున్నావు! ఎంత చక్కగా అమర్చుకొన్నావే!" ఇల్లంతా చూసి మురిసిపోయింది రంగమ్మ.

"ఏంటే సంగతులు. ఏదన్నా పని మీదొచ్చావా! లేక... నామాట ప్రకారం మీరు



కూడ ఇక్కడకి వచ్చేద్దామనా...?" రమ ణమ్మ అడిగింది.

"ఇంకేం నిర్ణయించుకోలేదు! నువ్వు చెప్పిన దగ్గర నుంచి అదే విషయం ఆలోచిస్తున్నాం" సందిగ్ధంగానే చెప్పింది రంగమ్మ.

"ఇదుగో ఇక్కడ ఇళ్లన్నీ చూస్తూ వచ్చావుగా! ఎవరూ ఇక్కడి వాళ్ళు కాదు. నాలాగా ఎక్కడెక్కడి పల్లెటూళ్లనించో వచ్చినోళ్ళే. అయితే వచ్చినప్పట్నుండి ఒళ్ళు దాచుకోకుండా కష్టపడి పైసాపైసా కూడబెట్టుకుని ఇళ్లు సంపాయించుకున్నోళ్ళే. అంతా వచ్చినప్పుడు కట్టుబట్టల్తోనే వచ్చారు. కష్టపడాలి అంతే. వీళ్ళందరూ కూడా చేసిందదే.

ఎక్కడెక్కడ ఎవరెవురు ఏం చేసేదీ, ఎట్టా కష్టపడేదీ, సంపాయించేదీ, అన్నీ విడమరచి చెప్పింది. అంతా తిప్పి చూపించింది. ఇక్కడికొస్తే ఏమేం పనులు చెయ్యొచ్చో కూడా వివరించింది.

ఇక్కడికొస్తే ఈ పనులు చెయ్యగలమా లేదా అనుకుంటూ వచ్చిన రంగమ్మ అంతా విని ఈ మాత్రం కష్టం చెయ్యలేమా! అనుకుంది.

పైగా రమణమ్మ అందర్నీ పరిచయం చెయ్యగా, వాళ్ళందరూ కూడా "మీకెందుకు మీరు రాండమ్మా. మేమందరం ఉన్నాం. రమణమ్మ ఉంది. అందరం పువ్వుల్లో పెట్టి చూసుకుంటాం" అని భరోసా కూడా ఇచ్చారు.

వాళ్లను చూస్తూ, వాళ్ల మాటలు వింటుంటే ఇక్కడకొచ్చి ఎవరి మీదా ఆధారపడకుండా బతకడం మంచిది కదా అనిపించింది. ఎంత తొందరగా వచ్చేస్తే అంత మంచిదని గట్టిగా నిర్ణయించుకుని వెనుదిరిగింది రంగమ్మ.

తిరిగొచ్చిన తరువాత అత్తకీ, భర్తకీ తాను చూసిందీ, విన్నవీ- అన్నీ చెప్పింది. "ఇల్లు కూడా చూడమని చెప్పాను. ఇక్కడ అన్నీ సవరించుకుని పోదాం" అంటూ తన నిర్ణయాన్ని చెప్పేసింది.

అక్కడికిపోతే ఎలా ఉంటుందో ఏమో! అసలే ఇక్కడ నానారకాల బాధలు పడ్డాం. ఎన్నో మాటలూ అనిపించుకున్నాం. మళ్లీ అక్కడకి వెళ్లి ఆ కొత్తచోట ఎన్ని తంటాలు పడాల్సి వస్తుందో ఏమో! అనుకుంటూ అప్పటినుండి లోలోపల మథనపడుతోంది సుబ్బులమ్మ. మరోవైపు సంతోషంగా ఉన్న రంగమ్మకి కాదని చెప్పే ధైర్యమూ చెయ్యలేకపోయింది.

ఆ రోజు కోసం రంగమ్మ ఎంతగా ఎదురు చూస్తోందీ ఆమె మాటలు, ఆమె చేసే పనులు చూస్తూ అర్థం చేసుకున్న సుబ్బులమ్మకు గుబులు గుబులుగానే ఉంది. లోపల ఎంత భయంగా ఉన్నా భారం మోసేది కోడలే కదా అని సరిపెట్టుకుంది.

ఒక మంచిరోజు చూసుకొని ఊరు వదలి పెట్టడానికి రంగమ్మ అన్నీ సిద్ధం చేసుకుంది. ట్రాక్టర్‌లో చిన్నా చితకా సామాను వేసుకొని, పనికిరాని వాటిని ఇంట్లోనే ఉంచి ఇంటికి తాళం వేసి చుట్టుపక్కల వాళ్ళకి చెప్పి అందరూ ట్రాక్టర్‌లోనే సర్దుకుని కూర్చున్నారు.

ఆ ఊరు వదిలిపెడుతుంటే సుబ్బులమ్మ కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. ఎంత పెద్ద సంసారం. ఎలా ఉండేది ఇప్పుడెలా అయిపోయింది! ఎక్కడి వాళ్ళక్కడ చెల్లాచెదరైపోయారు. ఈ ఇంటికేదో అరిష్టం పట్టినట్టుంది. కొడుకులూ కోడళ్ళూ అందరూ దూరమైపోయారు? సంసారం ఇంతగా చితికిపోయింది? ఎప్పుడో ఎవరో చేసిన తప్పులు తరతరాలూ వెంటాడుతాయంటారు. ఇవే గాబోలు. ఎప్పుడు ఎవరేం చేశారో ఇప్పుడనుభవిస్తున్నాం. వెనక్కి తిరిగి జూసుకుంటే ఊళ్ళో మిగులుగా ఉండే కుటుంబం దిక్కూ మొక్కూ లేకుండా ఊరొదిలిపెట్టి యెల్లిపోవడమేంటి! అనుకుంటూ గతాన్నంతా తవ్వి పోసుకుంది.

రంగమ్మకు కూడా అలాగే ఉంది. పుట్టిన ఊరు గుర్తొచ్చింది. పెళ్ళిరోజు గుర్తొచ్చింది.

తరువాత అత్తగారింట్లో గడిపిన బంగారం లాంటి రోజులు గుర్తొచ్చాయి. పడిన కష్టాలూ గుర్తొచ్చాయి. పోయినదేదో పొందడానికి ఆరాటంగా పరిగెత్తుతూ పోతున్నట్టు కూడా అనిపించింది.

భర్త నారాయణ ముఖంలోకి చూసి ఆయన భావాలను చదవాలని ప్రయత్నించింది. నిరామయంగా ఎటో చూస్తూ ఆలోచిస్తున్న అతడిలో ఎలాంటి ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయో పసిగట్టలేకపోయింది.

ఎలాంటి అవరోధం లేకుండా ట్రాక్టర్ టౌను వైపు దూసుకుపోయింది.




రమణమ్మ మాట్లాడి చూపించిన ఇంట్లోనే పాలు పొంగిచ్చింది రంగమ్మ. తెచ్చుకున్న సామానంతా ఇంట్లో పొందికగా సర్దుకున్నారు. కొత్తగా ఇల్లు కట్టుకుని గృహ ప్రవేశం చేసినంత సంబరంగా అనిపించింది రంగమ్మకు.

ఊళ్ళో విషయాలన్నీ మర్చిపోయేటట్టుగా చేస్తోంది ఆ వాతావరణం. తెలిసిన మనుషులు ఎప్పుడో తప్ప కనపడరు. కాబట్టి గత జీవితం తాలూకు జ్ఞాపకాలు ఆమెని బాధించడం మానేశాయి. అంతా కొత్త మనుషులు, కొత్త కొత్త పనులు, వింత వింత పద్ధతులు. తిరణాలకు పోయిన పిల్లల ఆనందం లాంటి ఆనందంతో ఆమె ఉబ్బితబ్బిబ్బవుతోంది. బర్రెల్ని కూడా తీసుకుని రావడంతో వాటి పాలు పిండి పోస్తూ పట్టణ జీవితం ప్రారంభించారు.

రంగమ్మ నీడపట్టునే ఉండటంతో శరీరం తాలూకు పాత పసిమి ఛాయలు పొడసూప సాగాయి. ముక్కూ మొహం-అందంగా పుట్టడంతో, తిరిగి సహజమైన శరీరం రంగు కూడా కనిపించడంతో చుట్టుపక్కల వాళ్ళు ఎంత చక్కగా ఉన్నావని పొగుడుతుండడంతో రంగమ్మ ఇంకా పొంగిపోతోంది.

అయితే అక్కడకూ ఇక్కడకూ ఒక స్పష్టమైన తేడా కనిపిస్తోంది. ఇక్కడ ప్రతి వస్తువూ కొనుక్కోవాల్సిందే. ఏదీ ఊరక గానీ, బదులుగా కానీ రాదని తెలిసివస్తోంది. అదే ఊళ్ళో అయితే పొలంలో పండించిన ప్రతీదీ ఏదో ఒక రకంగా ఊరకనే ఇంటికి నడిచి వస్తుంది. లేదంటే చేబదులో, మారకమో చేసుకోవచ్చు

ఇక్కడ ప్రతి వస్తువుకూ డబ్బు కావాలనేది అర్థమౌతున్న కొద్దీ కొద్దిగా భయం కలుగుతోంది.

ఒకరోజు రమణమ్మ వచ్చి "ఇట్టా కూచ్చుని తింటే కొండలైనా తరిగిపోతయ్యి. అందుకే నాతో వచ్చావంటే రెండు మూడు కొత్త కాతాలు చూపిస్తాను. ఇప్పుడు పిండే పాలల్లోనే ఇంకాసిని నీళ్ళు కలిపి అందరికీ పొయ్యి" అంటూ సలహా ఇచ్చింది.

ఊరినుంచి వచ్చేసేటప్పుడు బర్రెల కోసం తీసుకువచ్చిన గడ్డి అయిపోవడంతో కొనాల్సొచ్చింది. అందరి మాదిరిగా కొని వామి వేసుకోవాలంటే డబ్బులు కావాలి. అంత డబ్బు తన దగ్గర లేదు. ఏంచేయాలో పాలుపోక రమణమ్మని సలహా అడిగింది రంగమ్మ.

"ఏముందే నీ దగ్గర కాస్త బంగారం ఉందిగా! అది కుదవ బెట్టావంటే డబ్బులొస్తయ్యి. ఆ తరవాత పాల డబ్బులు కొద్ది కొద్దిగా మిగిలిచ్చుకుని విడిపించుకోవచ్చు" నిర్మొహమాటంగా చెప్పింది.

రంగమ్మ ఆలోచనలో పడింది. ఇంతకాలమూ ఆరునూరైనా నూరు ఆరైనా పుట్టింటి వాళ్ళు పెట్టిన బంగారాన్ని తాకింది లేదు. అది ఇవ్వాళ ఈ విధంగా అక్కరకొస్తుందని కలలో గూడా అనుకోలేదు.

సరేలే జరిగిపోయిన వాటికంటే ఇదేం

# నిత్య పెళ్లికొడుకు




కొందరి చేష్టలు, పోకడలు చూసే వాళ్లకి వింతనిపించొచ్చు గానీ వాళ్లకు మాత్రం అది ఓ అలవాటు, అవసరం మాత్రమే అవుతుంది. రికార్డు కోసం చేయకపోయినా ఆ చేష్టలు రికార్డును సృష్టించేస్తుంటాయి. బోస్నియాలోని మిలొసెవక్‌కు చెందిన 75 ఏళ్ల వృద్ధుడు నెడెల్జ్కో ఇలిన్సిక్ అలాంటి 'మగా'నుభావుడే. అతగాడి వింత చేష్ట... అదేనండి...అలవాటు, ఏంటంటే పెళ్లిళ్లు చేసుకోవడం. ఎన్నిసార్లు అని ఎవరికైనా సందేహం కలగవచ్చు. దానికి సమాధానం అక్షరాలా 162 సార్లు మాత్రమే. అంతే కాదండోయ్, అతగాడి ముచ్చటైన కోరికేమిటంటే మరో వందమందినైనా పెళ్లాడడం. ఇలిన్సిక్ మొదటిసారి 15వ ఏట పెళ్లి చేసుకున్నాడు. ఇక అప్పటినుంచి అతడు మడమ తిప్పకుండా పెళ్లిమీద పెళ్లి చేసుకుంటూనే ఉన్నాడు. గతంలో వెయిటర్‌గా పని చేసి ఇప్పుడు పించన్‌మీద జీవనం గడుపుతున్న ఇలిన్సిక్ తల్లి దండ్రుల బలవంతం మీద తనకంటే 20 ఏళ్లు పెద్దదైన జోకా అనే ఆవిణ్ణి మొదటిసారి పెళ్లి చేసుకున్నానని, ఆవిడది ధనవంతుల కుటుంబం కావడమే అందుకు కారణమని తన వివాహ పురాణానికి శ్రీకారం చుట్టిన వైనాన్ని చెప్పాడు. ఆవిడంటే తనకిష్టం లేనందున త్వరలోనే విడాకులిచ్చేశానని ఇక ఆ తర్వాత నిత్య పెళ్లి కొడుకునైపోయానని ముసిముసి నవ్వులు చిందించాడు. "ఎప్పుడూ పెళ్లి చేసుకోవడమో, విడాకులివ్వడమో జరిగిపోతుంటుంది. ఆయా భార్యలతో వెలగబెట్టే కాపురపు కాలాలు ఒక వారం నుంచి ఎంతకాలమైనా ఉండొచ్చు. కొందరితో కొన్నేళ్లపాటు కూడా సంసారం చేశాను. ప్రస్తుతం మాత్రం ఒంటరిగాణ్ణి. ఇంకా పెళ్లిళ్లు చేసుకోవాలనే తపన నాలో ఇంకిపోలేదు. ఆడాళ్లు ఇప్పటికీ నేనంటే మోజుపడుతూనే ఉన్నారు. ప్రస్తుతం ఓ ఇద్దరు మగువలు రెడీగా ఉన్నారు. వాళ్లలో ఒకళ్లని ఎంచుకోవడమే తరువాయి. నా మాజీ భార్యల్లో ఒకరు మళ్లీ నా దగ్గరకు తిరిగి రావాలని కోరుకుంటున్నట్లు కూడా తెలిసింది. కొంచం వయసు మళ్లినా నాలో ప్రేమ దాహానికి తరుగుదల లేదు. బహుశా మరో వంద పెళ్లిళ్లు చేసుకుంటే గానీ ఈ దాహం తీరదు" అని సెలవిస్తున్నాడు. వివిధ వివాహాల ద్వారా అతగాడికి 14 మంది సంతానం కలిగారు. తన ఫీట్‌ను గిన్నెస్ రికార్డుల పుస్తకంలోకి ఎక్కించడం గురించి ఇప్పుడతగాడు దృష్టి సారించాడు; ఆ ప్రయత్నంలోనే ఉన్నాడు.

## సిగరెట్ పెంచిన ఆయుష్షు




పొగ తాగనివాడు దున్నపోతై పుట్టున్ అని ఘాటుగా శపించేశాడొక పెద్దాయన. ఆ శాపాన్ని పొరపాటున ఆస్ట్రియాలోని ఆ శునకరాజంగారు విన్నదేమోగానీ; సిగరెట్లంటే తెగ మోజుపడిపోతోందట. కాకపోతే, మనుషుల్లా సిగరెట్లు తాగడమేంటి? ఎంచక్కా నమిలేస్తే పొగతో బయటకు పోయే సారం కూడా కడుపులోనే ఇమిడిపోతుందిగా అనుకుని శుభ్రంగా నమిలి మింగేస్తోందట. జనరల్ ఎడి అనే నామధేయం కలిగిన ఆ శునకరాజంగారు దశాబ్దంన్నర కాలం పైనుంచి రోజూ పది సిగరెట్లను ఫలహారం చేసుకుంటోందట. సిగరెట్ ఫిల్టర్‌ను కూడా వేస్ట్ చేయడం ఇష్టంలేక చక్కగా నమిలి సారాన్నంతా స్వాహా చేసి ఆనక దాన్ని ఊసేస్తుందట. ఇన్నేళ్లుగా ఇలా పొగాకు నమిలే అలవాటున్నా దాని పళ్లు ఏమాత్రం చెడిపోలేదు. పైగా చిన్న కుక్కపిల్ల ఉన్నంత హుషారుగా ఉంటోందట. ఇంతకీ దాని వయసెంతనుకున్నారు. 22 సంవత్సరాలు మాత్రమే. ఆ శునకరాజం ఇంతకాలం బతకడానికి కారణం సిగరెట్లేనని దాని యజమాని వోల్ఫ్‌గాంగ్ ట్రీట్లర్ సెలవిస్తున్నాడు. 17 సంవత్సరాల క్రితం దాన్ని పాత యజమాని వదిలించేసుకుంటే తాను చేరదీసి పెంచుతున్నానని, అప్పుడే దానికి సిగరెట్లు తినే అలవాటు ఉండడాన్ని గమనించానని అతగాడు చెప్తున్నాడు. సామాన్యంగా పొగాకులోని నికోటిన్ కుక్కలకు విషపూరితమవుతుంది. కానీ జనరల్‌గారి విషయంలో మాత్రం సహన శక్తిని పెంచిందని స్థానిక వెటర్నరీ వైద్యుడు హెరల్డ్ మేయర్ పేర్కొంటున్నాడు.

---

## విజాతి బంధం

పిల్లికి చెలగాటం, పిట్టకు ప్రాణసంకటం అనే సామెతను (అదేలెండి, కాస్త మార్చుకుంటే తప్పేం లేదుగా) పూర్వ పక్షంచేసే సంఘటన అడపాదడపా మనం చూస్తూనో, వింటూనో ఉంటాం. అలాంటి సంఘటనే ఒకటి బ్రెజిల్‌లో జరిగింది. దీంట్లో మరికాస్త వింతదనం ఇమిడివుంది. పోర్టో అలెగ్రె అనే ప్రాంతంలో ఓ పిట్టమ్మ గూటినుంచి జారిపడి దెబ్బ తగిలించుకుంది. ఫలితంగా ఎగరలేకపోయింది. అది చూసిన ఒక మార్జాలంగారికి నోట్లో లాలాజలం ఊరడానికి బదులు హృదయంలో కాసింత దయ పొంగింది. దాంతో 'చిక్విటా' అనే ఆ మార్జాలంగారు ఆ పిట్టమ్మను చేరదీసి అచ్చంగా ఒక తల్లిలా సాకడం మొదలుపెట్టింది. ఆ విజాతి తల్లీకూతుళ్లు ఒకే కంచంలో తిని ఒకే గూట్లో నిద్రపోతున్నాయట. చిక్విటా యజమాని నాయర్ డిసౌజా తన మార్జాలం దయాగుణానికి ముచ్చటపడి పిట్టమ్మను కూడా దానితోపాటు ఉండనివ్వడమేకాక పిటికో అని పేరుపెట్టి పిలుచుకుంటున్నాడు. ఇప్పుడు పిటికో కూడా మాంసం రుచి మరిగిందట. తల్లిలాంటి పిల్లితో కలిసి తప్ప భోజనం చేయకపోవడమే ఆ పిట్టమ్మ వింత అలవాటుకు కారణమట. ఈ పిట్ట కథలో మరో వింత - ఇతర పక్షుల్ని పట్టుకుని కడుపునిండా ఆరగించడానికి చిక్విటా పిటికోను ఉపయోగించుకుంటోందట. ఇది నమ్మలేని నిజంగా అన్పించినా నిజంగా నిజమట. సో పిటికో విజాతి తల్లి రుణాన్ని అలా తీర్చుకుంటోందన్నమాట.



గొప్పా అనుకుంటూ ఆ బంగారం కుదవబెట్టి డబ్బు తీసుకుంది. దాంతో ఒకలారీ వరిగడ్డి దొడ్లో వామిగా మారింది.

నెలనెలా ఇంటికి అద్దె కట్టడమనేదే మింగుడు పడడం లేదు రంగమ్మకు. నెలకి కట్టే అద్దె ఎవరు తిన్నట్టు. ఊళ్ళో ఇల్లు వంద రూపాయలు అద్దెకు, వడ్ల బస్తాలు వేసుకోవ డానికి ఇస్తే; అక్కడ ఒక రూమంత లేని ఈ ఇంటికి ఐదొందలు రూపాయలు అద్దె కట్టాల్సి రావడంతో కటకటలాడిపోతోంది ప్రాణం. అయినా అంతకంటే తక్కువకి కావాలంటే అన్నీ చుట్టు గుడిసెలు. ఎప్పట్నుండో తరత రాలుగా కాపాడుకుంటూ వస్తున్న సామాన్లు పాడైపోతాయని కొంత; ముసలమ్మా, పిల్లా జెల్లా అందరికీ కావాలంటే తప్పదని కొంత ఆ మాత్రం అద్దె భరించడం అనివార్యమైపో యింది.

ఇన్ని ఖర్చులూ భరించి ఇక్కడ నిలబడా లంటే అందరిలాగే ఇంట్లో ఉండే అందరూ పనిచెయ్యాల్సిందేనని అర్థమైంది. దాంతో నారాయణ కోసం, ముందుగా అనుకున్నట్టు గానే ఒంటెద్దు బండి కొనుక్కోవాలని అనుకు న్నారు. అందుకు చేతిలో ఉన్న డబ్బు ఏ మాత్రం సరిపోదు.

తప్పనిసరై మళ్ళీ రమణమ్మనే అప్పు అడి గారు. నా దగ్గర డబ్బులు లేవుగానీ, మరోచోట ఇప్పిస్తానని చెప్పి సుబ్బారావు అన బడే డబ్బుతో పులిసిపోయిన వ్యక్తి దగ్గరకు తీసుకువెళ్ళింది.

రమణమ్మను, ఆమె వెంట వచ్చిన ఎర్రగా బుర్రగా ఉన్న రంగమ్మను చూశాడు సుబ్బా రావు. కాస్త కంటికి నదురుగా అనిపించడంతో ఆమె వైపు నుండి కాసేపు చూపు మరల్చుకో లేకపోయాడు.

రంగమ్మకి ఒంటెద్దు బండి కొనుక్కోవడా నికి డబ్బు అవసరమని అప్పుగా కావాలని రమణమ్మ వచ్చిన విషయం చెప్పింది.

"నువ్వు చెబితే కాదంటానా! కానీ నాలుగు రూపాయల వడ్డీ అయితేనే ఇస్తాను" అన్నాడు.

వెనకనే ఉన్న నారాయణకి నోటమాట రాలేదు "ఊళ్ళో మహా అయితే రూపాయి, రూపాయిన్నర వడ్డీ ఎక్కువ. నాల్రూపా యలు వడ్డీ కూడా ఇస్తారా! మా వల్ల కాదు" అంటూ నోరెళ్ళబెట్టాడు.

"రమణమ్మ వచ్చింది కాబట్టి నాలుగు. లేకుంటే నేనెవరికీ ఐదు రూపాయల కంటే తక్కువకు ఇవ్వనే ఇవ్వనన్నాడు" సుబ్బారావు.

రమణమ్మ వైపు చూసింది రంగమ్మ.

"ఇంతకంటే మనకు గత్యంతరం లేదు. ఎన్నాళ్ళని ఇంటికాడ గోళ్ళు గిల్లుకుంటా కూర్చుంటాడు. నిదానంగా డబ్బులు వచ్చే కొద్దీ చెల్లేసుకోవొచ్చు ఇంతకంటే మనకు ఎక్కడా దొరకవు" పరిస్థితి వివరంగా చెప్పింది రమణమ్మ.

వడ్డీ భారమైనా తప్పనిసరి పరిస్థితుల్లో వెనకా ముందూ ఆలోచించకుండా తీసుకో వాల్సి వచ్చింది. కళ్ళల్లో ఎద్దు బండి మెదులు తుంటే వడ్డీ ఎంతైనా తల వంచాల్సి వచ్చింది.

ఇంట్లోకి వెళ్ళిన సుబ్బారావుని కేకేసింది రమణమ్మ. సుబ్బారావు బయటికి వచ్చాడు. "ఏందీ తీసుకుంటారంటనా" అంటూ బొజ్జ తడుముకుంటూ అడిగాడు.

రంగమ్మ, నారాయణ ఇద్దరూ తలూ పడంతో రమణమ్మ తల నిలువుగా ఆడిం చింది.

మళ్ళీ ఇంట్లోకి వెళ్ళాడు సుబ్బారావు.

డబ్బులతో వస్తాడనుకున్నారు. నారాయణ, రంగమ్మ. ఆత్రంగా అతడి చేతివైపు చూశారు.

చేతిలో ప్రామిసరీ నోట్లూ, రెవెన్యూ స్టాంపులూ ఉన్నాయి. వాలు కుర్చీలో కూర్చొని నోటు మీద స్టాంపులు అంటించాడు "ఎంత కావాలన్నాడు" రంగమ్మ వైపు చూస్తూ అడిగాడు.

"పదిహేను వేలు" రంగమ్మ చెప్పింది.

"సరిపోతయ్యా" రమణమ్మ అడిగింది.

"మా దగ్గర కొంతుంది. అవీ ఇవీ కలిపితే సరిపోతాయి" చెప్పింది రంగమ్మ.

"సరే ఇక్కడ సంతకం పెట్టు" అంటూ

స్టాంప్ వైపు చెయ్యి చూపించాడు సుబ్బారావు.

నారాయణ స్టాంప్ మీద సంతకం పెట్టాడు.

"ఇక్కడొకటి పెట్టు" అంటూ స్టాంప్ కింద స్థలం చూపించాడు. అక్కడా సంతకం పెట్టాడు నారాయణ.

ఇంకొక నోటు తీసి రంగమ్మని సంతకం చెయ్యమన్నాడు.

"ఇదేంటి ఇద్దరం ఎందుకు" అడిగింది రంగమ్మ.

"ఒకరు తీసుకున్నందున ఇంకొకరు హామీదారు" రమణమ్మ వివరించి చెప్పింది.

"అదేంటి ఖాళీ పేపర్ల మీద సంతకాలు, మా ఊర్లో అయితే పెద్దమనిషి చేత నోటంతా రాయించి స్టాంప్ మీద సంతకం పెట్టిచ్చుకుని, దస్తూరీ రాసినాయన పేరు రాసి, సాక్షుల సంతకాలు కూడా చేస్తే అది ప్రోనోటు అవుతుంది గానీ, ఇదేం పద్ధతి" నారాయణ అయోమయంగా చూస్తూ అడిగాడు.

"ఇంక అక్కడి పద్ధతులు మర్చిపోండి. ఇక్కడి పద్ధతులకి చిన్నగా అలవాటు పడండి" అంటూ ఇద్దరి వివరాలూ, రమణమ్మ పేరూ ఒక తెల్ల కాగితంపై రాసుకుని ప్రోనోట్లకు పిన్ చేస్తూ, "ఏం రమణమ్మా కొత్తగా వచ్చినట్టున్నారు. ఇక్కడి పద్ధతులూ అవీ నేర్పించు తొందరగా" అంటూ రమణమ్మ వైపు తిరిగి కన్ను గీటాడు.

"కొత్తగదూ అలవాటు పడతార్లే" నవ్వుతూ వంకర్లు తిరుగుతూ అంది రమణమ్మ.

ఇంట్లోకి వెళ్ళాడు సుబ్బారావు.

"ఇదేం చోద్యం. ఇక్కడ అన్నీ వాళ్లు చెప్పినట్టే ఇనాల గావాల. రేపు కట్టేది మనం కదా! వాళ్ళిష్టమొచ్చినట్టు నోట్ల మీద రాసుకుంటే అంతా కట్టాల్సిందే కదా!" అయోమయంగా రమణమ్మతో అన్నాడు నారాయణ.

"ఇక్కడ పద్ధతి అంతేలే!" అని "మరీ అంత దుర్మార్గం చెయ్యరులే ఎందుకంత గాభరా పడతావు" అంటూ ధైర్యం చెప్పింది రమణమ్మ.

సుబ్బారావు ఇంట్లో నుండి వంద రూపాయల కట్టలు తెచ్చాడు. జాగ్రత్తగా రమణమ్మ చేతికి ఇచ్చాడు.

రమణమ్మ తీసుకుని రంగమ్మ చేతికిచ్చింది. రంగమ్మ నారాయణ చేతికిచ్చింది.

నారాయణ, రంగమ్మ ఇద్దరూ బండి, ఎద్దు వేటలో పడిపోయారు. తెలిసిన వాళ్ళ ద్వారా బండీ, ఎద్దూ కొనేశారు. రెండూ కలిసి ఒంటెద్దు బండి అయింది.

ఇదేం చోద్యం. ఇక్కడ అన్నీ వాళ్లు చెప్పినట్టే ఇనాల గావాల. రేపు కట్టేది మనం కదా! వాళ్ళిష్ట మొచ్చినట్టు నోట్ల మీద రాసుకుంటే అంతా కట్టాల్సిందే కదా!

బండెక్కి మొదటిసారిగా పోతుంటే గతానికీ ఇప్పటికీ ఎంతో స్పష్టమైన తేడా కనిపిస్తోంది.

అప్పుడు పెద్ద రథమంత బండి, బండికి కట్టిన ఆంబోతు లాంటి రెండు పందెపు ఎద్దులు. మెడలో గంటలు గుడిలో గంటల్లా గణగణ మంటుంటే, రెండు ఎద్దుల పగ్గాలు పట్టుకొని నగలో నిలబడి చెర్నాకోలా విదిలిస్తే పరుగులు తీసేవి. ఎంత బరువు లేసినా సునాయాసంగా లాగిపారేసేవి. ఎన్ని బరువులైనా పొద్దుట్నుండీ రాత్రి దాకా లాగుతూనే ఉండేవి. వాటికి అలసట ఏ కోశానా ఉండేది కాదు.

ఇప్పుడీ బండిమీద కూర్చుంటే, చిన్నటిక్కీ మీద కూర్చున్నట్టు, ఎద్దును చూస్తుంటే ఒక చిన్న కోడె దూడను చూస్తున్నట్టు అనిపిస్తోంది. అది వ్యవసాయం. ఇది బతుకుదెరువు. అప్పటినుండి ఒంటెద్దు బండి నారాయణ అయిపోయాడు.

ఆ రోజునుండి రోజుకి ఎట్లా లేదన్నా

వంద రూపాయలు తక్కువ కాకుండా కళ్ళ జూస్తున్నాడు.

కొద్ది కాలంలోనే తొందరగా అప్పు తీర్చేస్తానని ధైర్యం వచ్చేసింది.

ఏ నెల వడ్డీ ఆ నెల కట్టేస్తే భారం తగ్గిపోతుందని రమణమ్మ చెప్పడంతో ఏనెల కానెల కట్టడం మొదలు పెట్టారు.

క్రమేణా పాలమీదా బండిమీదా ఆదాయం పెరిగి నెమ్మదిగా పిల్లల్ను బడికి పంపిద్దాం. నాలుగక్షరమ్ముక్కలు నేర్చుకుంటార్లే' అనుకుని రంగమ్మ పిల్లల్ని బడికి పంపిస్తోంది.

ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ గుడ్ల మీద కోడి పొదగడానికి కుదురుకున్నట్టు నెమ్మదిగా ఒక్కొక్క పనిలో నిలదొక్కుకుంటున్నారు.

చేతిలో డబ్బులు మెదులుతున్నాయి. చేతి నిండా పని దొరుకుతోంది.

నారాయణ బండిని కిరాయికి తీసుకుపోతుంటే రంగమ్మ బర్రెల ఆలనా పాలనా చూసుకుంటూ, ఇంటింటికీ తిరిగి పాలు బోస్తూ, ఖాళీ సమయాల్లో చిన్న చితకా పనులు చేస్తోంది.

రమణమ్మ చీటీ పాటలు వేసి నెలనెలా పాటలు పెడుతూ ఉంటుంది. వాటి గురించి ఓనమాలు కూడా తెలియని రంగమ్మ రమణమ్మ పక్కన తిరగడం వల్ల వాటికి సంబంధించిన అన్ని విషయాలూ ఆకళింపు చేసుకుంది.

కొత్త చీటీ మొదలు పెడుతున్న రమణమ్మ, "డబ్బులాడుతున్నాయిగా ఒక చీటీ వెయ్యరాదంటే" అంటూ మాట వరసకి అడిగింది.

దేన్నికైనా రమణమ్మ తనకు మార్గదర్శిగా ఉండడం వల్ల "నువ్వు చెబితే కాదంటానంటే రమణా. నువ్వెలా చెబితే అలాగే చేస్తాను." అంటూ తన విధేయతను ప్రకటించుకుంది రంగమ్మ.

"నెలకి రెండువేల చొప్పున ఇరవై ఐదు నెలలు కట్టుకుంటే యాభై వేల రూపాయలవుతాయి. పాట పోను మిగిలిన డబ్బులే కట్టాలి. కొంతకాలం అంటే సగం నెలలు దాదాపు సగం కట్టాల్సి ఉంటుంది. తరవాత కొద్ది కొద్దిగా పెరుగుతుంది అంతే! పోయేకొద్దీ రాబడి ఎట్టాగు పెరుగుతుందిగా. తరువాత ఏదో ఒక దానికి ఉపయోగపడుతాయి" విడమరచి చెప్పింది రమణమ్మ.

ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ గుడ్ల మీద కోడి పొదగడానికి కుదురుకున్నట్టు నెమ్మదిగా ఒక్కొక్క పనిలో నిలదొక్కుకుంటున్నారు.

"నేను లాగగలనంటే" అనుమానంగా అడిగింది రంగమ్మ. "ఇదిగో నేను చెప్పినట్టు చేసుకుంటా పో. నేనేం తెచ్చాను ఈడకి వస్తా. అదుగో ఆ ఎదురింటోళ్ళు ఏం ఎత్తుకుని వచ్చారు. ఈ లైన్లో ఎంతోమంది పాల మీద బతికేవాళ్ళు ఉన్నారు. మొగదాల రెండతస్తుల ఇల్లుంది చూడు. వాళ్ళయితే ఈడకి వచ్చినప్పుడు ఒంటిమీద గుడ్డలు లేవు. ఇయ్యాల జూడు మనలాంటోళ్ళని వంద మందిని కొని అవతల పారేస్తారు. ఏం లేదే తెలివి కొద్దీ ముందుకి ఎల్లటమే!" సంపాదనలోని అసలు రహస్యాన్ని చెప్పింది రమణమ్మ.

ఆమె మాట ప్రకారమే రంగమ్మ డబ్బు కట్టడం మొదలు పెట్టింది. చేతిలో డబ్బు కనిపించడం లేదు. కొద్దిగా ఊపిరాడడం తగ్గింది. కొంతకాలం తరువాత అటు డబ్బులు ఇటు, ఇటు డబ్బులు అటూ - అక్కడందుకుని ఇక్కడందుకుని రొటేషన్ చెయ్యడం మొదలుపెట్టింది.

ఎంత బాగున్నా బాగలేకపోయినా నారాయణ నాగా లేకుండా బండి కిరాయికి తీసుకుని పోతూనే ఉన్నాడు.

బస్తాలు బండిమీద వెయ్యడం, బండి మీద నుండి దించడం పెద్ద కష్టమనిపించడం లేదు. మోసే ఏ బరువూ బరువుగా అనిపించడం లేదు. ఊళ్ళో మోసే బస్తాలతో పోల్చుకుంటే ఇవొక లెక్కలోనివిగా కనిపించడం లేదు.

అయితే ఊళ్ళో కూలికి పోయిన రోజుల్లో కూడా అందరూ నారాయణ అని పేరు పెట్టి

పిలిచారే కానీ ఒరే అని ఎవ్వరూ పిలవలేదు. అట్లాంటిది ఇక్కడ ఒరేయ్ దరేయ్ అని పిల వడం చాలా బాధ అనిపిస్తోంది. మరీ చిన్నా చితకా పిల్లలు కూడా అట్లాగే పిలుస్తున్నారు. పెద్దోళ్ళంటే సరే పిలిస్తే పిలిచార్లే అనుకుంటే పిల్లలు కూడ పిలవడం మాత్రం భరించలేక పోతున్నాడు నారాయణ.

తప్పనిసరి పరిస్థితుల్లో బాధనంతా దిగ మింగుకుని అలవాటు పడిపోయాడు.

రంగమ్మకు క్రమంగా చీటీ డబ్బులు కట్టడం, అప్పుకి వడ్డీ డబ్బులు కట్టడం ఇబ్బం దిగా మారింది.

దాంతో మళ్ళీ రమణమ్మ దగ్గరకు చేరింది రంగమ్మ "ఎలాగే మరీ ఇబ్బందిగా ఉంటోంది. ఏం జెయ్యాలో పాలు బోవడం లేదే" అంటూ సలహా అడిగింది.

రంగమ్మ ఇబ్బందిని గమనించిన రమ ణమ్మ "నేనొక ఉపాయం చెబుతాగానీ అట్టా చెయ్" అంది.

"ఏందది" అమాయకంగా గొర్రె కసాయి వాడిని నమ్మినట్టే నడుచుకుంటున్న రంగమ్మ అమాయకంగా అడిగింది.

"ఏంలేదే నేను పెద్దపెద్ద చీట్లేస్తున్నాను కదా! ఈ చుట్టు పక్కల కొద్ది కొద్దిగా డబ్బులు కట్టేవాళ్ళు చాలామంది ఉన్నారు. నెలకి రొండొందలు, మూడొందలు, ఐదొం దలు చీట్లు యేశావంటే అందరూ కడతారు" రమణమ్మ కొత్త సలహా ఇచ్చింది.

"అమ్మో చీట్లంటే నా వల్ల కాదు. ఇవన్నీ ఈ లెక్కలు డొక్కలు నా వల్ల కాదు" భయ పడింది రంగమ్మ

"ఇట్ట భయపడితే లాభం లేదమ్మాయ్. ముందు ఏ పని జెయ్యాలన్నా ఇక్కడ ధైర్య ముండాలి. దేన్నికైనా నిలబడాలి. కష్టపడి పని జెయ్యాలి. అట్టా చేస్తే ఇంక ఎనక్కి తిరిగి చూసుకోవాల్సిన పనిలేదు.

మనూరు వాళ్ళే కదా జయమ్మ, శేషమ్మ, పద్మ. వాళ్ళు ఎట్టొచ్చేరు ఒంగోలుకి. ఇప్పుడు జూడు ఎన్నెన్ని ఆస్తులకి తీరుండారో చూశావు కదా! తెగబడి ఏదో ఒకటి చెయ్యాలి" హితబోధ చేసింది.

"ఊరుకోవే మరీ చెబుతావు. వాళ్ళందరి లాగా అట్టా సంపాయించడం గొప్పంటావా! అడ్డమైన తిరుగుళ్ళూ తిరిగి మిద్దెలు మేడలు కట్టే కంటే ఇంత విషం గొంతులో పోసుకో వడం మేలు" తన అభిప్రాయాన్ని కుండబ ద్దలు కొట్టినట్టుగా చెప్పింది.

"అంత దిగజారి సంపాయించాలంటం లేదు. మాట వరుసకి అంటున్నాను. ఊళ్ళో ఎంతో పోగొట్టుకున్నారు కదా. ఇప్పుడు కష్ట పడితే పిల్లల భవిషెత్తన్నా బాగుపడుద్దని చెబుతున్నా. ఆ తరవాత నీ ఇష్టం" రమ ణమ్మ కాస్త గట్టిగానే అంది.

ఎంతో విలువైన జీవితాన్ని పోగొట్టుకున్న కసి లోలోపల దాగి ఉండడం వల్లా, ఎదు రుగా పిల్లల జీవితాలు కళ్ళ ముందు కని పిస్తూ ఉండడం వల్లా, రమణమ్మ అండదం డలు కూడా ఉండడం వల్ల రంగమ్మ సరేనని సమాధాన పడింది.

రమణమ్మ చెప్పినట్టుగానే రంగమ్మ కూడా చిన్న చిన్న చీటీలు వెయ్యడంతో చేతిలో మళ్ళీ డబ్బు మెసలడం మొదలైంది. ఇదే వెస లుబాటుగా ఉందని, మూడు చీటీలు మొదలు పెట్టి చుట్టూ ఉన్న అందరితో తలా ఒకటీ రెండూ వేయించింది.

నెలంతా చేతినిండా డబ్బులు మెసలుతుం డడంతో, ఖర్చులు కూడా పెరిగిపోయాయి. ఇంటికి వచ్చే వాళ్ళందరికీ కూర్చోవడానికి కుర్చీలూ, కాఫీలూ, టీలూ అందియ్యడానికి కప్పులూ, సాసర్లూ, ఒక చిన్న టీవీ ఇంట్లో చేరాయి.

చీటీలు పాడిన వారికి డబ్బు ఇవ్వబోయేట ప్పటికి ఎంతో కొంత తరుగుబడేది. కొంత ఇంట్లో వాడుకోవడం, కొంతమంది ఆలస్యంగా ఇస్తుండడంతో ఆ తరుగు తప్పేది కాదు.

పాడుకున్న వారికి అర్జంటుగా కట్టవలసి రావడంతో రమణమ్మ దగ్గరో ఆమె దగ్గర కూడా లేకపోతే సుబ్బారావు దగ్గరో చేబదులు తీసుకోవాల్సి వచ్చేది.

సుబ్బారావు ఇంటికి పోవాలంటే ముందు

కొంచెం భయం భయంగా ఉండేది. అయితే తప్పనిసరి పరిస్థితుల్లో వెళ్లక తప్పేది కాదు. రమణమ్మ కొంతకాలం తోడుగా వచ్చేది. రంగమ్మకు కూడా అలవాటు కావడంతో రమణమ్మ రావడం మానుకుంది.

వెళ్లినప్పుడల్లా సుబ్బారావు ఓ రకంగా చూడడం గమనించగలిగింది గానీ, దానిలో ఉన్న అర్థమేమిటో తెలుసుకోగలిగిన తెలివి లేకపోవడం, దాని గురించి ఆలోచించే తీరికా లేకపోవడంతో పెద్దగా పట్టించుకోలేదు.

ఇప్పుడు రంగమ్మ ముందున్న లక్ష్యం ఏ రకంగానైనా డబ్బు సంపాదించడం. ఎన్ని మార్గాలుంటే అన్ని మార్గాలలో సంపాదించాలి అనే తపన పెరిగిపోవడంతో ఎప్పుడన్నా నారాయణ వంట్లో బాగో లేదన్నా, పడుకున్నా బలవంతంగా లేపి పంపేది. లేవకపోతే తగాదా పెట్టుకుని మరీ పంపించేది.

ఒకరోజు వంట్లో బాగలేకపోయినా వెళ్లమని బలవంత పెట్టడంతో ఈ పోరు పడడం కంటే అటు పోవడమే మేలనుకుని బండి తోలుకొని వెళ్లాడు.

ఆ రోజు లారీ మీదనుంచి బియ్యం బస్తాలు దించి బండి మీద వేసుకోవాల్సి వచ్చింది. కొన్ని బస్తాలు బాగా నే దించి భుజాల మీద వేసుకుని బండి దగ్గరకు మోసుకువచ్చాడు. మళ్లీ లారీ దగ్గరకు వచ్చి బస్తా కోసం నిలబడ్డాడు. పైన మనిషి బస్తాను నారాయణ భుజాల మీదకు నెట్టాడు. నారాయణ అస లే నీరసంగా ఉండడంతో కొద్దిగా ముందుకి ఒరిగాడు. బస్తా భుజాల మీద పడింది. దాని బరువు ఆపుకోలేక వెనక్కు విరగబడ్డాడు. అప్ప టి కప్పుడే మెడ వాచిపోయింది. హాస్పిటల్‌కి వెళ్ళితే మెడకి కట్టుకట్టారు. రెండు నెలలు నారాయణ పనికి పోవడం కుదరలేదు.

రెండు సంవత్సరాలు తిరిగేసరికి చీటీల వ్యాపారంలో మంచి పట్టు సంపాయించింది. చుట్టుపక్కల వాళ్ళలో ఆమెకు చీటీల రంగమ్మగా పేరు పడింది

ఆ రెండు నెలలు రంగమ్మ పరిస్థితి కుడితిలో పడ్డ ఎలుక లాగా అయిపోయింది. డబ్బులు సర్దలేక గిజగిజలాడిపోయింది. మళ్ళీ కొత్తగా పదివేల చీటీ ప్రారంభించింది. ఆ చీటీ కట్టేవారి కోసం అన్వేషణ మొదలు పెట్టింది. రమణమ్మ "ఇంక అంతటితో ఆగు. అంతకంటే దూకుడొద్దు"అని సలహా ఇచ్చింది.

"ఆ ఏముందలే ఐదేలు బదులు పదేలు అంతే కదా" అని ఆ సలహాను కొట్టిపారేసింది రంగమ్మ.

రెండు సంవత్సరాలు తిరిగేసరికి చీటీల వ్యాపారంలో మంచి పట్టు సంపాయించింది. చుట్టుపక్కల వాళ్ళలో ఆమెకు చీటీల రంగమ్మగా పేరు పడింది.

"చూడవే, నేను ఇంతకాలం నించి ఉంటున్నాగానీ నాకు పేరు బడలేదు. నువ్వు జూడు చీటీల రంగమ్మవి అయిపోయావు" అంటూ ఆట పట్టించింది రమణమ్మ.

"చాల్లే ఊరుకోవే. పేరు పడితే ఏమన్నా ఒరుగుతుందా ఏంటి? ఎవ్వరేం జేసినా ఆ నాలుగు రూపాయల కోసమేగా! అయినా నువేంటే ఈ యాల్టప్పుడు వచ్చావు" అందరూ పడుకోబోయేటప్పుడు వచ్చిన రమణమ్మని అడిగింది.

"ఆ ఏం లేదు. నీకొక మంచి మాట చెబుదామని వచ్చానే!" అసలు విషయం చెప్పకుండా ఊరించింది.

"నువ్వు చెప్పేవన్నీ మంచి మాటలే గదంటే. ఊళ్ళో నించి ఇక్కడికి రమ్మన్నావు. వచ్చాను. అక్కణ్ణించి ఒక్కోపని ఒక్కోపని చెయ్యమన్నావు. చేస్తా ఉన్నాను. అన్నీ కలిసొస్తానే ఉండయ్యి. సరేలే! నువ్వు మంచి మాటంటన్నావంటే, నా బాగు కోసమేగా చెప్పు" నవ్వుతూ అడిగింది రంగమ్మ.

"ఏం లేదే పట్టిచ్చిన తాడుని పాక్కుంటా పోతున్నావు కదా! నెలకి ఐదొందలు బాడిగ కడుతున్నావు. అవి కూడా మిగిలే మార్గము

కటుంది. అది చెబుదామని వచ్చాను"

"ఏంటే అది. తొందరగా చెప్పవే!" ఆతృతగా అడిగింది రంగమ్మ.

"మా ఇళ్ళ దగ్గర ఒక ఇల్లు బేరానికొచ్చిందే. నా దగ్గర నీ చీటీ గూడా ఉంది కదా అదీ చివరి కొచ్చింది. అది పాడుకుని ఊళ్ళో ఇల్లు అమ్మేసి ఇంకేదన్నా కాస్తో కూస్తో పడితే ఎక్కడో చోట అందుకుని ఆ ఇల్లు కొన్నావనుకో! నీకో నీడ ఏర్పరచినదాన్నవుతాను. ఇక్కడకు తీసుకొచ్చినందుకు పలాన రమణాయితో వచ్చాను, బాగుపడ్డాను అని నలుగురికి చెప్పుకోవచ్చు బేరం కూడా పెద్దగా ఏం చెప్పటం లేదు. ఇంకా మనకి కాబట్టి కాస్త తగ్గిస్తారు. అసలు ఇప్పుడు వాళ్ళకి డబ్బులు చాలా అర్జంటులే. లక్షన్నర చెబుతున్నారు" చివర్లో బాంబు పేల్చింది రమణమ్మ.

"అబ్బో అంత డబ్బు నేనెక్కడ తెచ్చి పెట్టేదే!" భయం భయంగా అంది రంగమ్మ.

"ఇప్పటికే యాభైవేలు తక్కువ చేయించాను. వాళ్ళు చెప్పిన దానికంటే" ఎలాగైనా ఇల్లు కొనిపిస్తే వచ్చే కమీషన్ కోసం పట్టుపట్టి రంగమ్మని ఒప్పించాలని ప్రయత్నిస్తూనే ఉంది.

"అదికాదే డబ్బంతా ఇప్పుడే కట్టాల్సిన పని లేదు. ముందు నా దగ్గర చీటీపాడి అడ్వాన్సు కట్టావనుకో ఆ తరవాత ఊళ్ళో ఇల్లు అమ్మేసి వచ్చిన కాడికి తెస్తే సరిపోతుంది. కాస్తో కూస్తో అవసరమైతే నేనూ, సుబ్బారావు ఉండనే ఉన్నాం కదా!

అసలింకోటి. ఇల్లు కొనాలే గానీ దాని మీద కూడ కో-ఆపరేటివ్ బేంక్‌లో లోను ఇస్తారు. ఆ లోను తీసుకుని అప్పులు తీర్చుకోవచ్చు ఆ తరవాత నెలకింతని కిస్తీల ప్రకారం కట్టుకుంటావు. ఇంటికి కట్టే అద్దె అక్కడ కడతావు. ఒక పక్క ఇల్లు నీదవుతుంది. ఇంటికి సంవత్సరానికి సంవత్సరానికి విలువా పెరుగుతుంది" మొత్తం వివరంగా, విపులంగా, అనునయంగా చెప్పి ఇల్లు కొంటానికి రంగమ్మని అంగీకరింప జెయ్యటంలో రమణమ్మ విజయం సాధించింది.

"నువ్వు ఇంతగా చెబుతున్నావు. నాకూ నాదంటూ ఇల్లుంటే బాగానే ఉంటుందనిపిస్తోంది. ఎలాగూ అవసరమైతే ఆదుకుంటానంటున్నావుగా సరే బేరం కుదుర్చు" అంది రంగమ్మ.

ఎండిపోయిన చెట్టుకి ఎక్కడో చిటారు కొమ్మన చిగురు పుట్టినట్టుగా రంగమ్మలో కొద్ది కొద్దిగా ఆశ మిణుకు మిణుకు మంటూ వెలగసాగింది.

ఎలాగయినా ఊళ్ళో పోగొట్టుకున్న పరువూ ప్రతిష్ఠలు తిరిగి తెచ్చుకోవాలి. అనే తపన అంతరంగంలో కొట్టుమిట్టాడుతోంది. అగ్నికి వాయువు తోడైనట్లు దానికి రమణమ్మ నారూ నీరూ పొయ్యడంతో అది ఇంకా మొక్కనుండి పెరిగి చెట్టుగా, మానుగా ఎదుగుతోంది.

ఇల్లు బేరం కుదిరింది. అడ్వాన్సు కట్టేసి అగ్రిమెంటు రాయించుకున్నారు.

తను రోజువారీగా ఎంత సంపాయిస్తున్నా రంగమ్మ ఎంత మిగిలిస్తున్నా నారాయణకి ఎక్కడో ఏదో లోపం కనిపిస్తోంది. అందుకే ఇల్లు కొనడం అతడికి సుతరామూ ఇష్టం లేదు. డబ్బులు సంపాయించుకుని ఇల్లు కొనుక్కోవాలి గానీ, ఎక్కడెక్కడో అప్పులు జేసి ఇల్లెవరు కొంటారని అడ్డుపడడానికి ప్రయత్నించాడు.

మామూలుగా నారాయణ ఏదన్నా ఒక మాట రంగమ్మకి ఎదురు చెప్పడమంటూ ఉండదు. చెబితే రంగమ్మ వినకుండా ఉండదు. అయితే అద్దె కొంపల్లో ఉండేకంటే ఒక సొంత ఇల్లు ఏర్పడుతుందనే ఆతృత కొద్దీ నారాయణ కాదుగదా, ఆ సమయంలో హరి హరాదులు వచ్చి చెప్పినా రంగమ్మ వినేటట్టుగా కనబళ్ళేదు.

ఊరికి వెళ్లి ఆ ఇల్లు కూడా అమ్మేసి డబ్బులు తీసుకురమ్మని పట్టు పట్టింది. నారాయణకి అది కూడా ఇష్టం లేదు. అయినా భార్య పట్టుదల చూసి చేసేది లేక ఊరికొచ్చి ఇల్లు బేరం పెట్టాడు. కానీ ఎవరూ కొనడానికి మొగ్గు చూపలేదు.

అద్దెకు జేరినోళ్ళకు ఆ ఇంట్లో అడుగు బెట్ట

డంతోనే వాళ్ళ రాత మారిపోయింది. అక్కడ నించి ఊడ బెరుక్కుని వెళ్లిపోయారు. ఇంక ఈ ఇల్లు కొని దీంట్లో ఉండేదెవరంటూ ఎవరూ ముందుకి రాలేదు. దాంతో రంగమ్మ కాస్త నిరాశ పడింది.

చావిడి ఉన్నచోటన్నా అమ్ముకుని రమ్మంది. నారాయణకి ఊరికి పోయి ఈ అమ్మ కాలు పెట్టడం కాస్త చికాకుగా అనిపించింది.

అయినా రంగమ్మ కోసం తప్పనిసరై వెళ్లి ఆ స్థలం కాస్తా అమ్ముకు వచ్చాడు.

ఎక్కడెక్కడివి పోగుజేసినా ఇంకా డెబ్బై వేలు కావాల్సి వచ్చాయి.

"ఎట్టా చేద్దామే" అంటూ రమణమ్మని మళ్లీ మార్గం కోసం ఆశ్రయించింది రంగమ్మ.

"చేసేదేముందే మనకి ఆపద్బాంధవుడు సుబ్బారావు ఉన్నాడుగా! ఆయన దగ్గరికే పోదాం" అది మినహా మార్గం లేనట్లు చెప్పింది రమణమ్మ.

"అయినా అంత డబ్బు ఆయనిస్తాడంటే" సందేహం వెలిబుచ్చింది.

"ఇంటి కాయితాలు పెట్టుకుని ఎవ్వరైనా ఇస్తారు. ఆయన ఇవ్వడం ఒక అబ్బురమా ఏంటి" భరోసా ఇస్తున్నట్లుగా అంది.

ఇద్దరూ సుబ్బారావు దగ్గరకి వెళ్లారు. వాళ్లెందుకొచ్చారో వింటూనే "అంత డబ్బా! ఇప్పటికిప్పుడు నావల్ల కాద"న్నాడు.

రంగమ్మ గుండెల్లో రాయి పడింది. "ఇప్పుడేం చెయ్యాలి? మిగిలిన డబ్బు కట్టకుంటే అడ్వాన్సు డబ్బులు కూడా ఇవ్వరు కదా అని భయపడింది.

రమణమ్మ సుబ్బారావుని బతిమిలాడింది.

ఆ మాత్రం బెట్టు చెయ్యకుండా అంత డబ్బిస్తే, తరవాత ఏదైనా తేడా వచ్చినప్పుడు దబాయించడానికి అవకాశం ఉండాలి కదా అనే ఉద్దేశంతో తన తెలివితేటలు ఉపయోగించాడు సుబ్బారావు.

బతిమిలాడగా బతిమిలాడగా చివరికి, "నా దగ్గరయితే లేవు. నేను కూడా మీరు కాబట్టి ఎక్కడున్నా తెచ్చి ఇస్తాను. ఇంటి కాయితాలు చేతికి రావడంతోనే తెచ్చి నా చేతిలో పెట్టాలి. ఆ పూచీ నీదే రమణమ్మ" అంటూ రమణమ్మ మీద బాధ్యత పెట్టిన తరువాత రంగమ్మ చేత నోటు రాయించుకున్నాడు. రమణమ్మ చేత హామీ రాయించుకున్నాడు. రిజిస్ట్రేషన్ అయిపోయిన తరువాత ఇంటి కాయితాలు తీసుకుని దగ్గర పెట్టుకున్నాడు.

ఒక మంచి ముహూర్తాన రంగమ్మ సొంత ఇంట్లోకి సంతోషంగా గృహ ప్రవేశం చేసింది.

అప్పట్నుండీ, ఎక్కడెక్కడి డబ్బులు తెచ్చి ఇంటికి పెట్టడంతో చీటీలు పాడుకున్న వాళ్లకి టైముకి డబ్బులు ఇవ్వకుండా ఇబ్బంది పెట్టడం తప్పలేదు రంగమ్మకి. గోరు చుట్టు మీద రోకలిపోటులా. ఈ మధ్యలో అనుకోని ఎదురు దెబ్బ కూడ తగిలింది. చీటీ పాడుకున్న ఒకావిడ అక్కడినుంచి ఉడాయించింది.

ఆ సంఘటన రంగమ్మకు కొత్త కావడంతో ఖంగుతింది. పరారైన ఆవిడ ఎక్కడుందో పట్టుకోవాలని తెగ తిరిగింది కానీ ఆచూకీ దొరకలేదు. అప్పటి నుండీ చాలా జాగ్రత్తగా వసూలు చేస్తున్నా పాడుకున్నోళ్ళు డబ్బులు కట్టకుండా బాగా విసిగిస్తున్నారు. మొత్తమ్మీద చీటీ పాటలు కాల్లో ముల్లులాగా సలపరం పెట్టడం ఎక్కువైంది.

అదే సమయంలో రమణమ్మ మీద ఎక్కడెలా మొదలయిందో కానీ ఒక పుకారు మొదలయింది. డబ్బులు ఇచ్చిన వాళ్ళకి రమణమ్మ తొందరగా తిరిగి ఇవ్వటం లేదనీ, చీటీలు పాడుకున్నవారికి డబ్బులు ఇవ్వకుండా వడ్డీకింద తన దగ్గరే ఉంచుకుంటోందనీ, పెద్ద పెద్ద మొత్తాలే అప్పుగా తెచ్చిందనీ, ఇప్పుడు చెల్లించలేకపోతోందనీ రకరకాలుగా అనుకుంటున్నారు. దానికితోడు ఇంటికి వచ్చేపోయే అప్పులవాళ్ళు ఎక్కువగానే కనపడుతున్నారు.

ఇంటి ముందుకి రోజుకొకరు వచ్చి తగాదా పెట్టుకుని పోతున్నారు. రమణమ్మకి చెయ్యీ కాలూ ఆడడం లేదు. ఇంట్లో మొగుడు తిట్టిన తిట్టు తిట్టకుండా తిడుతున్నాడు. ఇంటా బయట ఒత్తిళ్లు పెరిగిపోవడంతో ఒకరోజు అర్ధరాత్రి రమణమ్మ ఇంట్లో నుంచి మాయమై

పోయింది. ఆ రోజు నుంచి ఇంటికొచ్చి నిలదీసిన వాళ్ళకి "ఏం నాకేమన్నా చెప్పి ఇచ్చారా! అది ఎక్కడుందో పోయి దాన్నే అడుక్కోండి" అంటూ రమణమ్మ భర్త బుకాయించబోయాడు.

మొత్తం మీద అందరికీ ఇవ్వాల్సినవి లెక్కేస్తే రమణమ్మ మొత్తం పన్నెండు లక్షలు జనాలకి బాకీ పడిందని తేలింది. అందరూ రమణమ్మని రకరకాలుగా అనుకుంటుంటే రంగమ్మ మొదటిసారిగా కుంగిపోయింది.

రోజురోజుకీ చీటీ పాటలు రంగమ్మని కూడా ఇబ్బంది పెడుతున్నాయి. ఆ చికాకు, ఒత్తిడి మనిషి ప్రవర్తనలో కూడ ప్రభావం చూపించాయి. ఎంతో నెమ్మదిగా, నోట్లో నాలుక లేనట్టుగా మాట్లాడే రంగమ్మ సైతం గయ్యిమని అరవటం మొదలెట్టింది. ఆమె నోటి దెబ్బకు చుట్టుపక్కల వాళ్ళు భయపడుతున్నారు. అయితే అందరూ ఒకే రకంగా ఉండరుగా! కొంతమంది ఎదురు తిరిగి మాట్లాడి తగాదా పెట్టుకోవడమూ మొదలయింది. ఇంటి ముందు రోజూ ఏదో ఒక వాదనో తగాదానో గొడవో జరగడం పరిపాటైపోయింది.

ఈ గొడవలు, రంగమ్మ తీరుతో నారాయణకి ఎక్కడ లేని విసుగు కలుగుతోంది. పొద్దస్తమానం రెక్కలు ముక్కలు జేసుకుని వస్తే ఏదో ఒక గొడవేంటి రోజూ అంటూ విసుక్కోసాగాడు.

"నువ్వేనా కష్టపడుతోంది? నేనూ కష్టపడుతున్నాగా! ఏమీ లేకుండా నాలుగు రాళ్ళు వెనకేసుకోవడం ఎలా కుదురుతుంది. కష్టపడుతున్నాం కాబట్టే ఇవ్వాళ సొంత కొంపలో ఉండగలుగుతున్నాం" అనేది.

అప్పటినుండీ రోజూ ఏదో ఒక విషయంలో ఇద్దరి మధ్యా మాటా మాటా రావడం, గొడవ పడటంతో కీచులాటలు ప్రారంభమవడమే కాదు, పెరిగిపోయాయి కూడా.

సుబ్బారావు దగ్గర ఇంటికి తెచ్చిన బాకీ రోజురోజుకీ వొడ్డీ గుడ్లు పెట్టినట్లుగా పెరిగి పెరిగి కొండంత అవుతోంది.

రమణమ్మ కూడా లేకపోవడంతో సుబ్బారావు చుట్టూ ఎన్నిసార్లు తిరిగినా బ్యాంకు లోను ఇప్పించలేదు. ఇంటి కాయితాలూ ఇవ్వలేదు.

ఎప్పుడు వెళ్ళినా ఇదుగో! అదుగో అంటూ కాలం



గడిపేస్తున్నాడు.

ఒకరోజు బ్యాంకు దగ్గరకు వెళ్దాం రమ్మన్నాడు. ఆ రోజు ఇద్దరూ బ్యాంకు దగ్గరకు వెళ్ళి వివరాలు అడిగి తెలుసుకొన్నారు. ఎవరో ఒకరు ష్యూరిటీ ఇచ్చి సంతకం పెడితే లోను ఇస్తామని బ్యాంకు వాళ్ళు చెప్పడంతో తిరిగి వచ్చారు.

ష్యూరిటీ కోసం సుబ్బారావునే ఆశ్రయించి అతడి ఇంటి చుట్టూ తిరుగుతున్నా అతడు రేపు, మాపు అంటూ తిప్పుతున్నాడు.

ఇవ్వాళ అన్ని రకాలుగా వీడి చేతిలో చిక్కుకున్నాను కాబట్టి ఇంక ఏ పనైనా చేస్తానను కుంటున్నాడు కాబోలు. ఇట్టాంటి వెధవల్ని ఎంత మందిని చూశాను

బ్యాంకు లోను వస్తే సుబ్బారావు బాకీ చెల్లువేసి మిగిలిన వాటితో అప్పులు తీర్చేసి ప్రశాంతంగా ఉండాలని రంగమ్మ తాపత్రయ పడుతుంటే అతడు రోజు రోజుకీ వెనక్కు లాగుతుండడంతో పంటి బిగువున బాధను దిగమింగుకుని తిరగసాగింది.

"ఇదుగో రంగమ్మా, ష్యూరిటీ సంతకం పెట్టడానికి మా ఇంట్లో వాళ్లు ఒప్పుకోవడం లేదుగానీ ఇంకా ఎవర్నన్నా చూసుకో" అని చావు కబురు చల్లగా చెప్పాడు ఒక రోజు.

ఊహించని ఈ మాట మార్పుకు రంగమ్మ ఖంగుతింది.

"నాకు ఇక్కడ అంత ఇదిగా తెలిసినోళ్ళు ఎవరుండారు. నువ్వే లోనిప్పిస్తానంటివి. సంతకం కూడా పెడతానని ఒప్పుకుని వస్తివే. ఇప్పుడు కాదంటే నేను ఎవ్వరి దగ్గరకు పోను? అదీగాక డబ్బంతా నీకే కదా కట్టాల్సింది" అంటూ కాళ్లా వేళ్ళా పడింది. "కాదూ కూడదంటే నీ ఇంటి ముందే పడి చావాల్సిందే గానీ ఇంక నేనేం జేసేది" అంటూ మొండికేసి కూర్చుంది.

"అదేమో నాకు తెలియదు. మా వోళ్ళు ఊరుకోవడం లేదు" అంటూ ఆమె వంక ఓర కంట తమకంగా చూశాడు.

ఎన్ని రోజుల్నుంచో ఆమెని ఎలాగైనా లొంగదీసుకోవాలనే ప్రయత్నం ఈ రోజుకి కాయై పండై పక్వానికి వచ్చినట్టుగా అవకాశం కోసం ఎదురుచూస్తున్న రాబందు లాగా సుబ్బారావు డేగ చూపులు చూస్తున్నాడు. రంగమ్మ తన పని కోసం అదే పనిగా బతిమిలాడటంతో ఆమె సుబ్బారావుకు మరీ చులకనైపోయింది.

"అయితే నీకు పని కావాలంటే ఒక మార్గముంది. నేను చెప్పినట్టు చేస్తే నీకు లోను వస్తుంది" అంటూ దగ్గర కొచ్చి చనువుగా చెయ్యి పట్టుకున్నాడు. ఇంట్లో ఎవ్వరూ లేకపోవడం అతడికి మంచి అవకాశంగా మారింది.

అనుకోని ఆ సంఘటనకు బిత్తరపోయింది. చెయ్యి విదిలించి కొట్టింది.

అప్పుడు అర్థమైందామెకు. ఇన్ని రోజుల్నుంచీ ఎందుకు పనికావడం లేదో! నానుస్తూ ఎందుకు పదేపదే తిప్పించుకుంటున్నాడో!

మొదటిసారి ఇంటికొచ్చినప్పటి నుంచి ఇప్పటివరకూ ఇక్కడి కొచ్చిన ప్రతిసారీ వెకిలిగా నవ్వడం, ఓరకంట చూడడం వెనుక దురుద్దేశం ఇదన్న మాట. కానీ ఎప్పుడూ ఇలాంటి అవకాశం దొరకలేదు కాబట్టి బయటపడలేదు.

'ఇవ్వాళ అన్ని రకాలుగా వీడి చేతిలో చిక్కుకున్నాను కాబట్టి ఇంక ఏ పనైనా చేస్తానను కుంటున్నాడు కాబోలు. ఇట్టాంటి వెధవల్ని ఎంత మందిని చూశాను' అనుకొని కళ్ళలో ఉబుకుతున్న కన్నీటిని పంటిబిగువుగా అదిమి పెడుతూ కళ్లు తుడుచుకుంటూ బయటికి వెళ్ళబోయింది.

చేతికి వచ్చిన అవకాశం జారవిడుచుకోవడం ఇష్టంలేని సుబ్బారావు అమాంతం ముందుకి కదిలి తలుపేశాడు.

పులి బోనులో చిక్కిన జింకలాగా బిత్తరపోయి నిలబడింది రంగమ్మ. ఎటూ పాలుపోక "అయ్యా నీకు దణ్ణం బెడతాను, నేను అట్టాంటిదాన్ని కాదు" అంటూ రెండు చేతు

లెత్తి నమస్కరించింది.

లేడి కంట్లో తడి పులి గుండెని కరిగి స్తుందా!

"నువ్వు ఎట్టాంటి దానివో నాకనవసరం. నాతో అవసరం నీకుంది. నీతో నాకవసరం ఉంది. నీ ఇంటి కాయితాలు నా దగ్గరు న్నాయి. అంటే నీ ఇల్లు నా చేతిలో ఉండట్టే. ఈ నిమిషంలో నిన్ను ఇల్లు ఖాళీ చేయించె య్యగలను. ఆలోచించుకో" అంటూ ఆమె అవసరాన్ని ఆసరా చేసుకొని మానసికంగా దెబ్బతీశాడు.

"నీ మొగుడు పేరన, నీ పేరన రాసిన నోట్లున్నాయి. వాటి మీద ఎంతైనా రాసుకోగ లను. మిమ్మల్నిద్దర్నీ జైలో పెట్టించగలను" అని బెదిరించాడు.

రంగమ్మకు నిలువెల్లా భయం ఆవరిం చింది. ఒక్కసారిగా నిస్సత్తువ కమ్మేసింది. మెదడు పని చేయడం ఆగిపోయినట్లయింది. జైలు పేరు చెప్పగానే గుండెల్లో దడ మొదలైంది. ఈ టౌనోళ్ళు ఏం చెయ్యడానికైనా వెన కాడరా అనుకుంది. కానీ ముందీ పులి బోనులో నుంచి బయటపడే మార్గమేంటో అర్థం కాలేదు. కాళ్లావేళ్ళా పడి వేడుకోవడం మినహా గత్యంతరం లేదనుకుంది.

అయినా సుబ్బారావుకి ఏ కోశానా జాలి కలగలేదు. 'నువ్వు నరరూప రాక్షసుడివి' అని తిట్టి పోసింది. నానా యాగీ చేసింది. గొర్రెను చూస్తే కసాయి వాడికి జాలి కలుగు తుందా! ఆమెను బెదిరించి బలవంతంగా లొంగదీసుకున్నాడు.

పడిన కష్టాలూ కారిన కన్నీళ్ళు ఆమెను వివశురాల్ని చేశాయి. చీకటి మాటున కారిన ఆమె కన్నీళ్ళు ఆమెకు మిగిలి ఉన్న ఆ కాస్త స్త్రీత్వాన్ని కూడా నాశనం చేశాయి.

ఆ రోజు నుంచీ ఆమె నిరాసక్తంగా ఆయో మయంగా మారిపోయింది. ఏ పని చేస్తుం దో, ఎందుకు చేస్తుందో కూడా అర్థకాని అయోమయంలో అచేతనంగా కాలం వెళ్లబు చ్చుతోంది.

అయినా, ఇంటిమీద లోను తీసుకొని సుబ్బారావు బాకీ తీర్చేసి ఇంటి కాగితాలు అతడి దగ్గర్నుండి స్వాధీనం చేసుకోవాలని అతడి చుట్టూ తిరుగుతూనే ఉంది. ఇదుగో అదుగో ఆ కాగితం కావాలి, ఈ కాగితం కావాలి, ఈ సంతకం గావాలి, వాళ్ళ వీళ్ల దగ్గ రకు పోవాలి అంటూ తిప్పుకుంటూనే ఉన్నాడు. అవకాశం దొరికినప్పుడల్లా బలవం తంగా తన కోరిక తీర్చుకుంటున్నాడు.

ఒకరోజు ఇద్దరూ ఇంట్లో ఉన్నప్పుడే అను కోకుండా నారాయణ కంట్లో పడ్డారు. ఆ దృశ్యాన్ని చూసి అతడు నిశ్చేష్టుడయ్యాడు.

ఎదురుగానే తల వంచుకొని పోతున్న భార్యవైపు చూసిన అతడి చూపుకే గనక శక్తే ఉంటే అప్పటికప్పుడే రంగమ్మ భస్మమైపో యుండేది.

ఒకరి వెనక ఒకరు ఇంటికి వెళ్ళారు.

"ఇట్టాంటి బతుకు బతికేకంటే ఎక్కడో చోట దూకి చచ్చినా బాగుండేది. ఇంత గుడి చేటి దానివి అనుకోలేదు గదే! కష్టపడుతు న్నావు, సంపాయిస్తున్నావనుకున్నాను. గానీ ఇంత నీచంగా తయారౌతావనుకుంటే ఉండూ ళ్ళోనే కూలే జేసుకునేవోళ్ళం కదే! ఏదో తెలివి కలదానివనీ ఏదో చేస్తావనీ అనుకున్నాను కానీ, ఇట్టా నట్టేట ముంచుతావని ఇంత పాపి ష్టిదానివవుతావని అనుకుంటే అడుగు కూడా ఊర్నించి బైటపెట్టేవాణ్ణి కాదు. వాళ్ళూ వీళ్ళూ అనుకుంటుంటే ఏదో అనుకున్నాను గానీ ఇంత నీచానికొడిగడతావనుకోలేదు" అంటూ ఎప్పుడూ అనని మాటలు అన్నాడు. పడేసి విరగతన్నాడు. "నా తప్పేం లేదయ్యా నా మాటినయ్యా" అంటూ కాళ్ళూ చేతులూ పట్టు కుని బతిమలాడినా నారాయణలో ఆగ్రహం, ఆవేశం చల్లార లేదు. అలుపొచ్చేదాకా కొట్టాడు. రంగమ్మ ఏమాట చెప్పబోయినా వినిపించుకోలేదు.

అతడి మనసులో ఆ దృశ్యం అలా ముద్ర పడిపోయింది. కళ్ళు మూసుకున్నా కళ్ళు తెరు చుకున్నా ఆ దృశ్యమే కదలాడుతోంది. ఎవరి తోనూ మాట్లాడాలనిపించలేదు. మోసపోయా ననే బాధ. అమాయకుణ్ణి చేసి ఆడించిందన్న

కని, అవమానభారంతో ఎవరు ఎదురొచ్చినా తలవంచుకుంటున్నాడు. భార్యాభర్తల మధ్య ఆ రోజు నుంచే మాటలు కరువయ్యాయి. ఇంట్లో అన్నం తినడం కూడా మానేశాడు. బయట ఎక్కడన్నా తింటే తినడం లేకపోతే మానెయ్యడం. మనిషి కూడా డీలా పడిపోయాడు.

రాత్రింబవళ్ళూ భార్య మోసగించిందన్న ఆలోచనతో వేగిపోసాగాడు. పిల్లల్ని కూడా పట్టించుకోవడం మానేశాడు. వాళ్లు దగ్గరకొచ్చినా కసురుకుంటున్నాడు. కూర్చున్నా నుంచున్నా నిద్రపోతున్నా అదే ఆలోచనతో సతమతమైపోతున్నాడు.

బండి పని కూడా హుషారుగా చెయ్యలేకపోతున్నాడు. బస్తా పైకి లేపాలంటే లేవడం లేదు. ఏం చెయ్యాలో ఎలా చెయ్యాలో పాలుపోవడం లేదు. నిలువెల్లా పీడిస్తున్న వేదనతో తల ఎత్తుకొని తిరగలేకపోతున్న నారాయణ ఒకరోజు బండి తోలుకొని పోయి మళ్లీ తిరిగిరాలేదు. బండి ఒకచోట వదిలేసి ఎటుపోయాడో అంతులేకుండా పోయాడు.

రంగమ్మ కుప్పకూలిపోయింది. ఏమిటీ విధి నాటకం అనుకొని కుమిలిపోయింది. ఒక్కడే ఎటువెళ్లాడో, ఏం జేస్తున్నాడోనని కలవరపడుతూ చుట్టుపక్కల ఊళ్ళకి మనుషుల్ని పంపించి వెదికించింది. అయినా నారాయణ జాడ దొరకలేదు.

తన నిస్సహాయత, అవసరంతో స్వార్థం ఆడుకున్న ఆటలో తాను బలిపశువైపోయినా, భర్తను మోసం చేశాననే అపరాధ భావన, ఆ భావనలో తననిండా పెల్లుబుకుతున్న ఆవేదనతో ఆమె నిలువెల్లా వణికిపోతోంది. పుండును కెలికినట్లుగా భర్త అదృశ్యం ఆ ఆవేదనను, బాధను రెట్టింపు చేస్తోంది. దిక్కుతోచని స్థితిలో ఆ దేవుడెందుకిలా పగబట్టాడా అని తల్లడిల్లిపోతోంది.

అందరూ సుబ్బారావుతో తిరుగుతూ మొగుణ్ణి కూడా వెళ్లగొట్టిందని గుసగుసలాడుతున్నారు. దాంతో చుట్టుపక్క తిరగడం కూడా గగనమైపోయింది. ఇల్లు దాటి బయటకు రావాలంటే ప్రాణం బిక్కుచచ్చిపోతోంది. అయినా బయటకు రాకుండా ఒక్కరోజు కూడా జరగదు కాబట్టి అవమానాల్ని దిగమింగుతూ ప్రాణం బిగబట్టుకొని తిరుగుతోంది.

పాలుపోయడానికి ఇంటింటికీ తిరుగుతుంటే వాళ్ళు చూసే చూపులు ఎంత వాడిగా ఉంటున్నాయంటే మళ్ళీ అక్కడికి పోవాలని కూడా అనిపించటంలేదు. కానీ బతుకుపోరులో తప్పడం లేదు.

హఠాత్తుగా మారిపోయిన పరిస్థితులు, ఇంట్లోని వాతావరణం, తండ్రి అదృశ్యం, తల్లి జీవచ్ఛవంలా మారిపోవడం- వీటన్నింటి మధ్య పిల్లలు నలిగిపోతున్నారు.

ఇంత జరుగుతున్నా సుబ్బారావు తన మార్గంలో తను సాగుతూనే ఉన్నాడు. రంగ మ్మ ఇంతగా నలిగిపోతూ బాధపడుతున్నా అతనికి ఏ కోశాన కనికరం లేకపోయింది. అయితే తిరగ్గా తిరగ్గా ఒకరోజు బ్యాంకులోను మాత్రం ఇప్పించాడు. ఆ లెక్కన్నాడు. ఈ లెక్కన్నాడు. మొత్తంమీద లెక్కలమీద లెక్కలు కట్టి లోనంతా అప్పు కింద జమేసుకున్నాడు.

"అదేంటి, ఇంత అన్యాయమా" అని అడిగింది రంగమ్మ. ఇంకా నువ్వే నాకు బాకీ కట్టాలన్నాడు. సరే నువ్వు కాబట్టి, నా సొంత మనిషిలాంటి దానివి కాబట్టి వదిలేస్తున్నానన్నాడు. ఎంతో అభిమానం వలకబోశాడు.

రంగమ్మ పరిస్థితి పెనంమీద నుండి పొయ్యిలో పడ్డట్టయింది. ఇంటి కాయితాలు సుబ్బారావు దగ్గర్నుండి బ్యాంకులోకి మారాయి. లోనుతో సుబ్బారావు అప్పయితే తీరింది కానీ, మిగతా అప్పులన్నీ అలాగే మిగిలిపోయాయి.

అప్పుడప్పుడూ, అర్జంటుగా చీటీ డబ్బులు కట్టాల్సి వచ్చినప్పుడు అంతకుముందైతే సుబ్బారావు దగ్గరకు వెళ్లేది. ఇప్పుడు ఇంకెక్కడా అవకాశం లేక ఫైనాన్సు కంపెనీల నుంచి అప్పులు తీసుకోవడం మొదలుబెట్టింది.

నెలనెలా బ్యాంకులో కట్టాల్సిన కిస్తీలు

కూడా పెరుగుతున్నాయి. చేతిలో రూపాయి మెసలడంలేదు. పిల్లలు తిండికి కూడా మొహం వాచిపోవాల్సిన పరిస్థితి వచ్చింది.

తాను పాడుకున్న చీటీల వాళ్ళు, తను వేసిన చీటీలలో సభ్యులైన వాళ్ళు ఇంటి చుట్టూ తిరగడం ఎక్కువైపోయింది. ఎక్కడా రూపాయి పుట్టే తావే కనపడలేదు. ఎవ్వరూ నమ్మి చీటీలు కూడ వెయ్యడం లేదు. కుటుంబమంతా ఆకలితో నకనకలాడడం మామూలైపోయింది.

సంవత్సరం పాటు బ్యాంకులో కిస్తీలు కట్టకపోవడంతో బ్యాంకువాళ్ళు నోటీసుల మీద నోటీసులు పంపారు. బకాయిలు కట్టకపోతే ఇల్లు జప్తు చేస్తామని హెచ్చరించారు. మళ్లీ సుబ్బారావు దగ్గరికి వెళ్లి "ఏదన్నా మార్గం చూపించు, నిలవనీడ లేకుండా పోయేటట్టుంది" అని కాళ్ళా వేళ్ళా పడింది.

"నేను కూడా ఆరోజు సంతకం పెట్టాను. నాకూ నోటీసులు పంపారు. నేనెవురికి చెప్పుకోవాల" అంటూ ముక్కూమొహం తెలియని వాళ్ళతో మాట్లాడినట్లు మాట్లాడాడు.

రంగమ్మకున్న చివరి ఆశ కూడా అడుగంటిపోయింది. ఎటూ పాలుపోక కుప్పకూలిపోయింది.

ఒక శుభముహూర్తాన బ్యాంకువాళ్ళు ఇంటిని స్వాధీనం చేసుకుని సామాన్లు బయటపడేసి ఇంటికి సీలు వేశారు.

రంగమ్మ రోడ్డున పడింది. ఊరి నుండి వచ్చేటప్పుడు ఎంత ఉత్సాహంతో వచ్చిందో అంతకు నాలుగింతలు నీరు గారిపోయింది.

ఊరి నుండి టౌనుకి వచ్చేటప్పుడు తోడుగా భర్త ఉన్నాడు. ఇప్పుడు ఆయన్ను కూడా పోగొట్టుకున్నాను అనుకుంటూ దిగాలుగా ముగ్గురు పిల్లల్ని ముసలమ్మనూ తీసుకొని ఆకాశం పందిరి కింద ఒంటరిగా బయల్దేరింది.

జ్ఞాపకాలలోంచి బయటపడి రంగమ్మ ఉసూరుమంటూ తన పనిలో పడిపోయింది రోజులు, నెలలు గడుస్తూనే ఉన్నాయి. రంగమ్మ గానుగెద్దులా శ్రమిస్తూనే ఉంది.

19



"రోజూ పొద్దున్నే లోటా తీసుకు రాకుండా ఉండవు కదా" బల్లమీద కూర్చుని పేపర్ చదువుతున్న వ్యక్తి, నెమ్మదిగా నడుచుకుంటూ వచ్చిన ముసలమ్మను పలకరించాడు.

"పాపం ముసిలోడు పొద్దున్నే టీ తాగకుండా ఉండలేడంటన్నా" రంగమ్మ నవ్వుతూ అంది.

"నేనన్నా తాగకుండా ఉంటానుగానీ ముసలాయన పొద్దున్నే టీ తాగకపోతే పిచ్చెక్కిపోతాడు" బోసినోరు ఆడించుకుంటూ లోటా బల్లమీద పెడుతూ "సుబ్బులమ్మకి ఎట్టుందే" అని అడిగింది ఆ ముసలావిడ.

"ఆర్నెల్ల నించీ మనిషి బాగ మెతకబడి చిక్కిపోయింది. లోపలికి కూడా పెద్దగా ఏమీ పోవడం లేదు. వారం రోజుల్నించీ విరోచనాలు అవుతున్నాయి. ఎన్ని మందులేసినా కట్టుకోవడం లేదు. అయిపోయిందిలే. ఇంక రోజుల్లోకి వచ్చినట్టుందని చెప్పాడు డాక్టరు కూడా" చెబుతుంటే రంగమ్మ స్వరంలో తెలిసీ తెలియని జీర.

ఇంట్లోకి వెళ్లి చూసివస్తూ "పోయే ప్రాణమే గానీ వచ్చే ప్రాణం కాదు. ఎగశ్వాస దిగశ్వాసగా ఉంది మనిషి" అంది ముసలమ్మ.

పొద్దుటిపూట టిఫిన్ హడావిడి తగ్గింది. రంగమ్మ ఇతర పనులలో పడింది.

సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చాడు. ఎండ చుర్రున చురుస్తోంది. కొట్టు దగ్గర ఒకళ్లిద్దరు కూర్చుని ఉన్నారు.

"అబ్బా ఇయ్యేడు నీళ్ళకి అల్లాడికాడినట్టుగా ఇంకెప్పుడూ యాతన పడలేదమ్మా. యాడికి బోయినా గుక్కెడు నీళ్లకి కరువొచ్చినట్టుంది.

ఎవరూ ఒక లోటా నీళ్ళియ్యలేదమ్మా, మీరన్నా కాసిని నీళ్ళియ్యండమ్మా గొంతు తడుపుకుంటాను" అంటూ బంకు దగ్గరకు వచ్చాడు ఒక ముసలాయన.

"మంచినీళ్ళేడుండయ్యి పెద్దాయనా! మజ్జి గుండయ్యి తాగు" అంటూ మజ్జిగకుండ వైపు చెయ్యి చూపించింది రంగమ్మ.

"ఎంత? లోటా రూపాయేనా? " అంటూ జేబులో నుండి రూపాయి బైటికి తీసి రంగమ్మకు ఇచ్చాడు.

గ్లాసు మజ్జిగ చేతికిస్తూ "ఎక్కడికి పెద్దాయనా, ఈ జనాలంతా గుంపులు గుంపులుగా పోతున్నారు" అనడిగింది రోడ్డుమీద వెళుతున్న జనాల్ని చూస్తూ. గ్లాసు పైకెత్తి గటగటా తాగి గ్లాసు టేబుల్‌పై పెడుతూ "యాడకేందమ్మాయ్ ఈ తంతున రైతులు గుంపులు గుంపులుగా చస్తా ఉంటే ఎవడు పట్టించుకున్నాడు. అందుకే కలకటేరు ఆఫీసుకి పోయి గోల చెయ్యాలని పోతున్నాం" అంటూ రోడ్డుమీదకు పోయి గుంపులో కలిసి పోయాడు.

రోడ్డుమీద కొంతమంది తలగుడ్డలు చుట్టుకున్న 'రైతులు ఆత్మహత్యలు అరికట్టాలి.' 'రైతులకి అండగా నిలబడాలంటూ బ్యానర్‌లు పట్టుకొని నడుస్తున్నారు.

కొంతమంది 'రైతేరాజు. ఆ రాజు నడ్డీ విరగ్గొడుతున్నారు' అని అరుస్తున్నారు.

ఆ జనంలోంచి ఒకాయన బీడీ ముట్టించుకోవటానికి వచ్చాడు.

"ఏంటా ట్రాక్టర్ మీద" అడిగాడు బంకు ముందు నిల్చున్న వ్యక్తి.

"ఏముంది! చెప్పుకోవడానికి కడుపు తరుక్కుపోతోంది. ఒక్కరోజులో ఊర్లో ముగ్గురు చచ్చిపోయారు. అయినా ఎవ్వరూ పట్టించుకోలా. అందుకే శవాల్నన్నా కలెక్టర్‌కి చూపిద్దామని తీసుకుపోతున్నాం" ఆవేశంగా చెప్పాడతడు.

శవాలున్న బళ్లకు వెనకా ముందు గుంపులు గుంపులుగా జనాలు నడుస్తున్నారు.

"అబ్బో తలగుడ్డలు రోడ్డెక్కాయ్యన్నమాట" అతణ్ణి అడిగిన వ్యక్తి వెటకారంగా అన్నాడు.

"పొలంలో ఉండాల్సిన తల గుడ్డల్ని రోడ్డెక్కిస్తంది గవర్మెంటు. ఏం చేద్దాం. చేతగాని గవర్మెంట్లు" అంటూ గుంపులో కలిసి పోయాడా రైతు.

"అమ్మాయ్ నాయనమ్మకి నోట్లో తులసినీళ్ళు పొయ్యమ్మా. ఎండకి గొంతెండిపోతుంది" పెద్దగా అరిచి కూతురికి చెప్పింది రంగమ్మ.

"ఏంటమ్మా ముసలమ్మ చివరి స్టేజీకొచ్చిందా ఏంటి" రైతులతో మాట్లాడిన వ్యక్తి పొగాకు చుట్ట చుట్టుకుంటూ అడిగాడు.

"వారంనించీ కడుపులోకి ఏమీ పోవడం లేదు. మూసిన కన్ను తెరవడం లేదు. మాట పడిపోయి కూడా నాలుగు రోజులైంది. ఈ ఎండలకి ఇయ్యాలో రేపో అన్నట్టుగా ఉంది" అంటుండగానే సుధారాణి ఇంట్లో నుండి 'అమ్మా' అంటూ పెద్దగా కేకేసింది. రంగమ్మ గాభరాగా పరిగెత్తుకుంటూ ఇంట్లోకి వెళ్లేసరికి ముసలమ్మ తల వాల్చేసింది.

అచేతనమైపోయిన అత్తను చూస్తూనే రంగమ్మ కళ్ళ వెంట బొట బొటా కన్నీళ్ళు రాలాయి. పవిట చెంగుతో గట్టిగా కళ్లొత్తుకుంది.

ఏడుస్తూనే పవిట నోటికి అడ్డం బెట్టుకుని "పక్క బజార్లో సుబ్బయ్య మామున్నాడు. ఆయనకి చెప్పి నేను రమ్మన్నానని తీసుకు రామ్మా" కూతురికి చెప్పి ముసలమ్మ వైపే చూస్తూ అలాగే స్థాణువులా నిలబడిపోయింది.

సుధారాణి వెంటనే బయటికి వెళ్లిపోయింది.

'ఎప్పటి రుణమో! నా చేత చేయించుకుని చేయించుకుని పోయావు. ఎన్ని సంవత్సరాలు? పెళ్ళయిన నాటినుండీ నేటి వరకూ అంటిపెట్టుకున్నది నువ్వేనమ్మా ముసలమ్మా. అత్తవైనా గానీ ఏనాడూ సాధించింది లేదు. రాచి రంపాన పెట్టిందీ లేదు. లేనోళ్ళ పిల్లనని ఒక్క మాటన్నదీ లేదు. సొంత తల్లీ కూతుళ్ళ మాదిరే ఉన్నాం. అందుకే కొడు

కులు చెయ్యకపోయినా సొంత కూతురుచేత చేయించుకున్నట్టు చేయించుకున్నావు. ఇవాల్టితో నీకూ నాకూ బంధం తెగిపోయింది. రేపట్నుండీ ఎవురుంటారా కుక్కి మంచమ్మీద'

అత్త శవాన్ని చూస్తూ మనసులో తలపోస్తున్న రంగమ్మ హృదయం భారమైపోయింది. చెప్పలేనంత వెలితి నిండింది. ఇదీ అని వర్ణించలేనంతగా సుళ్లు తిరుగుతున్న బాధ.

'భర్త ఇంటినుంచి వెళ్లిపోయినప్పుడు పడ్డంత బాధ మళ్ళీ ఇప్పుడు పడుతున్నాను' అనుకుంది రంగమ్మ.

చుట్టుపక్కల వాళ్లు చేరారు. వరి గడ్డి పరిచి శవాన్ని కిందకు దించారు. పెద్ద కొడుకులిద్దరికీ కబురు పంపారు. ఒకరు ఐసు తేవడానికి వెళ్లారు. ఆ రోజంతా ఐసులో పెట్టి కొడుకుల కోసం చూశారు. ఇద్దరూ రాలేదు.

ఎవరు తల్లులో, ఎవరు బిడ్డలో! ఎవరికి ఎవరు? అనుకున్నారు అందరూ.

"ఇంకెందుకైతే కానియ్యండి" అంటూ మరుసటి రోజు చుట్టుపక్కల వాళ్లే శవ సంస్కారానికి ఏర్పాట్లు చేశారు. జరిపించాల్సిన తతంగం పూర్తయింది. కానీ పాడె మొయ్యడానికెవరూ సిద్ధంగా లేరు. దగ్గరలో ఉన్న తోపుడు బండి వాడిని పిలుచుకు రమ్మని ఒకరిని పంపారు. స్మశానంలో గొయ్యి తియ్యడానికి మరో మనిషిని పంపారు.

తోపుడు బండికి పోయినాయన బండి వాడిని తీసుకొని వచ్చాడు.

"ఇంకెందుకయ్యా చూడడం? కానియ్యండి. ఎత్తి బండిమీద పెట్టండంటూ ఇద్దరు ముగ్గురు పెద్దవాళ్ళు బండివాణ్ణి పురమాయించారు.

బండివాడొచ్చి శవానికి తలవైపు నుంచున్నాడు. రంగమ్మ కాళ్ల వైపు నుంచుంది. ఇద్దరూ ఎత్తి శవాన్ని రేకు బండిమీద పెట్టారు. తెల్ల గుడ్డ కప్పారు.

బండివాడు నెమ్మదిగా బండిని రోడ్డెక్కించాడు. రంగమ్మ బండి వెనకనే నడిచింది. నలుగురైదుగురు ఆడవాళ్ళు కూడా ఆమెను అనుసరించారు. వాళ్ళతో నలుగురు ముసలి వాళ్ళు కూడా కదిలారు.

శవమున్న బండి రోడ్డు మీద పోతుంటే జనం వింతగానూ విడ్డూరంగానూ చూస్తూ నిలబడ్డారు.

"నలుగురు కొడుకుల్ని పాడె మొయ్యటానికి సరిపడా కన్నావు. చివరికి తలకొరివి పెట్టడానికి కూడా ఒకరు మిగలలేదు. అనాథ శవం లాగా లాక్కుపోవాల్సి వచ్చింది. ఊళ్ళో అయితే నలుగురు దాయాదులన్నా మోసే వాళ్ళు" అని మనసులో అనుకుంటూ ధారాపాతంగా కారుతున్న కన్నీటిని తుడుచుకుంటూ నడుస్తోంది రంగమ్మ.

శ్మశానంలో దించిన శవాన్ని అప్పటికే తీసి ఉన్న గుంటలోకి దింపారు. గుంటను మట్టితో నింపేశారు. శవంపై వేసిన పూలదండను మట్టిపై వేశారు. ఒక గంటలో శవం ఖననం పూర్తయిపోయింది.

ఎన్నో సంవత్సరాలు పెంచి పోషించుకున్న రక్త మాంసాలు ఒక్క గడిలో మట్టిలో కలిసిపోయాయి అనుకుంది రంగమ్మ.

రంగమ్మతోపాటు శవంతో వచ్చిన వాళ్ళందరూ వెనుదిరిగారు.

ఇంటిముందు బక్కెట్‌తో నీళ్ళు పెట్టారు. వచ్చిన వాళ్ళందరూ కాళ్ళపై నీళ్ళు పోసుకుని కడుక్కుంటున్నారు.

ఎవరో దీపం చూసి పోదురు రండని ఇంట్లోకి పిలిచారు వాళ్లని దీపం చూడడానికి ఇంట్లో కి వెళ్ళిన వాళ్ళంతా ఆశ్చర్యంతో తిరిగి బైటికి వస్తున్నారు, గుసగుసలాడుకుంటూ.

రంగమ్మ కాళ్ళు కడుక్కుని ఇంట్లోకి వెళ్లింది. వెలుగుతున్న దీపాన్ని చూసింది. దీపం వెనుక నిలబడ్డ సుధారాణిని చూసింది. ఆమె పక్కనే నిలబడి ఉన్న చిన్న కూతురు సుజాతని చూసింది. ఆమె పక్కన ఉన్న బ్యాగ్‌ని చూసింది.

ఆ అమ్మాయి కళ్ళల్లోకి సూటిగా, దీర్ఘంగా నిర్వేదంగా చూస్తూండిపోయింది రంగమ్మ. జీవితంలో చెయ్యకూడనంత తప్పు చేసినట్టుగా సుజాత తలదించుకుంది. ✦




# చతుర కత

"బుచ్చిబాబుగారూ! ఫోనొచ్చిందండీ మీకు" అన్న ప్యూన్ పిలుపునందుకుని, వెళ్ళి ఫోనందుకున్నాడు బుచ్చిబాబు.

"హల్లో! బుచ్చిబాబూ స్పీకింగ్"

"హల్లో! నేనండి, మీ అర్థాంగిని"

"ఆహా! ఏమి నా భాగ్యము! ఏనాడూ ఫోను చేయని నీవు ఈనాడు నాకు ఫోను చేయడమా? ఏమి విశేషం డియర్..."

"ఆc! ఏమిటండీ అలా నాటిక ఫక్కీలో డైలాగులు? ... ఏమండీ! ఈరోజు సాయంత్రం ఆఫీసయిపోగానే తొందరగా వచ్చేయండీ"

"ఏమిటంత విశేషం..."

"ఏం లేదండీ! తిరుమలలో మంచి ఇంగ్లీషు పిక్చరుంది. అది ఇవాళే ఆఖరి రోజట! పక్కింటి అనసూయవాళ్ళూ చూశారట. బాగుందట!"

"అయితే ఇంకేం? అలాగే వెళదాం. సాయంత్రం అయిదవగానే వచ్చేస్తా. నేవచ్చేటప్పటికి రెడీగా ఉండు. సాయంత్రం సినిమాకెళ్ళి అట్నుంచి అలా శ్రీనివాసాలో భోంచేసి ఆ తర్వాత..."

"ఊc! ఆ తర్వాత... అబ్బాయిగారేవో కలలు కంటున్నట్లున్నారు. అది ఆఫీసు"

"అబ్బ! నీ మాటలు వింటూంటే ఇప్పుడే సెలవుపెట్టి ఇంటికొచ్చేయాలనిపిస్తోంది..."

"అంత పని మాత్రం చేయకండి!"

"సర్లే. అలాగే- ఒక చిన్న..." గోముగా అడిగాడు.

"ప్చ్.."

"చాలా తియ్యగా ఉందోయ్ సరోజా!"

"సరోజా? ఏం మహాశయా! ఎవరా సరోజ? ఏమా కథ...? "

"ఎవరేమిటి డియర్... నీ పేరే"

"ఏమండీ మతి సరిగా లేదా? నా పేరు రాధ... మరచితిరా మహాశయా..."

"రాధా! రాధ ఎవరు...? "

"హల్లో... మీరు బుచ్చిబాబుగారేనా, మాట్లాడుతోంది!"

"అవును బుచ్చిబాబునే... పి. బుచ్చిబాబుని..."

"పి. బుచ్చిబాబా? ... ఎన్. బుచ్చిబాబుగారు కాదా? ..."

"హల్లో... మీరు మాట్లాడదలచుకున్న ఎన్. బుచ్చిబాబుగారితోనా... సారీ... ఉండండి పిలుస్తాను. మా ఆఫీసులో ఇద్దరం బుచ్చిబాబులం ఉన్నాం- సారీ..."

– బద్దిగం పాండురంగారెడ్డి

సమాజపు తీరుకు చెంపపెట్టు

కథ వెనుక కథ

# హ్యూమరాలజీ



చెప్పే విషయాన్ని సరదాగా.. నవ్వించి కవ్వించేలా రాయడం అందరికీ సులువుగా అబ్బదు. అందునా హాస్యాన్ని.. వ్యంగ్యాన్నీ జోడించి సమాజాన్ని మెత్తని చెప్పుతో కొట్టేలా రాయడం కొందరికే చేతనవును. ఆ కోవలోకే వస్తారు యర్రంశెట్టి సాయి. పది హేనేళ్లక్రితం ఆయన కలం నుంచి ధారావాహికంగా జాలువారిన 'హ్యూమరాలజీ' ఎందరిని పొట్ట చెక్కలయ్యేలా నవ్విం చిందో అంతేలేదు. నవ్విస్తూనే మన సామాజిక స్థితిగతుల తీరుపై ఎంతలా ఆలోచింపచేసిందో లెక్కేలేదు. అలాంటి 'హ్యూమరాలజీ' కథవెనుక కథను ఇలా వివరిస్తున్నారు యర్రంశెట్టి..

యర్రంశెట్టి సాయి

'సాధారణంగా ఏ రచయితైనా యథార్థ సంఘటనల ప్రేరణ తోనే వాటికి కొంత కల్పన జోడించి ఆ రెంటినీ తనదైన శైలిలో రంగరించి రచనలు చేస్తాడు. కొంతమంది కేవలం కల్పనా జగత్తులో విహరించి, వాస్తవాలకు దూరంగా రచనలు చేస్తారు. ఈ రెండురకాలకూ కూడా పాఠకాదరణ లభిస్తుంది. అయితే మనచుట్టూ ఉన్న- లేక జరుగుతున్న సంఘటనల ఆధారంగా చేసిన రచనలే మెజారిటీ పాఠకుల ఆదరణను పొందుతాయి అనడానికి ఉదాహరణలు కోకొల్లలు!

ఒక మంచి ఉదాహరణ కన్యాశుల్కం-

అప్పటికీ ఇప్పటికీ దానికి నీరాజనాలు పడుతున్నారంటే నాటి జీవితాలకు, స్థితిగతులకూ, సమస్యలకూ, ఆలోచనలకూ అది ప్రతిబింబం కావడమే. మరో కారణం.. రచయిత ఎన్నుకున్న హాస్య, వ్యంగ్య ధోరణి! అంటే- సోషల్ సెటైర్‌కి లభించే దీర్ఘకాలిక ప్రయోజనం మరే శైలికీ లభించదు.

'హ్యూమరాలజీ'ని పాఠకులు ఆ రోజుల్లో ఆదరించడానికి.. ఇప్పటికీ ఆదరిస్తూండడానికీ కారణం నా కథా వస్తువులన్నీ ఎక్కువ మంది పాఠకులకు అనుభవంలోకొచ్చినవే కావటం.. వాటిని అందించడానికి ఎన్నుకున్నదే ఈ వ్యంగ్య, హాస్య శిల్పం.

వ్యంగ్య హాస్యాలకు దగ్గర సంబంధం ఉంది. రెంటికీ విడివిడిగా విశేష సంఖ్యలో పాఠకులున్నా రెండూ మిళితమైన రచనలు చేయగలిగితే వారూ వీరూ అంతా ఆదరిస్తారు.

హ్యూమరాలజీ రాయాలని నేననుకోటానికి కారణం నాటి పరిస్థితులు! అవి మామూలు పరిస్థితులు కాదు.. భయంకరమైనవి- ఆ రోజుల్లో మనందరం అనుభవించిన నరకం. ఇవే ఆ రచనకు నన్ను పురిగొల్పాయి.

'దొంగలొస్తున్నారు స్వాగతం చెప్పండి'నే తీసుకుంటే అప్పట్లోనూ, ఇప్పటిలాగే దొంగలు మనరాష్ట్రంలో- ప్రతి రోజూ పడుతుండేవాళ్లు. రోజూ అయిదారు లొకాలిటీల్లో చాలా హాపీగా దోపిడీలు చేయటం- ఇంటివాళ్లను కాలో... చెయ్యో విరగ్గొట్టడం- లేక కత్తులతో పొడిచి చంపేయడం- రెగ్యులర్‌గా న్యూస్ పేపర్లలో వస్తూండేవి.

అలాంటి వార్తలు వచ్చినప్పుడల్లా పోలీస్ అధికారులు ఆ దొంగల ముఠాలను పట్టుకో డానికి ప్రత్యేకమైన చర్యలు చేపట్టామంటూ చిరునవ్వు ఫోటోలతో సహా పేపర్లలో స్టేట్ మెంట్లివ్వటం- కూడా మామూలు విషయమై పోయింది. అలా ఓ ఏడాదిపాటు యథేచ్ఛగా దొంగతనాలు, దోపిడీలు జరగనిచ్చాక అప్పుడు ఒక దొంగల ముఠాను పట్టుకు న్నారు. వెంటనే ప్రెస్‌మీట్ పెట్టి వాళ్ళతో గ్రూప్‌ఫొటోలు దిగి పేపర్లకిచ్చారు. ఇక ప్రజ లంతా ప్రశాంతంగా నిద్రపోవచ్చని స్టేట్‌మెం ట్లిచ్చారు. ఆ దొంగల ముఠా మన రాష్ట్రానికి చెందింది కాదనీ, మహారాష్ట్రదనీ- అందుకే పట్టుకోవడం ఆలస్యమైందనీ ఘనంగా చాటించారు. తమాషా ఏమిటంటే మర్నాటి నుంచీ కూడా దోపిడీలు, దొంగతనాలు ఆగకపో వడం..యథావిధిగా కొన సాగడం.




ఆ పరిస్థితుల్లో ప్రజలెవరి కయినా ఎలాంటి ఆలోచ నలు కలుగుతాయి? 'దొంగసన్నాసులు! పోలీసులు మనల్ని ఫూల్ చేశారు-' అని కసిగా తిట్టాలనిపిస్తుంది. తిట్టు కుంటారు కూడా! కానీ వాళ్ళ మనసులోని కసి బయటి పది మందికీ ఎలా తెలియజేయటం?

తమలో రగులుతున్న అసంతృప్తినీ, ఆవే శాన్నీ లోలోపలే దాచుకుని పోలీసులమీద మందుపార్టీల్లో జోకులేసుకోవటం..లేదంటే ఏ నాటికో రాసి ఆనందించేవారు. అదుగో అక్క డే నాపని మొదలైంది. నాచుట్టూ ఉన్న వాళ్ళ స్పందననీ, ప్రతిస్పందననీ స్టడీచేసి- ఆ సంఘ టనలకు వ్యంగ్యం, హాస్యం మిళితంచేసి అక్ష రబద్ధం చేశాను. దానికి పాఠకుల నుంచి లభించిన ఆదరణ అపూర్వం- టీవీ ఎపిసో డ్‌గా వచ్చినప్పుడూ మళ్లీ అంతటి స్పందనే వచ్చింది.

'ట్రాఫిక్ జామ్' అంశాన్ని రాయడానికి కారణం ఆ రోజుల్లోనే (అంటే సుమారు పది హేనేళ్ల క్రితం) మన సిటీలో అనేకచోట్ల ట్రాఫిక్‌జామ్‌లు ఏర్పడటం- ముఖ్యంగా అమీ ర్‌పేట్, అబిడ్స్, లకడీకాపూల్, కింగ్స్‌వే, చార్ మినార్ రోడ్లల్లో వాహనాలు గంటల తరబడీ ఇరుక్కుపోయేవి. నిజానికి వీటిలో ఎక్కువ ట్రాఫిక్‌జామ్‌లు పోలీసులవల్లా, రాజకీయ నాయకులవల్లా, ఈ రెండు కేటగిరీల్లో పేరు కుపోయిన అవినీతివల్లా జరిగేవి. మంత్రి వస్తున్నాడని ట్రాఫిక్‌ని గంటలతరబడి ఆపేసి ఆయన కారుకోసం ఎదురుచూసేవారు- లేదంటే సిబ్బంది లేరంటూ ట్రాఫిక్ జామ్‌లకు కారణమయ్యేవారు.

**ఒంటెల ఊరేగింపు**

ఇవన్నీకాక ఆ రోజుల్లో తరచూ జరిగే ఇంకో ఫ్రాడ్ ఏమిటంటే పోలీసు అధికారులు కొన్ని ప్రైవే ట్‌కంపెనీల నుంచి లంచాలు తీసుకుని అవి మార్కెట్ చేయబోతున్న ఉత్పత్తుల ప్రచార ఊరేగింపులకు అను మతులివ్వటం.

ఒకసారి ఓ కంపెనీవారు ఇలా అనుమతి తీసుకునే తమ ఉత్పత్తికి సంబంధించిన బ్యానర్లతో, హోర్డింగ్‌లతో, భారీఫోటోలు, కటౌట్లతో- ఒంటెల ఊరేగింపు జరిపారు. పాతికపైగా ఒంటెలు మేళతాళాలతో- బ్యాన ర్లతో, ప్లకార్డ్స్‌తో సికింద్రాబాద్ కింగ్స్‌వే నుంచి చార్మినార్ వరకూ నగర వీధులన్నీ తిరు గుతూ ప్రచారం చేశాయి. అవెంత వేగంగా నడుస్తాయో అందరికీ తెలిసిందే.. ఊరేగింపు వెనుక ట్రాఫిక్‌జామ్- తప్పించుకునే మార్గమే లేదు.

ఎన్ని లక్షల మంది ఆరోజు పోలీసుల్నీ, రాజకీయనాయకులనూ తిట్టుకున్నారో. నిజా నికి ఇప్పటికీ ఆ పరిస్థితుల్లో తేడా లేదు.

పైగా ఇంకా దారుణంగా తయారయ్యాయి. ఇప్పటికీ లంచాలుతిని, సినీతారలతో పబ్లిసిటీ చేసుకుని ప్రజలపై ట్రాఫిక్ జామ్‌లు రుద్దే కంపెనీలకు అనుమతులిస్తూనే ఉన్నారు. ఇప్పటికీ రాత్రి తొమ్మిదిదాటితే పోలీస్ సిబ్బందిలేక ట్రాఫిక్‌జామ్‌లు ఏర్పడి జనం అర్ధరాత్రివరకూ తిప్పలు పడుతూనే ఉన్నారు.

అలాగే ఆ రోజుల్లో అందరి హృదయాలనూ కదిలించేలా కట్నకానుకల మీద ఆశతో భార్య ను లేక ఇంటికోడల్ని సజీవంగా తగలబెట్టటం వంటి వార్తలు పేపర్లో నిత్యం వస్తూండేవి.

ఈ పరిస్థితులను రాజకీయనాయకులు పోలీసులు మార్చలేరు. అది ఒక సామాజిక రుగ్మత! ఇవి మారాలంటే స్త్రీలు ఆర్థికంగా స్వతంత్రులు కావాలి. అంటే బాగా చదువుకోవాలి.. ఉద్యోగాలు చేయాలి.. ఒంటరిగా బతగ్గలిగే మనోధైర్యం పెంచుకోవాలి. వివాహం అనేది కేవలం స్త్రీకే అవసరం- మగాడికి కాదు అనే భావన మారాలి. ఇవన్నీ జరగాలంటే అంత తేలికేం కాదు.

అప్పట్లో చట్టమూ చాలా బలహీనంగా ఉండేది. కిర్సనాయిలు పోసి ఇంటి కోడల్ని కాల్చిన అత్తమామలూ, ఆడబిడ్డలూ, ఆమె భర్త- వీళ్ళంతా ఏళ్ళ తరబడి సాగే కోర్టుకేసులను ఆధారంగా తీసుకుని ఎలాంటి శిక్ష పడకుండా తప్పించుకునే వాళ్లు.

ఎవరూ పట్టించుకోకుండా పరిస్థితినలా కొనసాగనిస్తే- కిర్సనాయిలు హత్యలు నిత్యకృత్యమై పోయే పరిస్థితులు ఏర్పడ్డాయి.

దాన్ని దృష్టిలో పెట్టుకునే హాస్యం వ్యంగ్యం మేళవించి 'వరుడు కావలెను- కట్నంతోపాటు కిర్సనాయిలు ఉచితం' రాశాను. అలాంటి సబ్జెక్టుమీద హాస్య, వ్యంగ్య రచనచేయడం చాలా కష్టమయిన పనే!

ఈ పరిస్థితులను అందరం ఇలాగే కొనసాగనిస్తే భవిష్యత్తులో అవి ఎంతటి తీవ్ర దశకు చేరుకునేది- ప్రజలంతా దానికేమాత్రం స్పందించకుండా చాలా సహజమయినట్లు ప్రవర్తించటం వంటి అంశాలు అందులో హైలైట్ చేశాను. నిజానికి అలాంటి హత్యలు మొదలైనప్పుడు న్యూస్‌పేపర్లు వాటిని మొదటిపేజీలోనే ప్రచురించేవి. సంవత్సరాలు గడుస్తున్నకొద్దీ అవి రొటీన్‌గా, రోజూ జరిగే విషయాలవటంతో లోపలిపేజీల్లో అతిక్లుప్తంగా వేయడం మొదలెట్టాయి. పాఠకులూ అంతగా స్పందించడం మానేశారు.

ఆ ఉదాసీనతనే నేను ఎండగట్టాను. చాలా మంది దాని వెనుకదాగిన నిశిత విమర్శను అర్థం చేసుకున్నారు. కొందరు మహిళలు మాత్రం స్త్రీల పరిస్థితి అలా ఉంటే ఈ హాస్యోక్తులేమిటీ? అని ఫీలయ్యారు-

ఒకవేళ అదే సమస్యను ఎలాంటి వ్యంగ్యం, హాస్యం లేకుండా రాశామనుకోండి! ఇంచుమించుగా న్యూస్‌పేపర్స్‌లో వచ్చే కథనాల్లాగే తయారవుతుంది. వ్యంగ్యానికున్న శక్తి చాలా ఎక్కువ! ఎవరికి తగలాలో వారికి తగులుతుంది. కొంచెం హాస్యం జోడిస్తే- ఆ వ్యక్తికే కాక అందరికీ ఆత్మశోధనతోపాటు పెదాలమీదకు చిరునవ్వునీ లాక్కొస్తుంది.

'ఎ ట్రెయిన్ ఫ్రమ్ మసులా'లో మన పాసింజర్‌రైళ్లు ఎంత ఘోరంగా, దారుణంగా నడపబడుతోందీ, అడుగడుక్కీ ఎంతటి అవినీతికి రైల్వే సిబ్బంది పాల్పడుతోంది- ఇవన్నీ గమనించాకే రాశాను.

'గేదెలకు కొమ్ములుంటాయి' రాయడానికి ఆ రోజుల్లో బ్యాంకుల కుంభకోణాలే ప్రేరణ. అవినీతి భాగోతాలన్నీ పేపర్లలో చదవటం- గ్రామాల్లోవాళ్ళు చెప్పగా వినటంవల్ల అది సాధ్యమైంది. అయితే అన్ని నవలలూ లేక రచనలు నిజజీవితాలకు దగ్గరగా ఉండాలని రూలేం లేదు.

మన కలలు, సరదాలు, ఊహలకూ కూడా కథల అవసరం రావొచ్చు అలాంటి ఊహాతీత రచనలూ చాలా మందిని ఆకట్టుకుంటాయి. కనుక అన్నిటికి ఏదో ఒక ప్రేరణ అనేది మాత్రం తప్పదు.'

*సేకరణ: చంద్రప్రతాప్* ✦



# అబ్బో ప్రేమా, బహుప్రియం

అమ్మ బాబోయ్! ప్రేమకు నిర్వచనం చెప్పాలంటే, ప్రేమ గురించి అందరకూ అర్థం అయ్యేలా చెప్పడం అంటే ఏనుగును ఏకుల బుట్టలో పెట్టడం అంత కష్టం.

అందులోనూ ఈ ప్రేమ వుందే మహా విచిత్రమైనది. అద్దం ముందు ఎవరు నుంచుంటే వారి ప్రతిబింబమే కనిపిస్తుంది కానీ ఎదుటివాడి ప్రతిబింబం కనిపించదు.

ప్రేమా అంతే. మన మనసులో ఎంత ప్రేమ వుందో ఎదుటివాడికి కనిపించదు, అర్థం కాదు.

ప్రేయసీప్రియుల ప్రేమ గురించి చెప్పాలంటే అది అనంతం. అనిర్వచనీయం.

మరణించిన భార్యకోసం కోట్లు వెచ్చించి పాలరాతి మందిరం నిర్మించి ఒక ప్రేమికుడు తన ప్రేమను చాటుకుంటే గొడ్డలితో ప్రేయసి మెడనరికి తన ప్రేమను చాటుకుంటాడు మరో ప్రేమికుడు.

ఇక సినిమా ప్రేమకొస్తే అదో గందరగోళం వ్యవహారం. ఇద్దరు ఉత్తమురాళ్ళలో ఎవరి మనసూ నొప్పించలేక ఇద్దర్నీ పెళ్ళాడి, ప్రేమను పంచితే, ఆ పిచ్చిమొహాలు అదే మహాభాగ్యం అనుకుని అతడిని సవతికే చందాగా ఇచ్చేసి చచ్చిపోవడమో లేక విదేశాలకు వెళ్ళిపోవడమో చేసి తమ త్యాగానికి తామే మురిసిపోతారు. వారి ఉద్దేశంలో ఇదీ ప్రేమ.

కాకపోతే అది మనకు అర్థంకాదు.

సినిమాల్లో ఏం ఖర్మ? నిజజీవితంలో కూడా అంతే. ఒకరి ప్రేమను మరొకరు అర్థం చేసుకోరు.

నా భర్తకి నామీద ఆవగింజంతైనా ప్రేమలేదు. ఒక్కనాడు ఒక్క చీరె తనంతట తను తెచ్చి ఇవ్వలేదు అని వాపోయింది భార్య.

ఆవిడ దృష్టిలో భర్త చీరెలూ, నగలూ కొనివ్వడమే ప్రేమ అంటే. భర్తని పలకరిస్తే "అమ్మో! మా ఆవిడ మహంకాళీ మారిడమ్మ. ఎంతసేపూ తన స్వార్థమే కావాలావిడకి. నావైపువాళ్ళకి ఏమైనా చెయ్యమంటే ఏడ్చి చచ్చిపోతుంది" అంటాడు.

ఆయన దృష్టిలో ప్రేమ అంటే తనవారిని కూడా నెత్తిన పెట్టుకుని చూసుకోడం.

ఈ గొడవల్లో పడి సామాన్యంగా నిజజీవితాల్లో దంపతుల మధ్య ప్రేమలుండవు. ఉన్నా అవి బయటకి కనిపించవు. ఒకవేళ కనిపించాయో ప్రళయాలో చేస్తాయి.

ఉదాహరణకి ఓ సగటు భర్తగారు సర్దాగా "ఇదుగో చూడు, ఆ పక్కింటావిడ కట్టుకున్న చీరె ఎంత బావుందో! నువ్వూ కొనుక్కుంటావా అట్లాంటిది" అన్నాడనుకోండి!

ఆవిడకి చిర్రెత్తుకొస్తుంది. "నా దగ్గర చూసే ఆవిడా చీరె కొనుక్కుంది. నేను చాలాసార్లు కట్టుకున్నాను. మీ కంట పడలేదు మరి!! ఇంతకీ మీకు బావుంది చీరే అయితేగా!!' అని యుద్ధం చేస్తే ప్రేమ కాస్తా ప్రళయం అయిపోదూ!!

అలాగే భావుకుడైన ఒక భర్త "కళ్ళల్లోకి కళ్ళు పెట్టి చూడవెందుకూ? " అని రొమేంటిక్‌గా పాడాడే అనుకోండి!

నేను నీ కళ్ళల్లోకి కళ్ళు పెట్టి చూస్తూ కూర్చుంటే అవతల చాకిరీ ఎవరు చేస్తారూ, నా గ్రాండ్ ఫాదరా అని భార్య విసుక్కుంటుంది.

కాబట్టి నిజజీవితంలో దంపతుల మధ్య అంతగా ప్రేమలుండవు. అయితే వేరే రకాల ప్రేమలుంటాయి.

మచ్చుకి కొన్ని

కోడలు నిద్రపోతుంటే "చూడు గుర్రంలా ఎట్లా నిద్రపోతోందో అని లోలోపలే విసుక్కునే అత్తగారు, కూతుర్ని 'కాసేపు పడుకోమ్మా' అంటే అది తల్లి ప్రేమ.

మావాడు ఉత్త వెధవ పెళ్ళానికి దాసోహం అంటాడు. మా అల్లుడిని చూడండి ఎంత సమర్థుడు. మా అమ్మాయి మాట కాదనడు. అని ఒక తండ్రి మెచ్చుకుంటే అది పితృ ప్రేమ.

పనిమనిషి మనింట్లో శ్రద్ధగా పనిచేస్తూ మీరెంత మంచివారమ్మా ఎంచక్కా వారంలో మూడు రోజులు ఒక్కపొద్దులుంటారు. గిన్నెలుండవు.

పక్కింటివాళ్లూ మంచివాళ్ళే. శని ఆది వారాలు హోటల్‌కు వెళతారు. ఎటొచ్చి ఆ ఎదురింటి అమ్మగారే వారానికి ఏడు రోజులూ మూడు పూటలా తింటారు అని పొరుగువారిని నిందించి మిమ్మల్ని మెచ్చుకుంటే అది పనిమనిషి ప్రేమ.

మనం రాసిన కథతోపాటు ప్రచురించిన ఫొటో చూసి "మిమ్మల్ని చూస్తే చచ్చిస్వర్గాన వున్న మా నాయనమ్మ గుర్తుకొచ్చి ఏడుపొచ్చింది. మీ కథ నాకెంతో నచ్చింది. మేము గుడి కట్టిస్తున్నాం. దానికి మీవంటి పెద్దవారి ఆశీస్సులు కావాలి. మీ చేత్తో ఇస్తే మాకు అక్షయం అవుతుంది." అని ఉత్తరం రాస్తే అది సెంటిమెంటు ప్రేమ.

ఇలా దైనందిన జీవితంలో ఎన్నో ప్రేమలు ఎదురవుతూ ఉంటాయి. అసలీ ప్రేమ మధురమైనదే కాదు. బాధాకరమైనది కూడా.

మనుషుల పొడ గిట్టకుండా నన్ను ముట్టుకోకు నామాల కాకీ అనేవిధంగా వుండే వాళ్ళు, కుక్కలనీ, పిల్లులనీ పెంచుకుని, వాటిని నెత్తిన ఎక్కించుకుని చివరాఖరికి వాటికి ఆస్తులనీ కట్టబెడితే అది జంతుప్రేమ.

వృద్ధులైన కన్న తల్లిదండ్రులకు గుప్పెడు అన్నం పెట్టడానికి గింజుకులాడిపోతున్న మన సమాజంలో డబ్బులు తీసుకుని వేషాలు వేసే సినీ తారలకు గుళ్ళు కట్టడం పిచ్చి ప్రేమ.

అసలీ ప్రేమకు కూడా కాలంతో బాటు ఎన్నో మార్పులొచ్చేశాయి. మార్పు సహజమే మరి. మా అమ్మ పెళ్ళికి కాసు బంగారం పదమూడు రూపాయలట. మరి ఇప్పుడు మా అబ్బాయి పెళ్ళికి కాసు అయిదువేలు మించిపోయింది.

అలాగే ప్రేమ కూడా ప్రియం అయిపోతుంది.

ఎప్పుడో అరవై ఏళ్ళ కిందట మా బంధువు ఒకాయన బెనారస్ యూనివర్సిటీలో చదువుకుంటూ ఉండేవాడట. ఆయన వయసు పంతొమ్మిది. భార్య వయసు పది. సరదాపడి భార్యకు దీపావళి పండుగ సందర్భంగా శుభాకాంక్షలు పంపించాడట.

ఒక కార్డుమీద ఇండియన్ ఇంకుతో ప్రియమైన శాంతకు దీపావళి శుభాకాంక్షలు. ఇట్లు నీ భర్త రామక్రిష్ణ అని రాశాడట. అంతే!

అది చూసి అందరూ గగ్గోలు పెట్టేశారట. ఏం సిగ్గులేనితనం నేరుగా భార్యకి రాస్తాడా? పెద్దవారు మామగారికి రాయాలిగానీ ఇదేం చోద్యం? అని గోల పెట్టేశారట.

అప్పట్లో అది పెద్ద చర్చనీయాంశం అయిపోయిందట. చాలా కాలందాకా కథలు కథలుగా చెప్పుకున్నారట. కట్టుకున్న భర్త భార్యకి ఓ ఉత్తరం ముక్క రాసుకునే స్వతంత్రం కూడా ఉండేది కాదు ఆ రోజుల్లో.

ఆ తర్వాత కూడా ప్రేమించినా ఆ

విషయం దాచాలనే చూసేవారు ప్రేమికులు. తల్లిదండ్రులకు కూడా ఎవరి ద్వారానో తెలిసేవి ఇటువంటి విషయాలు. అప్పట్లో ప్రేమించాలంటే మనసుంటే చాలు. ఇప్పుడలా కాదు. మనసుతో బాటు డబ్బు కూడా పుష్కలంగా వుండాలి.

ప్రేమకి చాటూ మాటూ లేదు. అంతా బట్టబయలు.

అంతదాకా ఎందుకు? ప్రేమికులకి ప్రత్యేకంగా ఒక దినం ఛ... మరీ దినం అంటే మోటుగా ఉంది. ఇంగ్లీషులో డే అనే అందాం. అదే ప్రేమికుల డే ఒహటి బయలుదేరింది.

ఫారెన్లో వుండేదట. మనకు దిగుమతి అయింది. ఫారెన్‌లో పద్ధతులు వేరు. అక్కడ ఎంత డబ్బున్నవాడి కొడుకైనా కాస్త బుద్ధి తెలిసినప్పటి నుంచీ పెట్రోల్ బంకుల్లోనో, డిపార్ట్‌మెంటల్ స్టోర్సులో పార్ట్‌టైం ఉద్యోగాలు చేసి జేబు ఖర్చుకి డబ్బు సంపాదించుకుంటారట.



మనకలా కాదే. పాతికేళ్ళు నెత్తిమీదికొచ్చినా తండ్రి మీదనే ఆధారపడే సాంప్రదాయం మన దేశంది.

కష్టజీవులైన ఆ పిల్లలు వేలంటేన్సు డే జరుపుకుంటున్నారని ఈ బద్ధకం పిల్లలు కూడా జరుపుకోవడం మొదలుపెట్టారు.

మొదట్లో ఓ గులాప్పువ్వు ఇచ్చేవారు గర్ల్ ఫ్రెండ్‌కి. ఆ తర్వాత వేలం వెర్రి ముదిరిపోయింది. ఏటా ఎన్నో కోట్లకి కోట్లు వ్యాపారం జరుగుతోందట ఈ వేలంటేన్స్ డేకి.

ఫలితం ఉరుము ఉరిమి మంగలం మీద పడిందన్నట్లు ఈ ఆపదంతా ఆ పిల్లల తండ్రులకి.

దీన్ని ప్రేమంటారా?

యువతని కదిలించి చూడండి. "ఇదే ప్రేమ తండ్రి వెధవ ఏడిస్తే ఏడిశాడు. ఒక నాడు సంతోషంగా డబ్బులిచ్చాడు కనకనా! ఏడిపించైనా డబ్బులు వసూలు చేసి మంచి గిఫ్ట్ కొని గర్ల్‌ఫ్రెండ్‌కి ఇస్తే అందులోని ఆనందం వర్ణనాతీతం" అంటారు.

మరికొంతమంది ప్రేమ భయంకరంగా వుంటుంది. ప్రేయసికి రక్తంతో ఉత్తరాలు రాస్తారు వీళ్ళు. దానికి బదులు రెండు రూపాయల బాల్‌పాయింట్ పెన్‌తో ఉత్తరం రాసి, ఆ రక్తం దానం చేస్తే పుణ్యం రాదూ!

ఎవరు చెప్పారు వాళ్ళకి? చెప్తే ఆ చెప్పిన వాళ్ళ రక్తంతోనే ఉత్తరం రాసేస్తారేమో అని భయం!!

ప్రేమ కావాలని అలమటిస్తున్న వారిని వదిలేసి సుఖంగా బతుకుతున్నవారి జీవితంలో బలవంతంగా ప్రవేశించి మనసుని అల్లకల్లోలం చేసి తమాషా చూడ్డం ప్రేమకి సరదా.

పైకి చెప్పుకోలేక, మనసులో దాచుకోలేక వారు పడే వేదనకి అంతుండదు.

ప్రేమ వేరు. జీవితం వేరు. ఊహ వేరు. వాస్తవం వేరు ఇదంతే. అంతుబట్టని రహస్యం.

నిజమైన ప్రేమ సరైన సమయంలో లభించి అందులోని మాధుర్యాన్ని ఆస్వాదించగలిగిన ధన్యజీవులు కోటికి ఒక్కరైనా వుంటారా?

ఏమో! అనుమానమే!

కాబట్టి మారుతున్న కాలంతో బాటు మారుతున్న ప్రేమలని చూస్తూ వూరుకొనటమే ఉత్తమం.

– పొత్తూరి విజయలక్ష్మి

నాటి చతుర



నాటి నవల

ఫ్లాష్‌బ్యాక్

# యువజ్వాల

శ్రీసుభా

ఏప్రిల్ 1979: సంపుటి: 12 సంచిక: 3

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. గతంలో ఏ నెలలో ప్రచురించిన నవలను అదే నెలలో పరిచయం చేయడం జరుగుతుంది. 1979వ సంవత్సరం ఏప్రిల్ నెల **చతుర**లో ప్రచురించిన శ్రీ సుభా నవల **'యువజ్వాల'** పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

అగ్నిసాక్షిగా మంత్రోచ్ఛారణల మధ్య పవిత్రంగా జరిగే పెళ్ళిళ్ళలో ఎక్కడా పవిత్రత కనిపించడం లేదు. ప్రతి పెళ్ళి వెనుకా బోల్డంత విషాదం కనిపిస్తోంది. ఏడడుగులు కలిసి నడిచిన భార్య భర్తనీ, భర్త భార్యనీ ఏవగించుకుంటున్నారు. రోజుకి కొన్ని లక్షల పెళ్ళిళ్ళు జరుగుతుంటే అందులో వేల దంపతులు అయిష్టంగా కాపురాలు చేస్తున్నారు. మగవాడు ఆడదాన్ని విలాస వస్తువుగానూ, ఆడది మగవాణ్ణి ఆసరాగానూ తప్ప మరో ఉద్దేశంతో చూడటం లేదు. సంప్రదాయం పేరిట జరిగే ప్రతి పెళ్ళి వెనుకా బీటలు కనిపిస్తాయి. వివాహమంటే కన్నీళ్ళు కారుస్తూ బతుకుతో రాజీపడటం కాదు. కడుపులో కడలిని దాచుకుని సంసారం చేయటంలో తన వ్యక్తిత్వాన్ని మరిచిపోయే అశక్తురాలు కాకూడదు స్త్రీ. అత్తవారింటికి అమ్మేస్తే స్థల మార్పు కోసం వచ్చిన స్తబ్దజీవి అంతకంటే కాకూడదు. నూరేళ్ళ జీవితం నిరాశా నిట్టూర్పులతో గాక సంతోషంగా గడపాలని అందుకు కొన్ని ఛాందసాలను తెంచుకోవాలనీ సందేశమిచ్చారు ఈ నవలలో రచయిత శ్రీ సుభా.

నవలలోని నాయకుడు సారథికి లక్ష్మమ్మ, సుబ్బరామయ్యలు తల్లిదండ్రులు. అన్న కాంతారావు, చెల్లి మాలతి. సారథి ఆదర్శభావాలు కలవాడు. లోపాలు ఎవరిలో ఉన్నా దానిని బట్టబయలు చేసి అరికట్టాలనుకునే అభ్యుదయవాది. అంతేకాదు, కాలేజీలో జరిగిన డిబేట్‌లో పాల్గొని గంభీరంగా ప్రసంగిస్తాడు. ఆ తరువాత తను వేస్తున్న నాటకం రిహార్సల్స్‌కు వెళ్తాడు. రిహార్సల్స్ అయ్యాక డైరెక్టర్ రామేశం, "కప్పుల కోసం, పేపర్లో ఫోటోల కోసం నాటకాలు వేయకండి. అదే నా సలహా. నటన సెకండరీగా అనుకున్నంత కాలం మన స్టేజ్ పెరగదు. ఇది కూడా విద్య. చదవాలి. నేర్వాలి. స్టాన్సిలేవీస్కీ పుస్తకం చదువు" అని సలహా ఇస్తాడు. ఆ

తరువాత ఇంటికి చేరిన సారథికి తల్లిదండ్రుల మాటలు విన్పిస్తాయి.

"కాంతారావు పెళ్ళి జరగబోతుంది కనుక అతడి తిరుగుళ్ళు, జులాయితనం మానుకోమ' 'ని భార్యను చెప్పమంటాడు తండ్రి. కాంతారావు పెళ్ళి ఘనంగా జరుగుతుంది. ఓ ఆడ పిల్ల పెళ్ళిలో కనబడే హిపోక్రసీ మరెక్కడా కనబడదనుకుంటాడు సారథి. అరుంధతి కాపురానికి వస్తుంది. సారథి బి.ఏ. పాసయిన రోజు ఇంట్లో వాళ్ళందర్నీ సినిమాకు తీసుకువెళ్తాడు. అన్న కాంతారావు ఆఫీసులో పనుందని వెళ్ళడు. సినిమా నుండి వస్తున్న సారథి, అరుంధతి, మాలతి తదితరులకు రిక్షాలో సుజాతతో కలిసి వస్తున్న కాంతారావు ఎదురవుతాడు. కాంతారావు వ్యవహారం అరుంధతికి పూర్తిగా అర్థమవుతుంది. పెళ్ళికూతురుగా తనెంత సుఖపడుతుందో, బతుకులో ఏం మూట గట్టుకుంటుందోనని పెళ్ళికి ముందు ఆలోచించినా వాస్తవంలో మిగిలేదేమీ ఉండదు. ఓ గూడు వదిలి మరో గూటికి చేరిన పక్షి కథలా అవుతుందని అరుంధతి బాధ పడుతుంది. కాంతారావు పనిచేసే ఆఫీసులోనే పనిచేసే సుజాత కాంతారావుకు రాసిన ప్రేమ లేఖ అరుంధతి చదివి నిలదీసినా కాంతారావు బుకాయిస్తాడు. అత్తగారు సుజాతనే మందలిస్తుంది. సారథి వదినను ఓదారుస్తాడు.

సారథి చెల్లెలు మాలతి సారథి మిత్రుడైన ప్రసాద్‌ను ప్రేమిస్తుంది. అతడు మరో కులం వాడు కావడాన మాలతి తల్లిదండ్రులకు సుతేమిరా ఆ పెళ్ళి ఇష్టం ఉండదు. కాంతారావును పిలిచి "మాలతి ప్రసాద్‌ను పెళ్ళి చేసుకుంటుందట. మందలించు" అంటాడు తండ్రి. "సారథిగాడి భరోసాతో అని ఉంటుంది. వెధవ పుస్తకాలు వాడు చదివింది చాలక దాని చేత చదివిస్తాడు. వాడి మూలంగానే మాలతి పాడవుతుంది" అంటాడు కాంతారావు.

ఈ విషయాన్ని తమ్ముడితో చర్చించటమే గాక "నువ్వు ఆ నాటకాల పిల్ల శాంతితో కలిసి తిరిగే తిరుగుళ్ళు నాకు తెలుసు. మనం మగవాళ్ళం కానీ మాలతిని నీలా తయారుచెయ్యకు" అంటాడు కోపంగా. సారథి తరచూ ఓ స్నేహితుడిగా తన నాటకంలో పాత్రధారి శాంతి ఇంటికి వెళ్తుంటాడు. ఆమె పట్ల అతనికి స్నేహం, సానుభూతి ఉన్నాయి. లోగడ శాంతిని జగన్ అనే వ్యక్తి పెళ్ళి చేసుకుని నానా హింసలు పెట్టి తరిమేస్తాడు. ఆమె ఆ ఊరొదిలి వచ్చి నాటకాలలో వేషాలు కట్టి పొట్ట పోసుకొంటుంది.




మాలతి ప్రసాద్‌ను పెళ్ళి చేసుకుంటుంది. కొన్నాళ్ళు మాలతిని శాంతి ఇంట్లో ఉంచుతాడు సారథి. సారథి శాంతిని ప్రేమిస్తున్నాడని, వాళ్ళు పెళ్ళి చేసుకోబోతున్నారని మాలతికి తెలుసు. ప్రసాద్‌కు చెన్నైలో ఉద్యోగం రాగా బయల్దేరబోయేరోజు భర్తను వెంటబెట్టుకుని తల్లిదండ్రుల దగ్గరికి వెళ్తుంది మాలతి. తల్లి మనస్ఫూర్తిగా ఆహ్వానిస్తుంది. తండ్రి మాట్లాడడు. అరుంధతి ఆడపడుచుకు కొత్త బట్టలు అత్తగారి చేత పెట్టిస్తుంది. వాళ్లు వెళ్ళబోతుండగా గుమ్మం దగ్గర అందరితో పాటు తన తండ్రి సుబ్బరామయ్య కూడా వీడ్కోలు చెప్పటం మాలతికి కనిపిస్తుంది.

చెన్నైకి వెళ్లడానికి మాలతి, ప్రసాద్‌లు

రైల్వే స్టేషన్‌కు బయల్దేరతారు. సారథి, శాంతి వాళ్లను రైలెక్కించడానికి రైల్వే స్టేషన్‌కు వెళ్తారు. అక్కడ కాంతారావు, సుజాతలు కన్పిస్తారు. రైలు వెళ్ళిపోయాక సారథి, శాంతి స్టేషన్ బయటకు వచ్చి నడుస్తుంటారు.

అన్నయ్య తిరుగుబోతు తనం గురించి వదిన పడుతున్న క్షోభ గురించి చెప్పి బాధ పడతాడు. "ఇదంతా మన వ్యవస్థ లోపం. పసుపుతాడు, మంగళ సూత్రాలు, మంత్రాలు, మంగళ వాయిద్యాలు ఏవీ ప్రేమను ఇవ్వలేవు. పెళ్ళి అంటే ఏదో బంధం, అది తెంచుకోవటం పాపం అనే దురభిప్రాయం మనలో పాతుకుపోయింది" అంటాడు సారథి

కాంతారావు, సుజాతతో విజయవాడ వెళ్ళి హోటల్లో దిగుతాడు. తను భార్యకు విడాకులిస్తాననీ, సుజాతను పెళ్ళి చేసుకుంటానని వాగ్దానం చేస్తాడు. సుజాత అన్న సహాయంతో శాంతి భర్త జగన్‌ను కలుసుకుని కుట్ర పన్నుతాడు.

మిత్రుల సమక్షంలో సారథి, శాంతి పెళ్ళి చేసుకుంటారు. ఈ విషయం తెలిసి సారథి తల్లిదండ్రులు శాంతి దగ్గరికి వచ్చి గొడవ చేస్తారు. కాంతారావు కూడా సారథి లేని సమయంలో వచ్చి శాంతిని కోప్పడి, తిట్టి అంతు చూస్తానని బెదిరించి వెళ్తాడు. విజయవాడలో జగన్‌ను కలుసుకుని శాంతిని తెచ్చుకుని కాపురం పెట్టమంటాడు. అందుకు డబ్బిస్తాడు. శాంతి నాటకాలు వేసి డబ్బు సంపాదిస్తుంది గనుక అది తను స్వాధీనం చేసుకొని దర్జాగా బతకొచ్చని శాంతి ఇంటికి బయల్దేరతాడు జగన్.

ప్రసాద్‌కు అపెండిసైటిస్ ఆపరేషన్ అని తెలిసి చెల్లి మాలతికి తోడుగా ఉండటానికి చెన్నై వెళ్తాడు సారథి. ఆ సమయంలో శాంతి దగ్గరికి వచ్చిన జగన్ ఆమెను తనతో రమ్మని అడుగుతాడు. శాంతి వాదిస్తుంది. అతనితో సంసారం చేయడం, కష్టాలు పడటం గుర్తురాగా రాను పొమ్మంటుంది. ఒళ్ళు తెలియని మగతలోకి ఆమె పడిపోయేలా చేసి టాక్సీలో తీసుకువెళ్ళిపోతాడు జగన్.

చెన్నై నుండి వచ్చిన సారథికి శాంతి కనిపించదు. తెలిసిన వాళ్ళందరి దగ్గరా ఆమె కోసం వాకబు చేస్తాడు. ఎవరూ తెలియదంటారు. పట్టువదలకుండా వెదుకుతూనే ఉంటాడు - సుజాత గర్భవతి కాగా ఆమె అన్న శివరావు, వదిన శారదలు కాంతారావు ఇంటికి వచ్చి లక్ష్మమ్మ, సుబ్బరామయ్యలను నిలదీస్తారు. సుజాతను పెళ్ళి చేసుకొని తీరాలంటారు. అరుంధతి తను కాంతారావుకు విడాకులిస్తాననగా సారథి ఆశ్చర్యపోతాడు. భర్త ప్రవర్తనలో మార్పుకోసం చూసి ఆ మార్పు రానప్పుడు భర్త నుంచి విడిపోవడం మేలనుకుంది అరుంధతి.

చెన్నైలో నాటకాల డైరెక్టర్‌తో ఒప్పందం కుదుర్చుకుని అడ్వాన్స్ తీసుకుంటాడు జగన్. శాంతిని నాటకాల రిహార్సల్స్‌కు తీసుకువెళ్తాడు. అదే నాటకంలో హీరో పాత్ర ప్రసాద్ వేస్తున్నాడు. శాంతి సారథి భార్య అని తెలుసు గనుక సారథిని పిలిపించి తను నెల్లాళ్ళు ఊళ్ళో ఉండటం లేదనీ, సారథికి నాటకాల అనుభవం ఉందనీ, తన బదులు తన పాత్రను సారథి ధరిస్తాడని దర్శకుడికి పరిచయం చేస్తాడు. ఫలితంగా శాంతి, సారథి పరస్పరం విషయాన్ని అర్థం చేసుకుంటారు. ఆ తరువాత రిహార్సల్ ముగిశాక జగన్‌తో మాట్లాడి సినిమాల్లో శాంతికోసం ప్రయత్నిస్తానంటాడు. సారథి ఎవరో తెలియని జగన్ సారథిని తన ఇంటికి విందుకు ఆహ్వానిస్తాడు. "మీరు మాట్లాడుకుంటూ ఉండండి. ఇప్పుడే వస్తాను" అని జగన్ బయటకు వెళ్ళగానే జరిగినదంతా వివరించి ఏడుస్తుంది శాంతి. తను ఇప్పటికీ ఆమెను ఎప్పటిలాగే ప్రేమిస్తున్నానని చెప్పి ఆమెను వెంట బెట్టుకుని మాలతి, ప్రసాద్‌ల ఇంటికి వెళ్తాడు సారథి.

మర్నాడు జగన్ వస్తాడు. అతడిని భయపెట్టి విడాకులకు ఒప్పించి లాయరు దగ్గరికి తీసుకువెళ్తారు సారథి, ప్రసాద్‌లు. జగన్‌తో శాంతికి విముక్తి కలుగుతుంది. సారథి, శాంతి ఒకటవుతారు. ✦

ఫిబ్రవరి 2006 'చతుర' నవల

# ఎవరు పై సమీక్షలు





## మేల్కొనవలసిన సమయం

(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

పాశ్చాత్య సంస్కృతి విష ప్రభావం హాలాహలంలా విజృంభించి భరత ఖండమంతా కమ్ముకుని కకావికలం చేస్తున్న తరుణంలో ప్రవాసాంధ్రునిచే సంధించబడిన అస్త్రానికి బాసటగా నిలచిన 'చతుర'కు అభినందనలు.

రక్తపు గ్రూపులకు చెందిన సమాచారాన్ని యువతరం తమ మనస్తత్వానికి, అభిరుచులకు తగ్గవారిని ఎన్నుకోవడానికి ఉపయోగించుకుని శాంతి సౌభాగ్యాలు పెంపొందించుకోవాలి. నేటికాలంలో వెర్రితలలు వేస్తున్న విశృంఖలత వల్ల అక్రమ సంబంధాలు, అక్రమ సంతానం, భ్రూణ హత్యలు, ఎయిడ్స్ వంటి భయంకర పరిణామాలు సంభవిస్తున్నాయి. ఉన్నతమైన మన భారతీయ సంస్కృతిని నిర్వీర్యపరచడానికి పాశ్చాత్య దేశాల దాడికి అంకురమే ఈ విశృంఖలత. ఒకదాని నుండి మరొకటిగా సమస్యలు ఉద్భవించి విశ్వరూపం దాల్చాయి. ఈ సమస్యలను అదుపు చేయడానికి ఒక సాధనంగా రక్తపు గ్రూపులకు చెందిన విజ్ఞానాన్ని మలచుకోవాలి. మార్గం తప్పిన వారిని దారికి తేవడానికి దాని భయంకర కోణాన్ని ఆవిష్కరించడమే సరియైన పని. ఇందుకోసం రచయిత అనేక పాత్రల ద్వారా మానవ సంబంధాలలోని వివిధ కోణాలను సృజించి అక్రమ సంబంధాల పర్యవసానాలను చక్కగా వివరించారు. నిజాలు తెలుసుకోక ముందే అపోహలతో బాధపడిన లక్ష్మి, మదాలసలే గాక రమణి, గురు, రాజేష్, హోయసల పాత్రలలో కూడా మార్పు తీసుకొచ్చినట్లు చూపితే ఇంకా బాగుండేది.

శేషాచలం పాత్ర చెప్పినట్లు ప్రభుత్వం ప్రజలలో నైతిక విలువలు పెరిగేట్లుగా చర్యలు తీసుకోవడం, పెనుభూతంగా మారుతున్న ఎయిడ్స్ వ్యాధి గురించి జనాన్ని జాగృతం చేయడం వంటి కార్యక్రమాలు చేపట్టి సమస్య భయంకర రూపం సంతరించుకొనకముందే మేలుకొనవలసిన అవసరాన్ని ఈ నవల నొక్కి చెపుతోంది.

– **జె.వి.రమణ,** మణుగూరు.

## ప్రయోగాత్మకం

(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

ఈ మధ్యకాలంలో వచ్చిన నవలలన్నింటిలోనూ 'ఎవరు' ప్రత్యేకమైనది, ప్రయోగాత్మకమైనది. ఇటువంటి సబ్జెక్ట్ నిజంగా సంచలనాత్మకమైనదే! సాధారణంగా ఎవరూ ఇలాంటి సాహసానికి ఒడిగట్టరు. కానీ రచయిత శరత్ ఎన్నుకున్న కమర్షియల్ టెక్నిక్ నవల ఆద్యంతమూ చదివిస్తుంది. నవలలో 'రక్త విశ్లేషణ'లు గమ్మత్తుగా ఉన్నాయి. చాలామంది చదువరులు కూడా ఒకింత ఆలోచనకు గురికాక తప్పదేమో! ఎందుకంటే బ్లడ్‌గ్రూపులను గురించి వివరణాత్మకమైన వ్యాసం కూడా నవలతోపాటు

ఇవ్వటం సంచలనమే కాదు. సాహసం కూడా. అయితే నవలలో వచ్చిన చాలా పాత్రలు కథ కనుగుణంగా ఇమిడిపోయాయే కానీ గొప్పగా గుర్తుండిపోయే విధంగా పాత్ర చిత్రణ జరగకపోవటం రవ్వంత లోపం. సాధ్యాసాధ్యాలు పక్కనపెడితే నిజ జీవితంలోని మనుషులు, వారి మనస్తత్వాలు ఎంత విచిత్రంగా మారిపోతున్నాయో చిత్రిస్తూ కొన్ని పాత్రలను మలిచిన తీరుకు రచయిత శరత్ అభినందనీయులు.

సాక్షాత్తు ముఖ్యమంత్రులు, 'మంత్రి వర్గ సహచరులు, ప్రముఖులు, గృహిణులు, మధ్యతరగతి వారు, అభ్యుదయ మహిళల మీద విసిరిన సున్నితమైన సెటైర్లు ఈమధ్య కాలంలో ఏ నవలలోను ఇంతగా కనిపించలేదు. ప్రజలూ, ప్రభుత్వాలూ ఎప్పుడూ అనవసర విషయాలకే ప్రాధాన్యతనిస్తారన్నది నగ్నసత్యం. రచయిత సత్యశ్రీ పాత్ర కూడా అంతగా ప్రాధాన్యత సంతరించుకోలేదు. ఇక ప్రస్తుత సమాజంలోని 'అక్రమ సంబంధాల భాగోతం'పై ఎక్కుపెట్టిన ఈ 'ఎవరు' బాణం చాలా తక్కువ పేజీలలో రావడం బాగా లేదు. నవల ముగింపు కూడా వేగంగా, అనుకోకుండా, అర్ధాంతరంగా ముగించినట్లనిపించింది. ఆఖరుగా 'ఎయిడ్స్' వైపు పాఠకుల దృష్టిని మళ్ళించి **'తస్మాత్ జాగ్రత్త'** అన్న రచయిత అభినందనీయుడు.

**-ముద్దంశెట్టి అండమ్మ, చిలకలూరిపేట.**

## ఆరోగ్యకరమైన ఇతివృత్తం ఉండాలి

**(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)**

ఎయిడ్స్‌కు సరైన గుర్తింపు రాలేదన్న అక్కసుతో 'ఎవరు?' అనే సంచలనాన్ని సృష్టించి. ఒక విధంగా ఎయిడ్స్ నిర్మూలనకు పరోక్షంగా కృషి చేశారు నవలలోని రచయిత సత్యశ్రీ. బ్లడ్ గ్రూపు కాంబినేషన్ కారణంగానైనా అక్రమ సంబంధాలు మానుకుని ఋజు ప్రవర్తనను అలవర్చుకుంటారని రచయిత ఆకాంక్ష. కాని ఇది సరైన మార్గం కాదు. సమాజానికి మార్గ నిర్దేశం చేయాల్సిన వారు మానసిక పరివర్తన తీసుకువచ్చే ప్రయత్నం చెయ్యాలేగానీ ఘాటైన డోసిచ్చి వికటించే పరిస్థితి తీసుకురాకూడదు. ఇలాంటి అపరిపక్వ పరిశోధనల వల్ల ఎప్పుడో జరగబోయే నష్టం సంగతేమోగాని ఇప్పుడు మాత్రం ఆసక్తి పెరుగుతుంది. అనుమానాల బీజాలు మొలకెత్తి తల్లిదండ్రుల బ్లడ్ గ్రూపులను వెతుక్కుంటూ, అనుకోని నిజాలు బయటపడటంతో లక్ష్య, మదాలస లాంటి ఎదిగీ ఎదగని మనసులు ఎంత తల్లడిల్లిపోతాయో గమనించాలి. ఏ చిన్న తేడాలొచ్చినా అలాంటివారు అభద్రతకు లోనవుతారు.

ఏ విషయంలోనైనా వాస్తవిక దృక్పథంతో అడుగు ముందుకేసినప్పుడే సమాజంలో నీతి, నిజాయితీ కల్గిన నాణ్యమైన బీజాలు మొలకెత్తుతాయి. ముఖ్యమంత్రి అంతటి పెద్ద మనిషే తన సంతానం బ్లడ్ గ్రూపుల గురించి ఎందుకు ఆరా తీసినట్టు? అనుమాన బీజం మొలకెత్తబట్టే కదా. భార్యాభర్తల మధ్య నమ్మకం ఉండాలి. ఎయిడ్స్ వ్యాధి ప్రబలటానికి చదువు -సంస్కారం ఉన్న పెద్ద కుటుంబాలు కూడా దోహదపడ్తున్నాయనటంలో సందేహించాల్సిన పనిలేదు. సిద్ధాంత పరంగా ఋజువుకాని అసంపూర్తి పరిశోధనలు ప్రజల్లో ప్రవేశపెట్టటం తగదు. ప్రేమానుబంధంతో అల్లుకుపోవాల్సిన హృదయాలు, రెండు కుటుంబాల మధ్య అవగాహనతో పెనవేసుకుపోవాల్సిన పెళ్ళి సంబంధాలు బ్లడ్ గ్రూపుల పేరుతో నిర్ణయించుకోవాలనుకోవటం, ఇంతకన్న దుర్భర జీవితం ఏముంటుంది? సంచలనం సృష్టించి సమాజంలో చలనం తీసుకురావటానికి ఆరోగ్యకరమైన ఇతివృత్తం ఎంచుకుంటే బాగుంటుందని నా అభిప్రాయం.

**- లక్ష్మి, మిర్యాలగూడ.**

## సెన్సేషనల్ నవల (నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

మనిషి మనస్సు సహజంగా కుతూహల జనకం. ఏది 'గుప్తమో దాన్నే తెలుసుకోవాల నుకుంటుంది. రక్తపు రకాల వల్ల మనుషుల మనస్సులను మథించడం, ఆ మథనం తమ సంతానం సక్రమమా, అక్రమమా అన్న అంతర్మథనంగా మారటం, భర్తలకు భార్యల మీద, భార్యలకు భర్తల మీద, అనుమానాలు వగైరా అంశాలతో కూడిన కథావస్తువుతో ఊపిరి సలపకుండా చదివించగల సెన్సేషనల్ నవల రాసిన రచయిత శరత్ అభినందనీయులు. ఇంచుమించుగా ఎనిమిది జతలతో, ప్రతి జతకీ ఏదో ఒక అసంబద్ధమయిన రక్త రకమున్న సంతానాన్ని ఇరికించి 'ఎవరు' నవలను సాగించారు. మన దేశంలోశాస్త్ర విషయాలు చాలా మందికి తెలియవు. తెలిసిన వాళ్లు పెద్దగా పట్టించుకోరు. మేనరికాలతో మందబుద్ధి సంతానం పుట్టుకొస్తున్నా, ఆర్. హెచ్. సరిపోక, తల్లే బిడ్డకు పాలివ్వడానికి అనర్హురాలయినా, ఈ వివాహాలు తగ్గటం లేదు. రాశి, అంశ, లగ్నం, నక్షత్రం, శాఖ, గోత్రం, చూస్తారే కాని బ్లడ్‌గ్రూప్, ఆర్. హెచ్. అంశం సరిచేసి చూసు కోరు. ఇవి సరిచేసుకోవడం, వివాహం ఏ తంతుతో జరిగినా రిజిష్టరు చేసుకోవడం, ముందు ముందు ఆవిర్భవించనున్నాయి. శేషాచలం ప్రతి ఒక్కరికి వాత పెడ్తూ, అసలు వస్తువుల నుంచి ఎయిడ్స్ మీదికి మళ్లించి, తను మట్టుకు ఎవరికీ పట్టు బడకుండా చాకచక్యంగా తప్పుకోవడంతో ముగింపు చాలా బాగుంది.

**- వి. లలితాంబ, పర్లాకిమిడి.**

## సమాజానిదే బాధ్యత (ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

రచయితల నుండి సమాజం ఆశించేది వాస్తవాలనా లేక సామాజిక బాధ్యతనా? నగ్న సత్యాలనా లేక నాగరికులు మెచ్చే రచనలనా? అనాదిగా ఎడతెగకుండా నడుస్తున్న ఈ చర్చకు శరత్‌గారి "ఎవరు" నవల మరో సారి తెర తీసింది. ఈ నవల విభిన్న కథల సమాహారం. నవల ఆద్యంతం 'ఎవరు' నవలపై ఆంధ్ర రాష్ట్రంలో కలుగుతున్న సంచలనం దానికి రచయిత ప్రతిస్పందన మాత్రమే ఏకసూత్రం. మిగతా భాగమంతా వేరు వేరు కుటుంబాలలో ఈ నవల కలిగించిన సంక్షోభం, సంభ్రమాల ప్రహసనమే. ప్రతి సంఘం కొన్ని విలువలే పునాదిగా మనుగడ సాగిస్తుంటుంది. అలాంటి విలువల్ని ఒక రచయితో, ఒక ఉద్యమకారుడో వచ్చి కూల దోసి తమదైన శైలిలో నూతన సమాజాన్ని ఆవిష్కరిస్తారు. ఆ ప్రయత్నాలకు ఎల్లప్పుడూ అనుకూల, ప్రతికూల స్పందనలు ఎదురవుతుంటాయి. ఏది మంచి, ఏది చెడు అనే ప్రశ్నకు సమాధానాన్ని అన్వేషించవలసిన బాధ్యత సమాజానిదే కాని సాహితీ విమర్శకులది కాదు. విజ్ఞాన శాస్త్ర వాస్తవాలను ఆధారం చేసుకుని రూపుదిద్దిన 'ఎవరు' నవల మరలా అలాంటి ప్రశ్ననే లేవనెత్తి వాదోపవాదాలకు ఆరంభం పలికింది.

**-నరసింహప్రసాద్ పి.వి.ఎల్., కరీంనగర్.**

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804. & www. eenadu .net

## ఊసరవెల్లి సరస్సులు

ఇండోనేషియా ద్వీపం 'ఫ్లోర్స్'లో ఒకనాటి అగ్ని పర్వతం 'కెలి ముటు'పై ఏర్పడిన సరస్సులివి. 5200 అడుగుల ఎత్తున ఏర్పడిన ఈ సరస్సులు ఊసరవెల్లి మాదిరిగా రంగులు మారుస్తుంటాయి. ప్రస్తుతం నలుపు, ముదురు ఆకుపచ్చ, లేత ఆకుపచ్చ రంగుల్లో ఉన్న ఈ సరస్సులు గతంలో నలుపు, నీలం, మెరూన్ రంగుల్లో ఉండేవి. 1960వ దశకంలో ఎరుపు, గోధుమ, నీలం రంగుల్లో ఉండేవి. ఇలా సరస్సుల రంగు మారడానికి కారణమేమిటో తెలియదు. ఈ సరస్సుల్లో ఆత్మలు కొలువు తీరతాయని, వాటి స్వభావాల వల్లే ఈ రంగులు మారుతుంటాయని స్థానికుల విశ్వాసం.



CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RN1/32186/78

# అందరికీ అనుగుణంగా. . .
# ఆరు రకాల ఆయిల్స్ !






**priya**

## Edible Oils

రైస్‌బ్రాన్ ఆయిల్ • గ్రౌండ్‌నట్ ఆయిల్
సన్‌ఫ్లవర్ ఆయిల్ • పామోలిన్ ఆయిల్
నువ్వుల నూనె • ప్రీతం కొబ్బరి నూనె

www.priyafoods.com

USHODAYA ENTERPRISES LIMITED (Priya Foods Division) D.No: 3-9-907/2, 1st Floor, Mahaveerlok Complex, Himayathnagar, Hyd- 29 Tel No.: + 91 40 23220446, 23220421 Fax: 91 40 23220487